

జాన్ స్టూఅర్టు మిల్లు.

# పీఠిక

ఈయుపన్యాసము నిదివఱకు నాంగ్లేయభాషలో బీ. యే. పరీక్షనిమిత్తము చదివినవారును, స్వాతంత్ర్య స్వరూపనిమిత్తము పఠించిన వారును, ఏతద్గ్రంథకర్తయందలి గౌరవము చేత దీనిని రుచిచూచినవారును, దీనియందాదరణమును నభిమానమును కలిగియుండక మానరు. తత్త్వవిచారణములోఁ బ్రముఖుఁడును, అర్థికశాస్త్రమునకు నిధియు, తర్కశాస్త్రవిశారదుఁడును, రాజనీతి కోవిదుఁడును, సంస్కరణధురీణుఁడును, పండితుఁడును, ధర్మజ్ఞుఁడునైన, జాన్ స్ట్యూఅర్టు మిల్లు అను మహానుభావుడు దీని నాంగ్లేయభాషలో 1859 సంవత్సరమునఁ బ్రచురించెను. మిల్లు క్రైస్తవమతావలంబకుఁడు కాకపోయినను క్రైస్తవమతాచార్యులొకరీగ్రంథము నామూలాగ్రముగ నొక్కపట్టునఁజదివి యందువలనఁ దన బుద్ధికిఁ బ్రసాదగుణమును ధయిర్యమును కలిగెనని దానిమహిమను వర్ణించియుండెను. తండ్రిగారి శిక్షవలన మిల్లు మిక్కిలిచిన్ననాఁడే యనగా మూడవయేటనే తన మాతృభాష కాని గ్రీకు భాషను నేర్వమొదలుపెట్టి యెనిమిదవయేట లాటినుభాషనారంభించి పండ్రెండేండ్లు వచ్చునప్పటికి తర్కశాస్త్రము, అర్థికశాస్త్రము, ఆధ్యాత్మికవిద్యలు బహువిస్తారముగ నభ్యసింపసాగెను. పదునేడేండ్ల పిన్నవయసునాటికి గ్రీకు, యింగ్లీషు, లాటిను, ఫ్రెంచి, భాషలయందుబహుగ్రంథపరిచయమునుసంపాదించి తర్కశాస్త్ర తత్త్వశాస్త్రములందుఁ బండితుఁడనిపించు

కొని రాజకీయ సాంఘిక వ్యవహారములందు సంస్కర్తయని పేరువడసెను. విద్వాంసుఁడును సమర్థుఁడును మాత్రమేకాక గుణవంతుఁడును వీర్యవంతుఁడును, ధర్మవంతుడును, యుక్తచారిత్రుఁడును, లోకహితపరుఁడునని ప్రసిద్ధిఁగాంచెను. ప్రతి పక్ష వాదములో యుక్తములైన సంగతుల నొప్పుకొనుటచేతను, స్వపక్ష నిర్వాహణమందుఁ బూర్వపక్షాను వాదము చేయవలసి వచ్చినపుడు మిక్కిలి న్యాయైక చిత్తుఁడుగ నుండుటచేతను, ఈయనబహు నిష్పక్ష పాతియని కీర్తిఁగాంచెను. తండ్రిగారీయన కేవిధమైన మతవాసన యంటని శిక్షలోఁ బెంచినను, ఈయన కేమతాభి మానమును లేకపోయినను, అంత్యకాలమున కాస్తి కత్వమునుగూర్చి తటస్థుడుగఁ నయినఁ గొంతవఱకు విచారించి మూఁడుపన్యాసము లను వ్రాసెను. ఈయన స్త్రీపురుషుల స్వాతంత్ర్యమునందు సమానగౌరవము గలిగి [illegible]నిని సాధించుటకై కృషిచేసెను. ఈసుగుణములన్నియు నీస్వాతంత్ర్య విషయకోపన్యాసములలో నెక్కడఁ జూచినను గన్పట్టుచుండును. వ్యక్తిస్వాతంత్ర్య మునుగూర్చి యింత విపులముగను స్పష్టముగను యుక్తి యుక్తముగను,గాఢానురాగముతోడను వాదముచేసి మానవ జాతియొక్క శ్రేయస్సున కది ప్రధానమని యింతదృఢము గఁ బ్రతిపాదించు గ్రంథము మఱియొకటి సాధారణము గఁ గానరాదు. కాన నిదియాంధ్ర ప్రపంచమునకుఁ దెలియు నిమిత్తము భాషాంతరీకృతమై ప్రచురింపఁబడినది. దీనియందలి వాదములు చరిత్ర జ్ఞానము నాధారపఱచుకొని తర్కశైలి నవలంబించి యుండుటచేఁ జదువరులా వాదములను జాగరూ

కతతోఁ బఠించి శ్రద్ధతో మననము చేసినఁగాని యవి సంపూర్ణముగఁ బోధపడఁ జాలవు. అవగాహనమునకు సాహాయ్యముగ నుండునట్లు ప్రతి ఘట్టముయొక్క ప్రారంభమునను మూలములో లేని శీర్షికలు పొందు పఱుపఁ బడినవి. ఉపన్యాసమును జదువునప్పుడు తద్విషయమెక్కువసులభముగఁ దెలియు నిమిత్తము దానిలోని కొన్ని ముఖ్యసిద్ధాంతము లీక్రింద నుదాహరింపఁ బడియున్నవి.

సామాన్య ములు.

“లౌకిక, తాత్త్విక, శాస్త్రీయ, నీతివిషయిక, మతసంబంధమైనసకలాంశములలోను బ్రతిమనుజుఁడును దనబుద్ధివృత్తులను మనోభావములను, అభిప్రాయములను, అభిమానములను, నిరూపించుకొనుటకు సర్వస్వాతంత్ర్యముండవలెను. ఎవరి యభిప్రాయములను వారువ్యక్తీకరించి ప్రచురము చేయుటకుఁ గావలసిన స్వాతంత్ర్య మితరమనుష్యులతోఁ సంబంధించిన ప్రవర్తనవిశేషమగుటంబట్టి వేఱువ్యాయముగ భాసింపవచ్చును. కానియది చాలవఱకు మనఃప్రపంచములోని స్వాతంత్ర్యముతోఁ దుల్యమైన ప్రాముఖ్యతను వహించుటచేతను, దానికాధారభూతములైన హేతువులే దీనికిని విస్తారముగ వర్తించుటచేతను మనోవాక్స్వాతంత్ర్యము లభిన్నములుగనున్నవి. రెండవ సంగతి, ఎవరియభిరుచినిబట్టి వారుప్రవర్తించుటకు ననఁగా నెవరి వృత్త్యనుసారముగ వారిజీవితపద్ధతి నేర్పఱచుకొని యెవరి కర్మఫలమునకువారు బాధ్యులై యథేచ్ఛముగ వ్యవహరించుకొనుటకు స్వాతంత్ర్యముండవలెను. ఇతరులకు నిట్టిప్రవర్తన మవివేకముగఁగాని యనుచితముగఁగాని, యధర్మముగఁగాని తోఁచినను మననడవడివలన వారికిహానికలుగ నంతవఱకువారు మనకేయాటంకమును జేయఁగూడదు. మూడవది, పూర్వోక్తమైన వ్యక్తిస్వాతంత్ర్యమునుబట్టి వ్యక్తులసంఘీభావమునకును దత్సమానవ్యాప్తిగల స్వాతంత్ర్యముండవలెనని తేలుచున్నది. అనఁగా నితరులకు హానికరముగాని యేకార్యము నిమిత్తమైనను యుక్తవయస్సువచ్చిన మనుష్యులు బలవంతమును మోసములేని రీతిని జేరి సంఘముగ నేర్పడుటకు స్వాతంత్ర్యముండవలెను.”

"ఏ సంఘములో నీస్వాతంత్ర్యములకుఁ దగుగౌరవములేదో యాసంఘమునకు స్వాతంత్ర్యమేలేదు. ఎక్కడనవి సంపూర్ణముగను అసంకుచితముగను భాసింపవో యక్కడ సంఘమునకుఁ బరిపూర్ణస్వాతంత్ర్యానుభవము లేదు. ఇతరులమేలునకు భంగముచేయ యత్నింపక, వారుదానినిబొందుట కాటంకముగావింపకుండు నంతవఱకు నెవరిమేలుకొఱకు వారియధేచ్ఛమైన కీతిని బాటుపడుటకుఁ గావలసిన స్వాతంత్ర్యమే స్వాతంత్ర్యనామమును కర్హమైనది. ఎవరిశరీరాత్మల సుఖమునకువారే క్రమమైన సంరక్షణకర్తలు. ప్రతిమనుజుని నితరులకుమేలని తోఁచినపక్కిని నడచుకొమ్మని నిర్బంధము చేయుటకన్న నెవరికిమేలని తోఁచినవైఖరిని వారిని బ్రతుకనిచ్చుటయే మానవజాతికి నెక్కువలాభకరము."

"ఈసిద్ధాంతము సంపూర్ణవ్యక్తతఁజెందిన మనుష్యులకే వర్తించునని ప్రత్యేకించి చెప్పనక్కఱలేదు. ఇచ్చట పిల్లలవిషయమయ్యును ధర్మశా విశేషములు స్త్రీప్రకారము యుక్తవయస్సురాని స్త్రీ పురుషుల విషయమయ్యు ముచ్చటించుటలేదు. ఇతరులు సంరక్షింపవలసినయవస్థయందున్న వారి నితరులవలనహానినిజెందకుండ గాపాడినట్లు వారు చేసికొను పనులవలనఁ గూడగీడుమూడకుండఁ గాపాడవలయును. ఇదే కారణమును బట్టి యాత్మసంరక్షణము చేసికొనలేక పిన్నవయస్సులోనున్నట్లుభావింపఁదగిన హీనజాతులవారినిఁగూడ బ్రస్తుతవిచారమునుండి తొలఁగించి వేయుచువను."

అభిప్రాయవిషయమున నున్నంత స్వాతంత్ర్యము క్రియావిషయమునఁ గూడ నుండవలెనని యెవరును చెప్పఁబూనుకొనరు. అభిప్రాయములను వెల్లడి చేయుటవలనఁ జెఱుపునకు గారణమైన సందర్భములలో వానికి నియతము కొంతపరిమితిని విధింపవలసియుండును. ధాన్యపువర్తకుల మూలమున పేదలు మాడుచున్నారు. ఆస్తి నిఁదాసుకొనుట దొంతనముతో సమానము. ఈమొదలైన యభిప్రాయములను గ్రంధములమూలముగా మాత్రము ప్రచు

రపఱపి నంతనఱకు వారిజోలికిఁ బోఁగూడదు. కాని క్షుద్రజనము కోపావేశముతో ధాన్యపు కొట్లయొద్దఁ జేరియున్నప్పుడిట్టి సంగతులను వారిచెవిని బడవేయుటయుఁ గాగితములమీఁద నెక్కించివారికిఁ బంచిపెట్టుటయు దండనార్హమగును. తగినంత కారణము లేకుండ నితరులకు నష్టము చేయు కార్యములను నిరాదరణము చేసి, యావశ్యకమైనయెడల నాటంకపఱపవచ్చును. ఎప్పుడును నితరులకు బాధకరము కాఁగూడదు. ఇదియే వ్యక్తిస్వాతంత్ర్యమునకుఁ బరిమితి.

“తనకు లాభము కలుగనియెడల నితరుల శ్రేయస్సునుగాని సత్ప్రవర్తనమునుగాని తలపెట్టక యొకరితో నొకరికి సంబంధము లేకుండ బద్ధకించి, తనమేలును మాత్రము చూచుకొమ్మని యీసిద్ధాంతముయొక్క తాత్పర్యముగాదు. అట్లెంచుట గొప్ప పొరబాటు. ఇతరుల మేలును వృద్ధిపఱచుటలోఁ గృషి యెంతమాత్రము తగ్గించుటకు మాఱుగ నెక్కువ స్వార్థపరిత్యాగముతోఁ గృషి విస్తారముగాఁ జేయవలసిన యావశ్యకమున్నది. అయినను స్వార్థపరత్వము గాని పరశ్రేయోపేక్ష చేత నితరులకుఁ బ్రోత్సాహము కలిగించుటలోఁ గఱ్ఱదెబ్బలు వంటిసాధనములుగాక యితరసాధనములను గనిపెట్టి వారికి మేలు కలిగింపవచ్చును.

“ఒక మనుజుని స్వలాభమునుగుఱించిన గుణదోషములకును, వాతనినిగుఱించి యితరులకుండు మనోభావములకును సంబంధము లేదని నాతాత్పర్యము గాదు. అట్లుండుట సాధ్యమును, నపేక్షణీయమునుగూడఁ గాదు. ఎవ్వఁడైనను దనకు శ్రేయోదాయకములైన గుణములలో నేనిచేతనైనను బ్రముఖుఁడైనచో నాతఁడు మానవులు చెందఁదగిన పరమావధికిఁ గొంతసమీపించునుగనుక నంతవఱకు శ్లాఘనీయుఁడగును. ఆగుణములలో నేనియందైన విశేషలోపము గాన్పించినయెడల దూష్యుఁడగును. అతని యవివేకమును దుష్టశీలమును గొంతపరిమితిని దాటినతోడనే యాపురుషుని హింసించుట న్యాయము కాకపోయినను వానిమీఁదఁ దప్పక చీదఱపుట్టుట

న్యాయము. ఈలోపములు మిక్కిలి యధికమైన తావులందు నవజ్ఞకూడఁ గలుగక మానదు. వీనికి వ్యతిరేకములైన మంచిగుణములుగల పురుషునియందు వాని కనురూపములైన మనోభావములు పుట్టక మానవు.

“ఇంతియకాక కర్తకు మాత్రమే హానికరములగు కార్యములు చట్టములచేత నిషేధార్హములు కాకపోయినను వానిని బహిరంగముగ జరిగించినప్పుడు మర్యాదకు లోపమైనచో నవియితరులయెడ నేరములగుచుండును. కనుక నవి నిషేధార్హములగును. అశ్లీలములైన కార్యములీ తరగతి నేరములలోఁ జేరుచుండును.”

2. వ్యక్తికి సాంఘిక స్వాతంత్ర్యమును సంపాదించుటయే యీయుపన్యాసముయొక్క ముఖ్యోద్దేశము. అనగా నాచారరూపముననుం, నభిప్రాయరూపముననుం, దండనరూపముననుం వ్యక్తిస్వాతంత్ర్యమునకు సంఘమొత్తుడు కలిగించకూడదని తాత్పర్యము. ఏతన్మాతృక గ్రంథకర్త ముఖ్యముగ నింగ్లాండును దేశించి యుపన్యసించి యుండుటంబట్టి యాయన ప్రతిపాదించిన సిద్ధాంతము లింగ్లాండు దేశమును గురించియే చెప్పఁబడెను. కనుక దీనిని జదువునపుడు “ఈదేశము” అని వచ్చినచోటనెల్ల నింగ్లాండు దేశమని గ్రహింపవలయును.

ఈయుపన్యాసము 1859వ సంవత్సరమున నాంగ్లేయ భాషలో మొట్టమొదటఁ బ్రకటితమైయుండినందునను, భాషాంతరీకరణములో నేవిధములైన మార్పులను జేసి యుండనందునను దీనిని జదివెడివారు యేబదిసంవత్సరముల కాలభేదమును గూడ గమనింపవలయును.

3 ఈగ్రంథమందలి యుపపత్తులన్నియుఁ బాశ్చాత్యులకు సర్వసాధారణములైనట్టియుఁ గేవలము వ్యవహారసిద్ధములైనట్టి

యద్వైత దృష్టితో నిరూపింపఁ బడినవి. వీనినే పారమార్థిక వ్యావహారిక సమన్వయ సమర్థమగు భేదాభేద దృష్టితో విచారించినప్పుడవి యేరూపము నొందునో బుద్ధిమంతులు గ్రహింపఁ గలరు. ఇక్కడా విషయమును గూర్చిచర్చించుట కవకాశము చాలదు.

4 శబ్దార్థచంద్రిక యను నిఘంటునకుఁ గర్తలగు బ్రహ్మశ్రీ మహాకాళి సుబ్బారాయఁడుగారీగ్రంథమును బరిష్కరించి నందున కెంతయు వందనీయులు.

దుగ్గిరాల రామమూర్తి.



# స్వాతంత్ర్యదర్శనము.

## ప్రథమాధ్యాయము.

### అనుక్రమణిక.

విషయము

కార్యనిశ్చయమందు మనుజులకు బుద్ధిస్వాతంత్ర్యము కలదనిలేదనివాద ప్రతివాదములు రెండుకలవు. ఈయుపన్యాస మట్టిస్వాతంత్ర్య విషయమైనది కాదు. దీనియందు రాజక సాంఘికములలోఁ బ్రతి మనుజున కుండవలసిన స్వాతంత్ర్యమునుగూర్చి విచారింపఁబడును. ప్రతి వ్యక్తిమీఁద సంఘమున కేవిధముగ నెంతవఱకు నధికారముండుట న్యాయము? ఈప్రశ్నను సమగ్రముగ విచారించుట యరుదైనను గ్రియకు నిప్పటి వాదములన్నిఁటిలోనదియంతర్భూతమైయుండి వానిని విస్తారముగ బాధించుచునే యున్నది. ఇంతియకాక భావికాలమం దీప్రశ్నే ప్రధానముగ గ్రహింతురు. ఒక పక్షమున నీవిషయము కేవలము క్రొత్తది కాదనియును జెప్పవచ్చును. ప్రాచీనకాలమునుండియు మనుజులీసంగతిని గుఱించి వివాద పడుచునే యున్నారు. అయినను మానవకోటిలో నెక్కువ నాగరికతగల జాతుల వారందఱు నిప్పుడు చెందియున్న యభివృద్ధినిబట్టి దీనికి నూతన సందర్భము లేర్పడినవి. కాన దీనిని నవీన ఫక్కిని ఎక్కువ లోఁతుగ విచారింపవలసి యున్నది.

**నిరంకుశ ప్రభుత్వము**

మనకుఁ దెలిసినంతవఱకు మానవుల చరిత్రయొక్క ప్రాచీనభాగము లలో ముఖ్యముగ గ్రీసు, రోము, ఇంగ్లాండుదేశ చరిత్రములలో నధికారమునకును, స్వాతంత్ర్యమునకును జరిగిన పోరాటమే ముఖ్యాంశము. కాని, పూర్వకాలమం దీపోరాటము ప్రభుత్వపు వారికని ప్రజలకును జరిగియున్నది. ఆ కాలములో రాజ్యపరిపాలకులవలన నుపద్రవము రాకుండఁ గాపాడుకొనుటయే స్వాతంత్ర్యమని గ్రహించు చుండిరి. గ్రీసుదేశమందలి జనసమ్మతమైన ప్రభుత్వములలోఁదప్ప పరిపాల కులకును వారిపాలనలోనున్న ప్రజలకు నావశ్యకముగ విరోధముండునని భావించుచుండిరి. పాలనమువహించినవ్యక్తికిని, ( Individual ) శాఖకును, జాతికిని, గూడ నధికారము దాయమువలననో, విజయమువలననో, సంపాద్య మయినదిగాని యెంతమాత్రమును ప్రజల యిష్టానుసారముగ నేర్పడినదిగాక యుండెను. వారి యధికారమును గూర్చి వివాదపెట్టుటకుఁ బ్రజలెప్పు డును సాహసింపలేదు సరిగదా, యట్లుచేయవలయునని బహుశా వారికిఁ గోరికయైనఁ బుట్టియుండదు. అధికారులవలన నుపద్రవము గలుగకుండునట్లు మాత్రము జాగ్రత్తపడుచుండిరి. ప్రభువుల కధికారముండుట యావశ్యకమని యెంచినను దీనివలన గొప్పవిపత్తులు పుట్టవచ్చుననియు వారాయధికారమును శత్రువులమీఁదఁ బ్రయోగించినట్లే తమమీఁదఁగూడఁ బ్రయోగింపవచ్చు ననియు గ్రహించిరి. ఒకసంఘములోని దుర్బలులైన వారిని లెక్కలేకుండఁ బ్రతిమనుజుఁడును బొడుచుక తినకుండ నందఱకంటె బలవంతుఁడైన వానిని బ్రభువుగ నేర్పఱచి తక్కినవారి నణఁచిపెట్టునట్లు నియమింపవలసిన యగత్యమువచ్చెను. కాని, యీప్రభువుకూడఁ దక్కిన క్షుద్రులవలె సంఘమును బీడింపవచ్చును. కాన నతని బారినుండి కాపాడుకొనుటకు యత్నింపకతప్పదు. కనుక సంఘముమీఁదఁ బ్రభువునకుఁగల యధికారమును బరిమితిలోనుంచుటయే దేశభక్తులైన వారి యుద్దేశమయి యుండెను. ఈపరి మితిని వారు స్వాతంత్ర్యమని గ్రహించి దానిని రెండువిధముల సాధించు టకుఁ బ్రయత్నించిరి. మొదటిపద్ధతి, ప్రభువైనవాఁడు తన ప్రభుత్వ

మందుఁ బ్రజలకుఁ గొన్ని స్వాతంత్ర్యములను స్వత్వముల నంగీకరింపవలెను; వాని కతఁడు భంగ మొనరించిన యెడల తన విధాయకకృత్యము నుల్లంఘించినవాఁడగును. ఇంతియెకాక యట్టి భంగము గలిగినప్పుడు ప్రజలు ప్రత్యేకవైఖరిని ప్రభువు నెదిరింపవచ్చును. లేదా మొత్తముగఁ దిరుగఁబాటుకూడఁ జేయవచ్చును. ఇట్లు కొంతకాలమైన పిమ్మట మఱియొక యుపాయమును బన్నిరి. ఈ రెండవయుపాయము వలనఁ బ్రభువైన వాఁడు చేయు ముఖ్యకార్యము లన్నిఁటికిని సంఘముయొక్క గాని సంఘ ప్రతినిధి సభయొక్కగాని యంగీకార మావశ్యకమైనది. దీనిమూలమున రాజ్యతంత్రములోనే ప్రభువుల యధికారమున కంకుశము లేర్పడినవి. ఈ రెంటిలో మొదటిపద్ధతికి యూరోపుదేశములలోఁ జాల మట్టుకుప్రభుత్వము చేయువారు కొంచెముగనో, గొప్పగనో, లోఁబడవలసి వచ్చెను. రెండవపద్ధతివిషయములో మాత్రమిట్లు జరుగలేదు. ఇదిలేఁచోట్ల దీనిని సాధించుటయును, గొంతవఱకు లభించినతావుల మఱింతపూర్తిగఁ బొందుటయును, స్వాతంత్ర్యాభిమానులకు సర్వత్ర ముఖ్యోద్దేశముగ నేర్పడెను. మానవజాతి యొక శత్రువుచేత మఱియొకశత్రువును గొట్టించి, యొక యజమానుని నేర్పఱచుకొని, యతఁడు దౌర్జన్యము సేయకుండ నేదియోకొంత సార్థకమైన కట్టుబాటుమీఁద వానిపాలనకు లోఁబడి యుండుటతోఁ దృప్తిఁజెంది యంతటితో నిలిచిపోయిరి. కాని యంతకుఁ బై సంగతులను గోరరైరి.

ప్రజాస్వామికము

అయినను వారి వ్యవహారములు సాగిపోవను బోవను ఒకానొక కాలమునకుఁ దమకుఁ బ్రభువులుగనున్నవారు తమ లాభమునకు భంగముగవేఱుస్వాతంత్ర్యశక్తితో నుండుటస్వభావసిద్ధమైన యావశ్యముకాదని యూహింపమొదలుపెట్టిరి. రాష్ట్రములో నుండు సకల యధికారులను దమకుఁ బ్రతినిధులుగ నుంచి తమ యిష్టానుసారము వారిని దొలఁగింపఁ గలిగియుండుట యెక్కువ బాగుగనుండునని

తలంచిరి. ప్రభువులు వారియధికారమును నక్రమముగ విని యోగించి, తమకు నష్టముచేయకుండఁ గాపాడుకొనుటకు నిదియే సంపూర్ణమైన మార్గమని యెంచి, క్రమక్రమముగ నెక్కడెక్కడ సామాన్యజన సంఘము లేర్పడెనో యక్కడక్కడ నీ సంఘములవారు తమ యిష్టము వచ్చిన యధికారులను దమయిష్టమువచ్చినంత కాలముండునటుల నేర్పాటు చేసి, తమ కధికారము సంపాదించుకొనుటకుఁ దమ యత్నముల నన్నిఁటిని ముఖ్యముగ నడపించి, ప్రభువుల యధికారమును మట్టుపఱచుటకుఁ బూర్వము చేయుచువచ్చిన ప్రయత్నములను చాలవఱకు వదలుకొనిరి. ప్రభుత్వాధికారము నెప్పటి కప్పుడు ప్రజల యిష్టప్రకారమా నిర్ణయముచేయు ప్రయత్నము కొనసాగిన కొలఁది నాయధికారమును, మితపఱచుట యంతముఖ్యము కాదని కొందఱు యోచింప మొదలుపెట్టి, యీచర్య ప్రజలలాభమునకు నిరంతరము విరోధముగనుండు ప్రభువుల మీఁదఁ బ్రయోగింపవలసిన సాధనమనియుఁ బ్రభువుల లాభమును, గోరికను, బ్రజల లాభముతోడ, నిష్టముతోడ, నేకముచేసి, తన్మూలమునఁ బ్రభువులను బ్రజల నభేద మొనరింపవలసిన యగత్య మిప్పుడు వచ్చినదనియు, నేసంఘమునుగాని స్వేచ్ఛనుండి కాపాడవలసిన యగత్యముండదనియు, నేసంఘముగాని తనకుఁదాను దౌర్జన్యము చేసికొనునని జడియవలసిన పనిలేదనియుఁ, బ్రభువులు తమచర్యల విషయమై సంఘమునకుఁ గేవలము బాధ్యులైయుండి యగత్యమైనయెడల వెంటనే తొలఁగించుటకు వీలుగానున్నంతవఱకు వారిచేతిలో నధికారము నుంచవచ్చుననియు, నాయధికారము ప్రజలయధికారముకంటె భిన్నముగాదనియు వారు దానినొక్కచోటఁ జేర్చి ప్రయోగమునకు వీలుగానుండునటుల దానికొక యాకారము నేర్పఱచి యది యెటుల వినియోగపడవలెనో వారే నిర్ణయించుకొనుచున్నారనియు, యూరోపుఖండములోఁ బ్రజలపక్షమున నున్నవారు మొన్నమొన్నటివఱకును భావించు చాడుకకలదు. ఇంగ్లాండు దేశములోఁ దప్ప తక్కిన యూరోపు దేశములలోఁ బ్రజాపక్షవాదమం దిప్పటికిని నీ యభిప్రాయమే ప్రబలముగనున్నది. బొత్తిగ

నుండుట కవశ్యములయిన ప్రభుత్వ పద్ధతులలోఁ దప్ప తక్కినచోట్ల ప్రభువుల యధికారమును మితము చేయవలెనని తలంచు మహనీయు లెక్కడనో యపురూపముగ నున్నారు. ఈయభిప్రాయములకు హేతుభూతమయిన సంగతి సందర్భము లింకను నింగ్లాండు దేశములో నుండినపక్షమున నీ దేశస్థులుకూడ నింక నీభావమునే కలిగియుందురు.

ప్రజాపీడనము

పురుషులందును, రాజకీయ సిద్ధాంతములందును, తత్వసిద్ధాంతములందునుగూడ, భంగపాటు కలిగినప్పుడు బైటఁబడని లోపములును, తప్పులును, అవి జయప్రదములుగా నున్నప్పుడు వెల్లడియగును. ప్రజలు తమయధికారమున కవధి యేర్పఱచుకొనవలసిన యావశ్యకము లేదనునభిప్రాయముస్వతస్సిద్ధముగఁ గాన్పింపవచ్చును. అయినను, ప్రజాపరిపాలనము కేవలమభిప్రాయ మాత్రమయినప్పుడును పూర్వమందెప్పుడో యాచరణములోనున్నట్లు గ్రంథములోఁ జదివినప్పుడును నట్లు తోఁచవచ్చును. ప్రభుస్వామిక (Monarchical) అభిజనస్వామికముల (Aristocratic) నిరంకుశాధికారము మీఁద నొకపెట్టునఁ దిరుగఁబాటుజరిగినప్పుడెవరో కొద్దిమంది లేనిపోని యధికారమును వహించుటవలనఁ బుట్టిన వైపరీత్యములలో నికృష్టమయినవి సహితము ప్రజాస్వామిక ప్రతిష్ఠాపన ప్రచారముతో నిత్యము సంబంధముగలవి కావు. కాన, ఫ్రెంచివారి తిరుగఁ బాటువంటి తాత్కాలికమయిన వైపరీత్యములు కలిగినప్పుడు నయితము పూర్వోక్తమయిన యభిప్రాయము వదలి పోలేదు. కాలక్రమమున భూలోకములోని చాలభాగములలో ప్రజాస్వామిక పద్ధతి వ్యాపించి, యన్ని జాతులకును సంఘీభావములో గొప్ప శక్తివంతమైన సాధనముగ నాటుకొనెను. ఇట్లు ప్రజలచే నెన్నుకొనఁబడి వారి కుత్తరవాది యైన పరిపాలనా పద్ధతి గొప్పసంగతిగ నేర్పడుటచేత దాని గొప్పతనమునకుఁ దగిన ఖండనములకును, విమర్శనములకును నది పాలుపడినది. స్వరాజ్యము, ప్రజాస్వామిత్వము, అనువాక్యములు యథార్థస్థితిని దెలియఁజేయుటలేదని యిప్పుడు కనఁబడెను. అధికారమును వహించిన ప్రజలు అధికృతులయిన ప్రజలకంటె భిన్నులు. సర్వా

జ్య మన్నప్పుడు ప్రతిమనుష్యుఁడును తక్కినవారందఱి చేతను బరిపాలింపఁ బడుటయే కాని యెవరికివారు ప్రత్యేకముగఁ బరిపాలించుకొనుట కాదు. క్రియకుఁ బ్రజల యనుమతియనినపుడు వారిలో నెక్కువ మంది యొక్క గాని యెక్కువ పనిచేయు సట్టివారి యొక్క గాని యనుమతి యని తేలుచున్నది. ఎక్కువమంది యని నప్పుడు నిజముగా నెక్కువమంది కావచ్చును. లేదా, కొంతమందియే యెక్కువగఁ గనఁబడ వచ్చును, కాఁబట్టి ప్రజలు తమలోఁ గొంతమందిని హింసింపఁ గోరికగలవారగుటకు నవకాశమున్నది. ఇతర విధములయిన యధికారదౌర్జన్యమునుండి కాపాడుకొనునట్లే యీ దౌర్జన్యమును నివారించు సాధనములు కూడ నగత్యము లగును. ఒక సంఘమునకు ననఁగా నాసంఘములోని బలవత్తరమయిన శాఖవారికి నధికారమును వహించినవారు చక్కగ బాధ్యులయి యుండవచ్చును. ఇంతమాత్రమున దొరతనపు వారికి వ్యక్తి (Individual) మీఁద నుండు నధికారమును బరిమితముగ నుంచవలసిన యగత్యము తగ్గిపోలేదు. ఈ యభిప్రాయమాలోచన పరులగు వారి బుద్ధికి నాటియే యున్నది. యూరోపు ఖండవాసులలో ముఖ్యులయిన శాఖలవారికి నిజముగనో, భ్రమచేతనో ప్రజాస్వామికము గిట్టదను కొను చుందురు. వారికి నీయభిప్రాయ మాదరణీయమై సులభముగ సిద్ధాంత పడుచున్నది. ఇతర యిక్కట్టులనుండి కాపాడుకొనవలసినట్లే పైని జెప్పిన యెక్కువమందిచేతఁ బ్రజాపీడనమునుండి కూడ సంఘము కాపాడుకొనఁబడవలసియున్నదని సామాన్యముగ రాజనీతి సిద్ధాంతములలో నిప్పు డొప్పుకొనుచున్నారు.

సాంఘిక దౌర్జన్యము

ఇతరపీడనములవలెనే యెక్కువమందిచేతఁ బీడనమును రాజకీయముఖముగ బాధించుచుండునని మొట్టమొదట జడియుచుండిరి. జనసామాన్య మిప్పటికినటులనే తలఁచుచున్నారు అయిన నొక సంఘములోఁజేరిన వ్యక్తుల (వేలువేలు మనుష్యుల) మీఁద నా సంఘము సమూహముగ దౌష్ట్యమును వహించినప్పుడు దానిచేతిక్రిందనున్న

రాజకీయోద్యోగుల చర్యల మూలముననే కేవలము తన దౌర్జన్యమును జూప దని యాలోచనపరుల కందఱకుఁ బొడకట్టెను. సంఘము స్వయముగ శాసనములఁజేసి, వానిని బ్రవర్తింపఁజేయఁగలదు. తానుజోక్యము కలుగఁజేసికొన కూడని సందర్భములలో ననుకూలముగానో ప్రతికూలముగానో సవ్యముగనో, అపసవ్యముగనో, కొన్ని శాసనములు చేసి రాజకీయములైన హింసలకంటె మిక్కిలి కఠినముగ సాంఘిక రీతిని బీడింపఁగలదు. ఎట్లంటేని, తన యధికారమును నిలువఁబెట్టుటకు రాజకీయములయిన శిక్షలవంటి కఠిన శిక్షలను విధింపక పోయినను దానిపట్టులోనుండి తప్పించుకొనుట కుపాయములు తక్కువగ నున్నవి. సాంఘిక పీడనము మనుష్యుల దిన చర్యలలో లోఁతుగఁబ్రవేశించి మనస్సును సహితము వశపఱచుకొనును. కనుక రాజకీయోద్యోగుల దౌర్జన్యమును నివారించుకొనుటచాలదు. బహుజనాభిప్రాయమువలనను, మనోభావము వలనను గలుగు బాధనుగూడ నివారించుకొన వలసిన యగత్యమున్నది. రాజకీయములయిన శిక్షలవలనఁ గాక యితర సాధనములచేతఁ దన యభిప్రాయములను నాచరణములను వీనిలోనుండి భేదించినవారి ప్రవర్తనమునకు నిర్బంధములుగఁ జేసి తన పద్ధతులలోఁ గలియని వ్యక్తియు స్వతంత్రముగ నేర్పడకుండునట్లు నిర్బంధించి, తా నేర్పఱచిన విధముగ నందఱును నడచుకొనునట్లు బలవంతపెట్టు స్వభావము సంఘమునకుఁ గలదు. ఈ యుపద్రవమును గూడ నివారించుకొనుట యగత్యము. వ్యక్తిస్వాతంత్ర్యమును సంఘాభిప్రాయము బాధించుట కొంత వఱకే న్యాయము. ఆమితిని గనిపెట్టి దానికి మించి పైఁబడకుండఁ గాపాడుకొనుటకై వ్యవహార కాండను మంచి స్థితిలోనుంచుట యత్యావశ్యకము. రాజకీయ విషయములో నిరంకుశ ప్రభుత్వమునుండి కాపాడుకొనుట యెంత యావశ్యకమో యిదియు నంత యగత్యమై యున్నది.

సామాన్య ప్రవృత్తి

ఈ సిద్ధాంతమును సామాన్యముగఁ జెప్పినప్పుడు బహుశా యెవరును వివాదము చేయకున్నను క్రియలో నీ మితి

నెక్కడ నేర్పాటు చేయవలెనో, వ్యక్తిస్వాతంత్ర్యమునకును సాంఘికాధికారమునకును సరియైన సమన్వయ మెట్లుచేయనగునో మాత్రము నిశ్చయించుటకు విశేషముగఁ బనిజరుగవలసి యున్నది. ఇతర మనుష్యులు చేయుపనులకు నాటంకము కలిగింపకుండ నెవరికిని జీవయాత్ర యనుకూలముగఁ బోసఁగదు. కనుక ప్రవర్తనములను శాసించునిబంధనములను గొన్నిటిని బ్రాయికముగ ధర్మశాస్త్రము విధింపవలసి యున్నది. తరువాతఁ జట్టముల కట్టుబాటులోనికి ఎమ్మటు కలవికాని చాల విషయములలో నభిప్రాయ రూపములయిన నిబంధనములుకొన్ని యేర్పడవలెను. వ్యవహార కాండలో నీ నిబంధనములను విచారించి నిశ్చయించుటయే ముఖ్యము. మిక్కిలి స్పష్టమయిన యంశములం గొన్నింటిఁ దప్ప యీసంగతిని నిశ్చయపఱచుట కిది వఱకు జరిగిన కృషి బహుస్వల్పము. ఏదేశములవారును ఏకాలపువారును దీని నొక్కటే విధముగ నిశ్చయ పఱచి యుండలేదు, ఒక కాలములోఁగాని యొక దేశములోఁగాని, జరిగిన యట్టి నిశ్చయమునకు మఱియొక రాశ్చర్యపడుచుండుటయే గాని యెవరును ఎప్పుడును దీనిలో నేవిధమైన కష్టమున్నదని గ్రహించినట్లగపడదు. మనుష్యులందఱు నీయంశములో నేకాభిప్రాయులయి యున్నటుల నెంచి మిన్నకున్నారు. ఎవరి నిబంధనములు వారికిస్వతస్సిద్ధములుగను, స్వతఃప్రమాణములుగను, గనుపట్టుచుండును. ఇట్లుసర్వలోకము భ్రాంతిఁజెందుటనుబట్టి యాచార మనునది యెంత యింద్రజాలమును గలిగించునో తెలియఁగలదు. సాధారణముగా నాచారము నైసర్గికము తరువాత నైసర్గిక మంతదని చెప్పుటయే కాని, ఆచారమునుజూచి నైసర్గికమేయని నిరంతరమును భ్రమఁజెందుచున్నారు. ఆచారమహిమవలననే కదా, మనుజులొకరి ప్రవర్తనము విషయమైయొకరుచేసి కొనిననిబంధనములలోఁ బొరపాటు లుండునేమోయని సంశయమయిన బొత్తిగఁ గలుగకయున్నది. ఒకరికొకరుగాని యెవరికి వారుగాని యీవిషయములో హేతువులను దెలియపఱచుకొనవలసిన యగత్యములేదని సామాన్యముగఁ దలంచుటవలన నాచారమహిమ సంపూర్ణముగ

విజృంభించినది. ఇట్టి సంగతులలో హేతువులకంటె మనోభావములే మంచి వనియు, హేతువులనగత్యమనియు నమ్మియుండుటకు జనులలవాటుపడుట యేగాక, తత్వవేత్తలమని ప్రసిద్ధిపొందువారిచేతఁ గొందఱీనమ్మకమునకుఁ బ్రోత్సాహముకూడఁ గలిగించుచున్నారు. మనుష్యుల ప్రవర్తనమును శాసించుటలోఁ బ్రతి మనుజుఁడును దనయిష్టప్రకారమును దనకాదరణీయులయినవారి యిష్టప్రకారమును, దక్కినవారందఱు నడచుకొనవలెనని కోరుచుండును. ఈకోరికనుబట్టియే వారివారి యభిప్రాయములు నిర్ణయమగుచున్నవి. ఎవరునుదనయిష్టముచొప్పననే విచారణము పరిష్కారము కావలసినదని స్పష్టముగ ననుకొనకపోయినను బ్రవర్తనాంశములో హేతుసిద్ధముకాని యభిప్రాయమునకావ్యక్తియొక్క యిచ్ఛకంటె వేఱుకారణమేమున్నది? ఒకవేళ, కారణములు చెప్పిన నవి యితరమనుష్యుల యిష్టము ననుసరించియున్నచో నాకారణములొక్కని యిష్టమునకు మాఱుగ బహుజనాభినివేశమును దెలియఁజేయునే కాని యెక్కువ కాదు. అయిన నీరీతిని దనయిష్టమునకు నితరులయిష్టము తోడ్పడినప్పుడది సామాన్యజనునకు నొకహేతువుగఁ గనఁబడి పూర్ణమయిన తృప్తిని గలిగించుచుండును. ఇంతియు గాదు. నీతి, అభిరుచి, క్రమము, వీనింగూర్చి వానిమతగ్రంథములలో స్పష్టముగ లేనిచోట్లనెల్ల వానియభిప్రాయముల కిదితప్ప వేఱుహేతువు సామాన్యముగఁ గలిగియుండదు. మతమును బోధఁజేసికొనుటలోఁ గూడ నిదియే వానికి ముఖ్యసాధనము. కనుక యేదేని సంగతి ప్రశంసనీయమా లేక నింద్యమా యను విషయములో మనుజుల యభిప్రాయము లనేకకారణముల వలన నిర్ణయమగుచున్నవి. ఈకారణములే యితరుల ప్రవర్తన విషయమయి వారికోరికల నిరూపించుచుండును. ప్రతి సంగతిలోను వారియిచ్ఛలను నిర్ణయించుట కెన్నికారణము లుండునో యిక్కడ నన్నికారణము లుండును. కొన్నిసమయములలోమాత్రము హేతుకజ్ఞానమును (reason) దక్కినసమయములలోనభినివేశములును మూఢవిశ్వాసములును దఱుచుగ సాంఘికానుకూల ప్రతికూలములును నీర్ష్యాసూయలును అహంకార

తిరస్కారభావములును నింతకంటె నెక్కువఁ దలుచుగ స్వవిషయమయిన యాశలును, భీతియు, క్రమాక్రమ విచక్షణలేని స్వలాభాపేక్షయు, నివియన్నియుఁబయినఁజెప్పిన కారణము లనఁదగును.

ఏయే దేశములందే యేశాఖవారాధిక్యత నువహించియున్నారో, ఆయా దేశములలో నినీతి చాలామట్టునకు నాశాఖవారి కనుకూలముగను, వారిసౌత్కృష్ట్యమునకుఁదగినట్లుగను నిరూపణమగుచున్నది. స్పార్టనులు హెలట్టులు, ప్లాంటరులు నీగ్రోలు, రాజులు, ప్రజలు, జమీందారులు, రయితులు, పురుషులు, స్త్రీలు, వీరికి పరస్పరసంబంధమయిన నీతి విస్తారముగఁబూర్వోక్తమయిన శాఖాభిమానములను లాభముల ననుసరించి పుట్టినదైయున్నది. ఈమనోభావములే యాధిక్యతనుబూనినశాఖలో వారిపరస్పర సంబంధములనుగూడ బాధించుచుండును. అయినను మొదటఁబ్రముఖులయిన శాఖవారు ప్రాముఖ్యతను గోలుపోయినప్పుడును, వారియాధిక్యత యసహ్యాకరమయినప్పుడును, జనులుసామాన్యముగ నాధిక్యతపేరు చెప్పినంత మాత్రముననే చీఁదలఁజెంది తమనీతివిషయికమైన యభిప్రాయముల నన్నిటిని దదనుగుణముగ మార్చుకొందురు. పరివర్తనమును గూర్చిన నిబంధనములన్నియు మఱియొక ముఖ్యన్యాయమునుబట్టి నిర్ణయమగుచున్నవి. చట్టములమూలమున నయిననేమి, అభిప్రాయబలమువలననేమి విధి నిషేధములేర్పడిన చోట్లనెల్ల నీన్యాయమే వర్తించుచున్నది. మనుష్యులు తమరాజులయొక్కయు, దేవతలయొక్కయు ననుగ్రహమునకును నాగ్రహమునకును దాసులుగవర్తింతురు. ఈదాస్యముస్వప్రయోజనపరమయినను గపటమయినదిగాదు. దీనివలనఁబుట్టు మనోవికారములు యథార్థములే గాని యసత్యములుగావు. మాంత్రికులను మతభ్రష్టులను మాడ్చివేయుట యీమనోవికార మహిమవలననేగదా! జను లిటువంటి నీచాకర్షణలకు లోనయినప్పుడుకూడ సంఘముయొక్క మేలును నీతివర్తనమును గొంత వఱకు మన్నింపకపోలేదు. అయినను ఈవిచారణ నహేతుకముగను స్వత

స్సిద్ధముగను బుట్టినదికాదు. పూర్వోక్తమయిన యాకర్షణలవలన జనిం
చిన గౌరవాగౌరవములనుబట్టి యేర్పడినది. కనుక నాయిష్టానిష్టములకుఁ
గేవలము సంఘముయొక్క లాభముతో సంబంధములేదు. అయినను నీతిని
సంస్థాపించుటయందవి చాలబలవంతములయిన యంశములుగఁ బొదుకొనెను.

మతవిషయము.

ఈసంగతినిబట్టి సంఘముయొక్క గానిదానిలోబలవంతమయి
యొకశాఖయొక్క గాఁ యిష్టానిష్టములేముఖ్యముగ నాచరణము
నకుఁ గావలసిన శాసనముల నేర్పఱచి స్మృతిరూపముననుఁ, అనాదరణరూపము
నను, దండనలను విధించుచున్నవని తేలుచున్నది. ఆలోచనపరులై సంఘము
కంటె ముందంగవేయువారు కొన్నికొన్ని చిల్లరసంగతులలోని యంశమును
గూర్చి యెంతవాదమును జేసినను పైనిఁజెప్పిన న్యాయమును మాత్ర మాక్షేపిం
పక నే యూరకుండిరి. వీరు సంఘముయొక్క యిష్టానిష్టముల క్రమా.
క్రమములను విచారించిరే గాని, యాయిష్టానిష్టములు వ్యక్తులకు శాసనమగు
నాయను సంగతిని విచారించినవారు కారు. తా మేవిషయములలో సంఘము
నుండి భిన్నాభిప్రాయులయిరో యాసంగతులలో సంఘముయొక్క యిష్టా
నిష్టములను మార్చుటకు యత్నించిరి గాని సామాన్యముగ విమతులందఱకును
గావలసిన స్వాతంత్ర్యమును సమర్థించుటకు యత్నింపరైరి. మతవిశ్వా
సములోమాత్రి మొక్కఁడొక్కఁడె కాకుండ మొత్తమున న్యాయైకదృష్టితో
స్వాతంత్ర్యమును సమర్థించుటకు నవ్యాహతములయిన ప్రయత్నములు జరిగి
యున్నవి. దీనిని బట్టిమతములో నెంతపొరపాటున కవకాశ మున్నదో
తెలియఁగలదు. మతావేశముగలవాని నీతి వృత్తాంతము నిష్కాపట్యమయి
నను అసహనముతోఁ గూడియుండును గదా.? జగదేకమతమని పేరుపెట్టుకొనిన
దానినుండి మొట్టమొదట విముఖులయినవారుకూడఁ దమలోనుండి చీలిపోవు
వారికి స్వాతంత్ర్యము నిచ్చుటకు నొప్పియుండలేదు. కలహసంబంధ
మయిన వెట్టతగ్గి యేశాఖవారికిని గెలుపుగలుగక యందఱును గూడనున్న
మట్టుకుఁ దమ యధికారమును నిలుపుకొనినఁ జాలునని
యెంచెడు కాలము రాఁగానే, యల్పసంఖ్యాకులయిన శాఖలవా రధికముగ

వ్యాపించుట కాశవదలుకొని, తక్కినవారిని దమమతములోనికి మరలింప లేకపోఁగాఁదమ్మైక వేఱుశాఖగా నుండనిచ్చినఁ జాలునని వాదింపమొదలు పెట్టిరి. కనుక వ్యక్తియొక్క స్వత్వము (rights) లకు సంఘము భంగము కలిగించుట న్యాయవిరుద్ధమని వాదములును, విమతులపై సంఘము వారధికారమును వహించుటకు స్వత్వము లేదని బహిరంగములైన ఖండనములును, విస్తారభాగము మతవిషయమున జరిగియున్నవి. మతవిషయిక స్వాతంత్ర్య సంపాదకులైన యుద్గ్రంథకర్తలందఱునుమనస్సాక్షియొక్క స్వాతంత్ర్యము నిర్వివాదమనియుఁ నెవఁడును వానిమత విశ్వాసములను గూర్చి యితరుల కెంతమాత్రము బాధ్యుఁడు కాఁడనియు ధ్రువపఱచిరి. అయినను మానవజాతికి దేనియం దభిమాన మెక్కువగనుండునో దానియం దసహనము నెక్కువగనే యుండును. కాన మతవిషయికమయిన కలహములవలన శాంతికి భంగము కలుగునని భీతిఁజెంది యాసంగతిలో నభినివేశమును వదలి యుదాసీనతను బొందుటకు మతస్వాతంత్ర్యము క్రియకుసిద్ధించినది కాదు. అత్యంతము సహనముగల దేశములలో సహితము మతాభిమానులు చాల భాగము ధారాళముగ సహిష్ణువులుగ నుండుటలేదు. ఇందులకు దృష్టాంతము ఒకరు ధర్మాను శాసనవిషయములో సహనమును బూనినను మతసిద్ధాంతములలో భేదములకు సమ్మతింపరు- మఱికొందఱు పోపు పీఠస్థులును యూనిటేరియనులును దక్కతక్కినవారియెడ సహనమును వహింతురు. ఇంకగొందఱు పౌరుషేయ మతములను మాత్రము సహింతురు. మఱికొంద ఱింకఁగొంచెము దూరము సాగినను నీశ్వరునియందును నాత్మయొక్క నిత్యత్వమందును నమ్మకము ముఖ్యమని యెంతురు. ఎక్కడెక్కడ బహుజనాభినివేశము యథార్థముగను దీవ్రముగ నున్నదో యక్కడక్కడ వీరికి వక్కినవారు లోఁబడవలెనను భావ మింకను దగ్గిపోకయున్నది.

ఇంగ్లాండు దేశములోని రాజకీయసంపద్భములనుబట్టి యితరదేశములలోఁ ఇంగ్లాండు కంటె జనాభిప్రాయరూపమైన యొత్తు డెక్కువయే యైనను దేశసంగతి జట్టములవలని బాధమాత్రము తక్కువగనున్నది. ఇక్కడ

జనులు రాజకీయములు గాని విషయములందుఁ దమ ప్రవర్తనములలో జట్టములు గాని యుద్యోగులు గాని ప్రత్యక్షముగ జోక్యము గలుగఁ జేసికొనుటకు నొప్పుకొనరు. ఈ స్థితి ప్రభుత్వము వారిని ప్రజలకంటె భిన్నులుగఁ జూచుటను బట్టివచ్చినది గాని వ్యక్తి స్వాతంత్ర్యమందలి గౌరము వలనఁ గలిగినది కాదు. బహుజనము లింకను ప్రభువుల శక్తిని దమశక్తిగను వారి యభిప్రాయమును దమ యభిప్రాయముగను భావించుట లేదు. ఇట్టిభావ మెప్పుడు పుట్టునో యప్పుడు వ్యక్తిస్వాతంత్ర్యమునకు జనాభిప్రాయము వలనఁ గలిగిన యొత్తుడు వలెనే ప్రభువుల వలనఁ గూడ నుపద్రవము జరుగవచ్చును. కాని అంతవఱకు మాత్రము చట్టములకు లోఁబడి యుండని విషయములలో వ్యక్తివ్యాపారమున కాటంకము కలుగఁజేయు యత్నములనన్నిటి నిరోధించుటకుఁ గావలసినంత యభిమానము ప్రజలయందున్నది. ఏసంగతిలోనుఁ జట్టములకు లోఁబడవలసిన భాగమానా కాదా యను వివేకము లేకుండఁగనే యీ యభిమానము బైలుపడుచుండును. మొత్తముమీఁద నీయభిమానము మంచిదయినను, ప్రవర్తనాంశములో మాత్రము సహేతుకమైన సంగతులలో నెట్లో నిర్హేతుకములయిన వానిలోఁ గూడ నట్లే జోక్యము కలుగఁజేసికొనుచున్నది. దొరతనపువారెంతవఱకు జోక్యము కలుగఁజేసికొనుట క్రమమో నిర్ణయించుటకుఁ బ్రసిద్ధమైన న్యాయ మొకటి యేర్పడియుండక పోవుటం జేసి ప్రజలు స్వేచ్ఛానుసారముగఁ బరిష్కరించుకొనుచున్నారు. కొందఱేదేని మేలును జేయుటకును గీడును దొలఁగించుటకును వీలున్నప్పుడు దొరతనపువారి నాపనికిఁ బూనుకొనుమని పురికొలుపుదురు. మఱి కొందఱు సంఘములో నెంతకీడునైన భరియించుట కొప్పుకొందురుగాని యిదివఱకే ప్రభువుల యధికారమునకు లోఁబడియున్న వ్యవహారములకుఁ దోడుగ మఱికొన్నిటిని జేర్చుటకు సమ్మతింపరు. ఏదేని నొకసంగతి తటస్థించినప్పుడు మనుష్యులు తమయభిమానముయొక్క సామాన్యగతినిబట్టియో ప్రభువులు చేయఁ బూనిన కార్యమందుఁ దమకుగల విశేషాభిరుచిని బట్టియో, ప్రభువు లా కార్యమునుఁ దమకు నంగీకారమయిన రీతిని జేయు

దురా లేదాయను నమ్మకము ననుసరించియో, పైని జెప్పిన రెండుపక్షములలో నొకదాని నవలంబింతురు. ఇంతియగాని ప్రభుత్వమువారు చేయఁదగిన కార్యము లేవియని పరిష్కరించుకొని యాయభిప్రాయప్రకారము తప్ప కుండ నడచుకొనుటలేదు. ఇట్లు పరిష్కృతమయిన న్యాయాభావము చేత నుభయపక్షములవారును సమానముగనే పొరపడుచుఁ బ్రభునిమిత్తమును ఆశ్రయించినను, ఖండించినను గూడ సమానమైన యక్రమము నే చేయు చున్నారు.

స్వాతంత్ర్యచట్టములమూలమున విధించుశిక్షారూపమైన శరీర నిరోధము ధర్మసూత్రము చేతనేమి, జనాభిప్రాయరూపమైన నీతిబలము చేతనేమి, సంఘమేయేసంబంధములలో వ్యక్తిని నిర్బంధము చేసిలోఁబఱచుకొనవచ్చునో యాసంగతిని సంపూర్ణముగ నిర్ణయింపఁగల ధర్మసూక్ష్మమును బ్రతిపాదించుటయే నీయుపన్యాసముయొక్క ముఖ్యోద్దేశము. ఆధర్మసూక్ష్మ మెద్ది యనిన, మనుష్యులు ప్రత్యేకముగఁగాని సమూహముగఁగాని వారిలో నెవరి ప్రవర్తనము నైనను శాసించుటకు నాత్మరక్షణయొక్కటియే తగిన హేతువు. నాగరికతగలసంఘములో నెవ్వనిమీఁదనైనను వానియిష్టమునకు విరోధముగ నధికారమును వహించుటయం దితరులకు హానిని దప్పించుట యొక్కటియే సరియైనయుద్దేశము. వానిశరీరమునకుఁగాని నీతికిగాని మేలు కలుగునని జోక్యము కల్పించుకొనుట సరియైనహేతువుకాదు. ఏకార్యమైనను మంచిదనికాని, దానివలనసౌఖ్యము హెచ్చగునని కాని యితరుల యభిప్రాయ ప్రకార మవివేకమును, అన్యాయము నగుననిగాని, యెవనినిఆకార్యము ను జేయుమని వలదని నిర్బంధించుట క్రమముకాదు. ఇట్టికారణము లున్నప్పుడు వానితో మొఱపెట్టుకొని, వాదించి, వెంటఁబడి బోధించి, బ్రతి మాలుకొనవచ్చునుగాని, బలవంతము చేయుటకును, భిన్నముగ నొనర్చినందు లకు విపత్తులపాలు చేయుటకును, మాత్ర మాకారణములు తగినవికావు. కేవలము ఒకరికిఁగాక మఱియొకరికిఁ గూడఁ దానివలన హానిసంభవింపనున్న ప్పుడు మాత్రమే యేకార్యమునుండియైనను వాని నిరోధించుటకుఁ దగు సమాధానముండును. ఎవనిప్రవర్తనమైన నితరులతో నెంతవఱకు సంబం

ధించునో యంతవఱకే వారుసంఘమునకు బాధ్యులగుదురు. ఎల్లవారును వమశరీరాత్మల పైని సర్వాధికారులు గనుక యేకార్యముగాని కర్తకు మాత్రముసంబంధించినంతవఱ కతఁడు సర్వస్వతంత్రుఁడుగ నుండవలెను. ఇది స్వతస్సిద్ధమైన స్వత్వము.

విశేష. ఈ సిద్ధాంతము సంపూర్ణవ్యక్తతఁ జెందినమనుష్యులకే వర్తించు విధి నని ప్రత్యేకించి చెప్పనక్కఱలేదు. ఇచ్చట పిల్లలవిషయమయ్యును ధర్మశాస్త్రప్రకారము యుక్తవయస్సురాని స్త్రీపురుషుల విషయమయ్యు ముచ్చటించుటలేదు. ఇతరులు సంరక్షింపవలసిన యవస్థయందున్న వారి నితరులవలనహానినిజెందకుండఁగాపాడినట్లే వారుచేసికొనుపనులవలనఁ గూడ గీడు మూఁడకుండఁ, గాపాడవలయును. ఇదేకారణమునుబట్టి యాత్మసంరక్షణము చేసికొనలేక పిన్నవయస్సులోనున్నట్లు భావింపఁదగిన హీనజాతుల వారిని గూడఁ బ్రస్తుతవిచారణమునుండితొలఁగించి వేయవచ్చును. జనులు స్వతంత్రముగ నభివృద్ధిఁజెందుటకుఁ బ్రారంభములో నాటంకము లెక్కువగ నుండును. వానినిదొలఁగించుటకు సాధనము లంతఁగాలేవు. కనుక యభివృద్ధిచేయవలెనను కోరికను బూర్ణముగఁగలప్రభు వెవ్వఁడైన నుపాయాంతరసాధ్యము గాని మేలును సాధించుట కేయుపాయమైనను బ్రయోగింపవచ్చును. అనాగరికులవిషయములో నిరంకుశప్రభుత్వమే సరియైనది కాని వారి యభివృద్ధియే దానికి నుద్దేశముగనుండి, యట్టిప్రభువు లుపయోగించు సాధనము లాయుద్దేశమును సాక్షాత్తుగా నెఱవేర్చుటచేత సమర్థనీయములుగావలెను. మనుజు లొకరితోనొకరు సమానముగను స్వేచ్ఛగను జర్చచేసి తన్మూలమున నభివృద్ధినిజెందఁగలస్థితిలోనికి రాకపూర్వము వ్యవహారకాండలోనెక్కడను స్వాతంత్ర్యమునొక న్యాయముగనంగీకరించుటకు వీలు లేదు. అంతపర్యంతమువారి యదృష్టవశమున, అక్బరుచార్లమేనులవంటి ప్రభువులుదొరకినయెడల వారికినిష్కర్షగ లోఁబడుటకంటె వేఱుగతిలేదు. అయిన నాత్మ నిశ్చయముచేతనో, యితరుల బోధనలవలననో వారియభి

వృద్ధికి వారుపూనుకొనునట్టి సామర్థ్యము మనుష్యులకుఁ గలిగినతోడనే వారిమేలుకొఱకు సహితము విధినిషేధములేర్పఱచి వానికి లోఁబడునట్లు దండనల నిర్ణయించిబలవంతముచేయుట యెంతమాత్రము నొప్పుకొనఁదగినది కాదు. ఇతరుల కనిష్టము జరుగకుండఁ గాపాడుటకు మాత్రమునిర్బంధము నంగీకరింపవచ్చును. ప్రస్తుతప్రసంగములోఁ జేరినజాతులకెల్ల నిట్టియవస్థ చాలకాలము క్రిందనే వచ్చియున్నది.

ఉపయోగానుపయోగ విచారణచేఁగాక కేవలన్యాయ విచారణ చేత నావాదమునకుఁ గలుగుబలమును నేనువదలు కొనుచున్నాను. నీతి విషయికమైన వాదములన్నింటిలోను బ్రయోజనమునే నేను పరమప్రమాణముగ నంగీకరింతును. కాని సతతప్రవర్ధమానమైన మానవజాతికి శాశ్వతశ్రేయము నొడగూర్చు భూరిప్రయోజనమే ప్రయోజనము. అట్టిప్రయోజనమును విచారించిన యెడల నేకార్యములలో నితరులమేలు సంబంధించియున్నదో యాకార్యములలో మాత్రము వ్యక్తిస్వాతంత్ర్యము నితరుల యధికారమునకు లోఁబఱచుట న్యాయమని నావాదము. ఎవరైన నితరులకు హానికరమైన కార్యముచేసినప్పుడు వారినిచట్టముల మూలముననో, చట్టములయందు జెప్పఁబడిన దండనలను విధించుటకు వీలులేనియెడల జనుల యనాదరణ మూలముననో దండించుట కవకాశము స్పష్టముగఁ గనఁబడుచున్నది. న్యాయసభలలో సాక్ష్యమిచ్చుటయు, తానేసంఘములోఁ జేరియుండి దానివలన రక్షణమును బొందుచున్నాఁడో యట్టి సంఘ సంరక్షణార్థము సమూహముమీఁదఁ జేయుకార్యములలోఁ దనపాలును దానుభరించుటయుఁ దోడిమానవుని ప్రాణమును గాపాడుటయు, లేక యక్రమ హింస నుండి తొలఁగించుటయు నింకఁబ్రతిమనుష్యునకును స్పష్టముగా విధాయకమైనట్టియు, చేయకుండినయెడల సంఘమునకుఁ గ్రమముగ బాధ్యుఁడు కావలసినట్టియు, సమస్తకార్యముల నితరుల లాభమునిమిత్తము చేయుమని ప్రతివ్యక్తిని బలవంతముచేయుటకూడ న్యాయమే. ఒకమనుష్యుఁ

సూత్ర వివరణము.

డొక కార్యమును జేయుటవలన నితరులకు హానిగలిగించినట్లే మఱియొక కార్యమును జేయకుండుటవలనఁ గూడఁ గీడును గలిగింపవచ్చును. ఈరెండు విధములైన హానులకునుగూడ నతని బాధ్యునిగఁ జేయుట న్యాయము. రెండవపక్షమునందు బాధ్యతను విధించుటలోఁ జాల జాగ్రత్త కావలసి యున్నను, మొత్తముమీఁదఁ బ్రతిమనుజుని నితరులకుఁ గీడొనరించినందులకు బాధ్యునిఁజేయుట న్యాయము. కీడును దప్పింపలేనందులకు బాధ్యుని జేయుట విశేషన్యాయముగాని సామాన్యముకాదు. అయిన నీ విశేష విధికిఁ గూడ నవకాశముగల యుపప్రవసమయము లనేకములు స్పష్టముగఁ గనఁబడుచున్నవి. ఇతరులతోడి వ్యవహారములన్నిఁటిలో నెవరెవరిలాభములు సంబంధించుచుండునో వారికండ అగును ప్రతిమనుష్యుఁడును న్యాయమైనరీతిని బాధ్యుఁడుకావలెను. వాఁడు సంఘసంరక్షణములో నున్నవారు గావున నగత్యమైనయెడ సంఘమునకుఁగూడ బాధ్యుఁడై యుండవలయును. ఇట్టిబాధ్యతలోనుండి తొలఁగించుటకుఁ దఱచుగ మంచి కారణము లున్నవి. కాని యాకారణము లాయాసంగతి సందర్భానుకూలములుగ నుండవలయును. ఒకవ్యక్తిని సంఘశక్తిచేత వశపఱచుకొనుటకంటె యథేచ్ఛముగఁ బోనిచ్చినయెడల నెక్కువబాగుగఁ బ్రవర్తింపవచ్చును. కొన్నికీడులను నివారించుటకుఁ జేయుప్రయత్నముల వలన నంతకంటె నెక్కుడు కీడులుపుట్టవచ్చును. ఇట్టిహేతువులవలన సంఘము వ్యక్తిమీఁదనున్న యధికారమును వదలుకొనవలసి వచ్చినప్పుడు ప్రతిమనుజుఁడును దనమనస్సాక్షినే న్యాయకర్తగాఁ జూచుకొని సంఘశిక్షకు దాను లోనుగాకుండు హేతువునువిచారించి, యరక్షితములైన యితరుల లాభములను మఱింతకట్టుదిట్టముగ రక్షింపవలసి యుండును.

అయినను వ్యక్తిని సంఘమునుండి విడఁదీసి విచారించి నప్పుడు సంఘముయొక్క మేలుతో సాక్షాత్సంబంధము లేని వ్యవహారకాండ కొంత

ప్రయోజనము.

కలదు. ప్రతిమనుష్యుని జీవితములోను బ్రవర్తనములోను వ్యక్తినిమాత్రమే బాధించు భాగ మంతయు నీకాండలో చేరుచున్నది. ఇట్టిభాగ మొకవేళనితరులను బాధించిన నాసంబంధము వారు స్వేచ్ఛగను బుద్ధిపూర్వకముగను, నప్రమాదముగు సమ్మతిమీఁదను, ఫలభాగస్వాలగుటచేతఁ గలుగుచున్నది. వ్యక్తిని మాత్రమే బాధించు కాండయున్నప్పుడు ప్రాథమికముగ వ్యక్తినిబాధించునని యర్థము. ఏదేది యొక మనుష్యునిబాధించునో యది తన్మూలమున నితరులనుగూడ బాధింపవచ్చును. ఇట్టి యనిశ్చయ సంబంధమునుబట్టి చేయఁదగిన యాక్షేపమును గ్రంథశేషములో విచారించెదము. కానఁ బ్రస్తుతము మనుజులకు స్వాతంత్ర్యార్హమైన భాగమును వివక్షించుచున్నాము. మొట్టమొదట నాంతరమైన మనోవిషయములో ననఁగా లౌకిక, తాత్త్విక, శాస్త్రీయ, నీతివిషయిక, మతసంబంధమైన సకలాంశములలోను బ్రతిమనుజుఁడును దనబుద్ధివృత్తులను, మనోభావములను, అభిప్రాయములను, అభిమానములను, నిరూపించుకొనుటకు సర్వస్వాతంత్ర్యముండవలెను. ఎవరి యభిప్రాయములను వారు వ్యక్తీకరించి ప్రచురము చేయుటకుఁగావలసిన స్వాతంత్ర్య మితరమనుష్యులతో సంబంధించిన ప్రవర్తనావిశేష మగుటంబట్టి వేఱున్యాయముగ భాసింపవచ్చును. కాని యదిచాలవఱకు మనఃప్రపంచములోని స్వాతంత్ర్యముతోఁ దుల్యమైన ప్రాముఖ్యతను వహించుటచేతను, దాని కాధారభూతములైన హేతువులే దీనికిని విస్తారముగ వర్తించుటచేతను మనోవాక్స్వాతంత్ర్యము లభిన్నములుగనున్నవి. రెండవసంగతి, ఎవరి యభిరుచినిబట్టి వారుప్రవర్తించుటకు ననఁగా నెవరి వృత్త్యనుసారముగ వారి జీవితపద్ధతి నేర్పఱచుకొని యెవరి కర్మఫలమునకువారు బాధ్యులై యథేచ్ఛముగ వ్యవహరించుకొనుటకు స్వాతంత్ర్య ముండవలెను. ఇతరులకు నిట్టి ప్రవర్తన మవివేకముగఁగాని, అనుచితము, గగాని, యధర్మముగ, గాని, తోఁచినను మన నడవడివలన వారికిహాని కలుగనంత వఱకు వారు మనకేయాటంకమును జేయఁ

గూడదు. మూఁడవది, పూర్వోక్తమైన వ్యక్తిస్వాతంత్ర్యమును బట్టి వ్యక్తుల సంఘీభావమునకును తత్సమానవ్యాప్తిగల స్వాతంత్ర్య ముండవలెనని తెలుపుచున్నది. అనఁగా నితరులకు హానికరముగాని యేకార్యము నిమిత్తమైనను, యుక్తవయస్సు వచ్చిన మనుష్యులు బలవంతమునను, మోసమునను, లేని రీతిని జేరి సంఘముగ నేర్పడుటకు స్వాతంత్ర్యముండవలెను.

**సాంఘిక స్వాతంత్ర్యము.**

ఏ సంఘములో నీస్వాతంత్ర్యములకుఁ దగు గౌరవము లేదో యాసంఘమునకు స్వాతంత్ర్యమే లేదు. ఎక్కడ నవి సంపూర్ణముగను అసంకుచితముగను భాసింపవో యక్కడ సంఘమునకుఁ బరిపూర్ణస్వాతంత్ర్యానుభవము లేదు. ఇతరుల మేలునకు భంగముచేయ యత్నింపక, వారు దానినిపొందుట కాటంకము గావింపకుండునంతవఱకు నెవరి మేలుకొఱకు వారు యథేచ్ఛమైన రీతిని బాటుపడుటకుఁ గావలసిన స్వాతంత్ర్యమే స్వాతంత్ర్యనామమునకర్హమైనది. ఎవరి శరీరాత్మల సుఖమునకు వారే క్రమమైన సంరక్షణకర్తలు. ప్రతిమనుజుని నితరులకు మేలని తోఁచినపద్ధతిని నడచుకొమ్మని నిర్బంధము చేయుటకన్న నెవరికి మేలని తోఁచినవైఖరిని వారిని బ్రతుకనిచ్చుటయే మానవజాతికి నెక్కుడులాభకరము.

**ప్రతిబంధకములు.**

ఈసిద్ధాంత మెంత మాత్రము క్రొత్తదికాదు. కొందఱకిది స్వతః ప్రమాణముగఁగూడఁ గాన్పింపవచ్చును. కాని, యీకాలపు అభిప్రాయముల యొక్కయు నాచారవ్యవహారముల యొక్కయు సామాన్యగతికి దీనికంటె సాక్షాత్తుగా విరుద్ధమైన సిద్ధాంతమేమున్నది? సాంఘికప్రాశస్త్యమును సంపాదించుటకు సంఘము తనకుఁ దోఁచినరీతిని సర్వజనులను నడచుకొమ్మని నిర్బంధించి ప్రయాసపడినట్లే, వ్యక్తిప్రాశస్త్యమును సాధించుటకుఁగూడ బలాత్కారమొనరించి ప్రయాసపడుచున్నది. ఒకరాష్ట్రములోనున్న ప్రజల కాయిక మానసిక శిక్షలన్నిఁటిలోను రాష్ట్రాధికారులకు గాఢమైన యభినివేశము కలదను హేతువుచేఁ బ్రతిమనుజుని ప్రవర్తనాలేశమును నను శాసిం

చుటకుఁ దమకు స్వత్వముకలదని పూర్వకాలపు రాజ్యపద్ధతులలో భావించుచుండెడివారు. దీని నప్పటి తత్త్వవేత్తలుకూడ నామోదించుచుండిరి. ఇట్టిభావన పూర్వకాలపు అల్పరాష్ట్రముల విషయమునఁ జెల్లియుండవచ్చును. అవి బలవంతులైన శత్రువులచేఁ జుట్టఁబడియుండునవి. లోపలనుండి పుట్టు కల్లోలములవలనను వెలుపలనుండి వచ్చుతాఁకుడుల వలనను, ఎప్పుడుకూలిపోవునోయున్న విపత్తునకు నిరంతరము లోనైయుండెను. ఆత్మనిగ్రహ బలముల నెప్పుడు సడలించిన నపుడు వినాశము సులభముగ పైఁబడునట్లగపడుచుండెను. కాన స్వాతంత్ర్యమువలనఁ గలుగు సుస్థిరమైనఫలము లభించుపర్యంతము వేఁచియుండుటకు వలనుపడకుండె. ఇటీవల రాష్ట్రములయందలి సంఘములు పెద్దవైనవి. లౌకికపారమార్థిక వ్యవహారములం దధికారములు విడిపోవుట కూడఁ దటస్థించినది. దీనివలన మనుష్యుల యంతరాత్మల నడపించు నధికార మొకరిచేతిలోను, వారిలౌకికవ్యవహారముల నడపించు నధికారము మఱియొకరిచేతిలోను, జిక్కినవి. ఈ రెండుకారణములవలన మనుజుల స్వీయవ్యవహారములందంతగా జోక్యము కలుగఁజేసికొని చట్టములను జేయుట కాటంకమువచ్చినది. అయినను నీతియం దభిరుచిని నిరూపించుటలో మత మతిముఖ్యాంశమైయుండెను. సర్వాధికారాపేక్షగల మతస్వాముల కోరికప్రకారమో, లేదా సంఘమునంతను బలవంతముగఁ బరిశుద్ధపఱచవలయుననుకోరిక ప్రకారమో పాలింపఁబడు చుండుటచేత బహుజనాభిప్రాయమునుండి విడివడినవారికి సాంఘిక విషయములలోఁగంటె వ్యక్తివిషయములలోనే యనాదరణరూపమైన యొత్తు డెక్కువగఁ గలుగుచువచ్చినది. పూర్వమతములపైఁ బ్రతిఘటించిన యాధునిక సంస్కర్తలైనను ధర్మప్రతిపాదనమందు సర్వాధికారము పూనుటలో మతస్వాములకుఁగాని మతశాఖల వారికిఁగాని యెంతమాత్రము తీసిపోలేదు. దీనికి "కామిటీ" ముఖ్యమైన నిదర్శనము. ఈయన చేసిన సంఘవ్యవస్థలోఁ జట్టములను బ్రయోగించుటకంటె నిందాస్తుతిరూపమైన యుపాయములనే యెక్కువగఁ బ్రయోగింపవలయునని బోధించినను సిద్ధాంతములోమాత్రము పూర్వాచార్యులందఱిలో రాజకీయాదర్శము

(Political ideal) విషయమై కఠినశిక్షకు లైనవారికంటెను సంఘమునకు వ్యక్తిమీఁద నెక్కుడు నిరంకుశాధికారమును సంపాదించియుండెను.

2. ఆలోచనకర్తలైన వారీవిధముగ బోధించు విశేషన్యాయము లటుండనిండు. లోకమందు సామాన్యముగ వ్యక్తిస్వాతంత్ర్యమును దగ్గించు సంఘాధికారము నమితముగ హెచ్చించి శాసనముల మూలముననను, నిందాస్తుతులమూలముననను, ధ్రువపఱచవలెనను కోరిక యంతకంతకు వృద్ధిఁజెందుచున్నది. వ్యక్తిబలమును క్షీణింపఁజేసి సంఘశక్తిని బలపఱచుటయే లోకమునందు జరుగుచున్న మార్పు లన్నిటికి సామాన్యగతిగఁ బొడగట్టుచున్నది. కాన వ్యక్తిస్వాతంత్ర్యమున కిందువలన మూఁడిన విపత్తు తనంతటఁ దొలఁగిపోవునదిగాక యంతకంతకుఁ దీవ్రముగఁగూడఁ గానున్నది. ప్రభుత్వము వహించినను, లేక సామాన్య ప్రజలుగనున్నను మనుష్యులందఱును గూడఁ దమ యభిప్రాయేచ్ఛల కనుగుణముగ నితరులు నడచుకొనవలయునని యపేక్షించుచుందురు. మనుజులయందుండు గుణదోషము లన్నియుఁజేరి యీ కోరికనే మిక్కిలి దృఢపఱచుచున్నవి. వారి యశక్తత తప్ప దీనికి మఱియే యాటంకమునులేదు. లోకములోని ప్రస్తుత వ్యవహారస్థితినిబట్టి సంఘశక్తి పెరుఁగుచున్నదిగాని తఱిఁగిపోవుటలేదు. కాఁబట్టి వ్యక్తి స్వాతంత్ర్యమునకుఁగలిగినవిపత్తు పైఁబడకుండ చేసికొనుటకు దృఢమైనధర్మబుద్ధియొక్కటియే సాధనము. దీనిని సంపాదించి యడ్డము వేసికొననియెడల యీవిపత్తు మఱింత వృద్ధిఁజెందును.

వాదక్రమము.

ఈవిషయమునంత నొకసారిగఁజర్చించుటకుమాఱుగ నిచ్చట ప్రతిపాదించిన న్యాయములో జనులు పూర్ణముగనో, కొంచెముగనో యొప్పుకొను నంశముమాత్రము ముందు విచారించితిమేని వాదమునకు సౌకర్యమొదవును. ఈ యంశమెద్దియనిన, బుద్ధివృత్తిస్వాతంత్ర్యము. అనఁగాఁ బ్రతిమనుజుఁడును యథేచ్ఛముగ విచారించి నిశ్చయించుకొనుటకుఁ గావలసిన స్వాతంత్ర్యము. ఇదియును దీనినుండి విడఁదీయుటకు

వీలులేని సహోదర న్యాయముగల వాగ్లేఖన స్వాతంత్ర్యములును జేరి సర్వజనామోదములైన యంశములగుచున్నవి. మతవిషయములలో సహనమును స్వతంత్ర ప్రతిష్ఠాపనలును, గల సర్వదేశములందలి నీతిలో నీస్వాతంత్ర్యములు చాలవఱకుఁ జేరియున్నవి. అయినను, వ్యావహారికముగఁగాని, తత్త్వవిచారముచేతఁగాని, యట్టిస్వాతంత్ర్య సంపాదకరములైన హేతువులుమాత్రము జనసామాన్యమునకుఁ దెలియుటలేదు, ఇంతియకాక జనాభిప్రాయ నిర్ణేతలు నయిత యీహేతువుల సారమును జక్కఁగ గ్రహించి రనుకొనుటకు వలనుపడదు, అయినను ఆ హేతువులను జక్కఁగ గ్రహించినయెడల నవి యొక్కయీ యంశమునందుమాత్రమే గాకయింకననేకాంశములందునుగూడ నుపయోగపడును. కాన నిప్పుడుచేయు చర్చలో నీభాగమును సంపూర్ణముగ విచారించితినేని యీ విచారణ తక్కినభాగమును బరిశీలించుటకు మిక్కిలి తోడ్పడును. ఈవిషయము నిక్కడికి మూడువందల సంవత్సరములనుండి విస్తారముగఁ జర్చించుచునేయున్నారు. నేనుజేయు విచారణలో కొంతవఱకుఁ గొత్తసంగతులేవియుఁ గాన్పింపకపోవచ్చును. అట్టినాడు నాచేయు చర్వితచర్వణమును మన్నింతురుగాక.

# అధ్యాయము--II

## మనోవాక్స్వాతంత్ర్య విషయము

*అభిప్రాయ ప్రకటనమునకు నిరోధము గూడదు*

దొరతనమునఁ గలుగు దోషములను బ్రజాపీడనమును నివారించుటకుఁ బత్రికాప్రకటన స్వాతంత్ర్య మగత్యమని వాదింపవలసిన కాలమిదివఱకే కడచినది. ప్రజల మేలుతో నేకమయిన మేలునుగలిగి యుండని రాచకార్యాలోచన కర్తలకైనను, గార్యనిర్వాహకులకైనను బ్రజల యభిప్రాయము తెల్లుంపవలయునో, వారి సిద్ధాంతములను, సంవాదములను వినవచ్చునో, నిర్ణయించుట కధికారములేదని యిప్పుడువాదము చేయవలసిన పనిలేదు. ఈవిషయమును బూర్వపుగ్రంథకర్తలనేకపర్యాయములు జయప్రదముగ స్థాపించి యుండుటనుబట్టి మే మిక్కడఁ బ్రత్యేకముగ దానిని నొక్కి వక్కాణింప నక్కఱలేదు. ఇంగ్లాండు దేశములోఁ బత్రికాప్రకటన విషయమైన శాసనము ట్యూడరు వంశస్థులు పాలనముచేయు కాలములో నున్నటులనే యిప్పటికిని హీనస్థితిలో నిలిచి యున్నది. అయినను బ్రజలలోఁ దిరుగఁబాటు జరుగునని జడిసి మంత్రులును, న్యాయకర్తలును, బెడత్రోవను బడినప్పుడు తప్ప సామాన్యముగ నా శాసనమును బ్రయోగించి రాజకీయ చర్చల నణఁగఁద్రొక్కుదురని భయపడవలసిన నిమిత్తములేదు. * మొత్తముమీఁద రాజనీతివ్యవస్థగల దేశముల

---

* ఈ మాటలు వ్రాయుట తరువాయిగ వీని నసత్యములుగఁ జేయుటకో యనినట్లు, దొరతనమువారు 1858 సంవత్సరమునఁ బత్రికలపై నభియోగములను బ్రయోగించి బహిరంగముగ చర్చలుచేయు స్వాతంత్ర్య

లన్నింటిలోను దొరతనపు వారు ప్రజలకుం బూర్ణముగ బాధ్యులైనను, గాక పోయినను, ప్రజల దౌర్జన్యమున కుపకరణమైనప్పుడు తప్ప తక్కిన సమయములలోం బ్రభువు లింకనుం దభిప్రాయప్రకటనమున కడ్డము వత్తురని భయపడ నగత్యముండదు. కానం బ్రభువులను, ప్రజలనేకముగా విచారించి, ప్రజాపాలనమందు మాత్రము తప్ప తక్కినచోట్లం బ్రభువులు బలాత్కారమును బూని పనిచేయరని మన మూహింపవచ్చును. కాని, ప్రజలు స్వయముగ నైనను, దొరతనపువారి వలననైన నిట్టిబలవంతమును బూనుట

మున కవివేకులై యడ్డమువచ్చిరి. అయినను నేను పైనిర్వాసిన దానిలోనొక్క మాటనైనను సవరింపం బనిలేదని తలంచెదను. ఇంగ్లాండు దేశములో విప్లవ సమయములలోం దప్ప సామాన్యముగ రాజకీయాంశములను గుఱించి చర్చలను జేసినందుకు దండనమువిధించి ప్రజలను హింసించుకాలము గడచిపోయినదని నా కిప్పటికిని దృఢ విశ్వాసము గలదు. పైనిజెప్పిన యభియోగములైనను స్థిరముగ నుండలేదు. వానిని రాజకీయములయిన యభియోగములని చెప్పుట కూడ సత్యముగాదు. అప్పుడు ప్రతిష్ఠాపనల నాక్షేపము చేసిరనిగాని పరిపాలకులను వారిచర్యలను ఖండించిరనిగాని యభియోగము రాలేదు. ప్రజాపీడకులను సంహరింపవచ్చునను సిద్ధాంతమును దుష్టముగనెంచి, దానిని బ్రచురము చేసినందులకు దోషారోపణము చేయంబడెను.

ఈయధ్యాయమునం జేయంబడు వాదములు యుక్తియుక్తములైనచోం బ్రతివ్యక్తియు వాని నిశ్చయ ప్రకార మేసిద్ధాంతమునైనను, ఎంత దుష్టముయినదానినైనను, వెల్లడిచేసి చర్చించుటకు సర్వస్వాతంత్ర్య ముండవలెను. కనుక ప్రజాపీడకవధ దుష్టసిద్ధాంత మానా కాదా యను విచారణ మప్రస్తుతమును అసందర్భమునై యున్నది. ఇంతియగాక నీతిశాస్త్రమం దీ విషయమిదివఱ కెన్నడు పరిష్కృతము కాలేదు. ఎవ్వండయినను శాసనము నతిక్రమించి దానివలన విధింపంబడిన శిక్షల కంటకుండం బై యధికారమును సంపాదించి నప్పుడట్టి దుష్టుని సామాన్య మనుజుం డొకండు వధించుట నేర

కు స్వత్వము (హక్కు) లేదని నా వాదము. ఈయధికార మక్రమ మైనది గనుక ప్రభువులు మంచివారైనను జెడ్డవారైనను దానిని వహించుటకు స్వత్వములేదు. ప్రజావాక్యమునకు విరోధమైనను, అనుకూలమైనను, అది యసహ్యమైన వృత్తాంత మగుటయేకాక రెండవ పక్షమున నెక్కువ దూష్యమని కూడ గ్రహింపవలెను. తక్కిన మనుజు లందఱు నొక్కయభిప్రాయముగలవారై, యొక్కమనుష్యుఁడుమాత్రము భిన్నాభిప్రాయుఁడైనప్పుడు, అతఁడు వారినందఱను, అణఁచిపెట్టఁగల సమర్థుడైనచో నటుల చేయుట యెంతదోషమో, యతఁడధికార హీనుఁడైనప్పుడు వారందఱును జేరి వాని నణఁగఁద్రొక్కుటయు సమానమైనదోషమే. ఏయభిప్రాయమువలననైనను దానికర్తకుమాత్రమే లాభముకలిగి, దానిననుభవమునకు రాకుండ నాటంకము గలిగించుటవలన వానికిమాత్రమే నష్టమైనయెడల నానష్టము బహుజనమునకుగాక కొద్దిమందకేఁగదాయని విచారింపవచ్చును. కాని యభిప్రాయప్రకటన కాటంకము గావించుటచేత సంప్రాప్తమగు నష్టము విశేషము గాని సామాన్యముగాదు. దానివలన మనుష్యజాతి కందఱకు నొక్కకాలమందుఁగాక తరతరములపర్యంతమును నష్టము జరుగును. ఇంతియగాక యా యభిప్రాయమును గలవారికంటె లేనివారికే నెక్కుడుకీడు వాటిల్లును.

---

ముగాదు సరిగదా, ఉత్కృష్ట పుణ్యకార్యమగునని సంఘములు మొత్తముగా నెంచుటయేగాక మనుష్యశ్రేష్ఠులలోఁ గొందఱుగూడ నామోదించుచున్నారు. ఇట్టికార్యము తప్పయినను ఒప్పయినను జనప్రకోపమనఁదగును గాని ఘాత కానేరదు. కానఁ బ్రత్యేక మొకరి విషయములో దానిని బురికొల్పుటవలనఁ బ్రత్యక్షముగ ఫలము సంప్రాప్తమయినప్పుడును, లేక యీ ప్రోత్సాహమునకును క్రియకును సంబంధమున్నదని సాధింపఁగలిగినప్పుడును మాత్రమే యా ప్రోత్సాహము దండనార్హమగును. అప్పుడైన నే దొరతనము యొక్క నిలుకడకే విపత్తు తటస్థమగునో యా దొరతనపు వారా ప్రోత్సాహకులను దండింప నధికారులగుదురుగాని, యన్యదేశపు దొరతనమువారికా యధికార మెంతమాత్రమును లేదు.

ఎందుచేతననఁగా: అది యొప్పైనపక్షమున దానిని గ్రహించి తమతప్పునువదలు

రెండు హేతువు:

కొనుట కవకాశముండును. అది తప్పైనపక్షమున దానిని ఖండించి తమ యభిప్రాయము యొక్క యథార్థమును మఱింత బాగుగను స్పష్టముగను గ్రహించి లాభమును బొంద వచ్చును. ఈలాభము మొదటిపక్షముతో సమానముగాని దానికిఁ దీసిపోవు నదికాదు.

ఈరెండు పక్షములందును వాదము వెవ్వేఱుగ నుండుటనుబట్టి వానిని ప్రత్యేకముగ విచారించుటయావశ్యకము. మన మేయభిప్రాయమును నణఁచి పెట్టుటకు యత్నించుచున్నామో, యది తప్పని యమోఘముగ నిశ్చయము చేయఁ జాలము. ఒకవేళ నిశ్చయమే యైనను, అప్పటికిని దాని నణఁగఁ ద్రొక్కుట తప్పక కీడనిపించుకొనును.

మొదటి హేతువు

మొదటిపక్షము. అధికారదర్పముచేత నణఁచి పెట్ట యత్నించు నభిప్రాయ మొకవేళ సత్యముకావచ్చును. దానిని నిరోధింపఁ గోరువారది తప్పక యసత్యమేయని వాదించినను వారు ప్రమాదపడి యుండవచ్చును. మనుష్యులందఱకును గావలసిన యావిషయమును వారొక్కరే పరిష్కరించి, యితరుఁడెవ్వఁడును దానిని గూర్చి విమర్శించుకొనుట కవకాశములేకుండఁజేయుటకు వారి కెంతమాత్రము నధికారములేదు. ఏయభిప్రాయమైనను దమకుఁ దప్పని తోఁచినంత మాత్రమున దానిని విచారణములోనికి రాకుండఁ జేసినపక్షమునఁ దమనిశ్చయము నే పర్యాప్తనిశ్చయముగ భావించిన వారగుదురు. ఇతరవాదము నణఁచి వేయుట యనఁగాఁ దమ కప్రమాదిత్వమును గల్పించుకొనుటయే యగును. కనుక వాదనిరోధముఁ జేయకూడదనుట కీహేతువుచాలును. ఇది సామాన్య హేతువైనంత మాత్రమున దుర్బలమని యెంచఁగూడదు.

మానవజాతియొక్క వివేకమున కది యేమి చేటు మూఁడెనో గాని, సిద్ధాంతభాగములో మనుజులు ప్రమాదవశులు గావచ్చునని యొప్పుకొనినను,

వ్యవహార కాండలో మాత్రము దానికిఁ దగినంత గౌరవమిచ్చుటలేదు. ప్రతి మనుజుఁడును దాను బ్రమాదపడి యుండవచ్చునని యెఱుఁగును. అయినప్పటికిని దనకుఁ బ్రమాదము కలుగకుండుటకు జాగ్రత్తపడువారును, తామేదేని యభిప్రాయమును నిశ్చయముగఁ దప్పని యెంచినప్పు డానిశ్చయము ప్రమాదవశముచేఁ గలిగినదేమోయని శంకించువారును మిక్కిలి యరుదు. నిరంకుశ ప్రభువులకేమి, అపరిమితమన్ననల కలవాటుపడిన యితరమనుజులకేమి, బహువిషయములలో నిట్టిసంపూర్ణ నిశ్చయముండుట సామాన్యమే. తమ యభిప్రాయముల నితరులు ధిక్కరించి, తప్పులున్నయెడ సవరించుట కలవాటుపడిన వారింతకంటె ధన్యులు. తమతోడి వారందఱుగాని వారిలోఁ దమకుఁ బూజ్యులైనవారుగాని యే యభిప్రాయములలోఁ దమకుఁ దోడ్పడుదురో వానియందు మాత్రమే వారి కమిత విశ్వాసముండును. ఎందుచేతనన, మనుజుఁడు తనయొక్క నిశ్చయమందు నమ్మకము తగ్గినకొలఁదిని బాహుళ్యము మీఁద లోక మప్రమాదముగ నుండునని సామాన్యముగ నమ్ముచుండును. ఇఁక లోకమనఁగా నెవని నంటియున్నమట్టుకు వాని కా భాగమే లోకమగుచున్నది. వానిపక్షమో, శాఖయో, మతమో, సంఘములోనిభాగమో, వానికిఁ బ్రపంచ మనిపించుకొనును. లోకమన్నప్పుడు తానున్న దేశమువఱకును, కాలమువఱకును, ఎవ్వఁడైన గ్రహించినయెడలవాని నితరులతోఁ బోల్చి యుదారచేతస్కుఁడని చెప్పఁదగును. ఇతర కాలములలోను, దేశములలోను, శాఖలలోను, మతములలోను, సంఘములలోను, బక్షములయందును తా నంగీకరించినదానికిఁ గేవలవిరుద్ధమైన యభిప్రాయముండియున్నదని తెలిసినను వానికిఁ దన సమాజమునందున్న ప్రమాణబుద్ధి చలింపదు. ఇతరులులోకమనియెంచు దానికి భిన్నముగాఁ దన యభిప్రాయమే సరియైనదని చెప్పుటచేతఁ గలిగిన బాధ్యతను దాను లోక మనుకొన్న దాని మీఁదఁబడవేయునే గాని తన కా లోకప్రమాణము కేవలము కాకతాళీయముగ సిద్ధించినదని తలపెట్టఁడు. అతఁడు లండనుపట్టణములోనున్నపు డే కారణములచేత క్రైస్తవుఁడగుట తటస్థించెనో, యా కారణములే యతఁడు పికిన్పట్టణ మందున్నయెడల వానిని బౌ

ష్ఠునిగనో, కన్యాప్రషియకుమతస్థునిగనో చేసియుండును. ఒక్కొకయుగము నందలి యభిప్రాయములు తర్వాతియుగములలోఁ దప్పులుగఁ దోఁచుటయే కాక విపరీతములుగఁ గన్పట్టును. ఒకానొకప్పుడుసర్వసాధారణమైన యభిప్రాయములను జాలపట్టుకుఁ బ్రస్తుతకాలములో నిరాకరించునటులనే ప్రస్తుతాభిప్రాయములను ముందుయుగములలో నిరాకరింతురు. ఈ హేతువును బట్టి వ్యక్తులెట్లో యుగములు నట్లే ప్రమాదవశము కావచ్చునని స్వతస్సిద్ధముగ స్పష్టమగుచున్నది. దీనిని వ్యక్తీకరించుటకు వాద మక్కఱలేదు.

పూర్వ పక్షము

దీనికి బహుశా యీ క్రిందఁ జెప్పఁబోవు నాక్షేపము చేయ వచ్చును. దొరతనపువా రేయితర విషయము లందైనను బాధ్యతను వహించి తమకుఁ దోఁచినరీతిని జరిగించినట్లే యభిప్రాయ దోషమును వ్యాపింపకుండఁ గూడ శాసించుచుందురు. దీనియందు వారెక్కుడప్రమాదిత్వమును గల్పించుకొని యుండలేదు. మనుజులకు విమర్శన యనునది యుపయోగపడుటకుఁ గాకున్న మ టెందు కేర్పడినది? కొన్ని యంశములలోఁ బొరపడుదురను హేతువునుబట్టి వారిని బొత్తిగ విమర్శింప వలదని చెప్పవచ్చునా? హానికరమని తోఁచినదానిని నిషేధించుటయో వారికి మనఃపూర్వకమయిన రీతిని విధాయక కృత్యమును నెఱవేర్చుచున్నారుగాని తమ కప్రమాదిత్వమును గల్పించుకొనుటలేదు. వారు చేసికొనిన నిశ్చయములోఁ బొరపాటు లుండవచ్చును. కాని మనయభిప్రాయములుతప్పులేమోయనిశంకించివానిపరిహారము ప్రవర్తించుటయే మానవలసినయెడల, మన క్షేమమును గాపాడుకొనక మన విధులనెఱవేర్పక యూరకుండవలసినవారమగుదుము. సకలవ్యవహారబాధకమగు నాక్షేపము చేత నొక్క వ్యవహారవిశేషమును దూషించుట సవ్యముగాదు. వ్యక్తులును దొరతనపు వారునుగూడ బహుజాగ్రత్తతో నభిప్రాయ నిశ్చయము చేసికొని యితరులను నిర్బంధపెట్టక పూర్వము తాము సరియైన త్రోవ నున్నామని ధ్రువపఱచుకొనుట విధియైయున్నది. అయిన నిప్పుడుచేయు ననువాదపరిహారము వారి కానిశ్చయ మున్నప్పుడు వారి

యభిప్రాయముల ప్రకారము నడచుకొనక, మానవకోటికి నిహమందు (గాని పరమందు) గాని సౌఖ్యహానిని జేయునని తమకు నిజముగఁదోఁచునట్టి సిద్ధాంతములను విచ్చల విడిగ వ్యాపింపనిచ్చి, దీనికిఁగారణము జ్ఞానహీనమయిన కాలములో నెవరో హింసించిన యభిప్రాయము లిప్పుడు సత్యములుకాలేదా యని పలుకుట పిఱికితనముగాని సత్యశీలత కానేరదు. వెనుకటివారు చేసిన పొరపాటునే మనముకూడఁ జేయకుండ జాగరూకులమయి యుండవలసినది నిజమేగాని, దొరతనపువారలును బ్రజలునుఁగూడ నితర విషయములలోఁ బొరపాటులు చేసియున్నను వారిప్పు డావిషయములలో నధికారమును వహింపఁగూడదని నిషేధించుటలేదు. ఇందుకు దృష్టాంతము. వెనుకటి కాలములో నక్రమపు పన్నులు వేసి, యన్యాయపు యుద్ధములుచేసి యుండిరను హేతువునుబట్టి యేవిధమయిన పన్నులను వేయఁగూడదనియు, నెంత బలవంతము వచ్చినను యుద్ధములు చేయఁగూడదనియు మనము శాసింపవచ్చునా? వ్యక్తులును, ప్రభుత్వపు వారునుగూడఁ దమ శక్తివంచనలేకుండఁ బనిచేయవలయును. కేవల నిశ్చయ మనునది లేకపోయినను జీవయాత్రకుఁ జాలినంత నమ్మకముండవచ్చును. మనప్రవర్తనమును సూచించుటకుఁజాలిన మట్టుకైన మన యభిప్రాయము సరియైనదని గ్రహింపవచ్చును;అట్లుగ్రహింపకతప్పదు. మనకుఁదప్పులును హానికరములు నని తోఁచిన యభిప్రాయములను వ్యాపక పఱచి సంఘమును జెడఁగొట్టకుండ దుష్ప్రవర్తనమును నిరోధించుటలోఁ బైని జెప్పినదానికంటె నెక్కువ యధికారమును మనము వహించుటలేదు.

సిద్ధాంతము

ఈవాదమునకు నాచేయుప్రత్యుత్తరమేమనిన; (ఎక్కువ యధికారమును వహింపలేదని చెప్పుటసరికాదు.) చాలవఱకు నెక్కువ యధికారమునే కల్పించుకొనుచున్నాము. ఏదేనినొకయభిప్రాయమును ఖండించుటకుఁగావలసిన యవకాశములన్నియు నున్నను నట్టి ఖండనము జరిగియుండలే దను హేతువునుబట్టిదానిని నిజమనిభావించుటకును, ఖండనమునకవకాశము లేకుండఁజేయునిమిత్తమై,దానినిసరియైనదిగ గ్రహించు

టకును, అత్యంతము భేదముగలదు. మనయభిప్రాయమునఁ బ్రత్యాఖ్యానము చేసి ఖండించుటకితరులకు సంపూర్ణ స్వాతంత్ర్యము గలదను ప్రతిజ్ఞనుబట్టియే మనము దాని నాచరణ నిమిత్తము నిజమని నమ్ముట కాస్పదమగుచున్నది. అట్లుకానిపక్షమున మనుష్యమాత్రునకెవ్వనికిని దనయభిప్రాయము సరియై నదని విశ్వసించుటకు యుక్తియుక్తమైన హేతువులేదు.

అభిప్రాయముయొక్కగాని, మనుష్యప్రవర్తనయొక్కగాని, చారిత్రమును విచారించినప్పుడు, ఇవి రెండునుగూడ నిప్పుడున్నంతవఱకైన సరిగానుండుటకు హేతుభూతమైన దేదైయుండును? స్వతః ప్రమాణమైన విషయమునఁ దక్కతక్కిన యన్నివిషయములందును నూటికిఁ దొంబది తొమ్మండ్రు విమర్శించుట కసమర్థులు. ఒక్కఁడు మాత్రము సమర్థత గలిగియుండును. ఈనూఱవ వాఁడైన నితరపురుషులను బట్టి సమర్థుఁడుగఁ గాన్పించును. కనుక బాగుగ విచారించినయెడల మనుష్య బుద్ధియొక్క స్వతస్సిద్ధమైన శక్తియే పైనిజెప్పిన హేతువుకాదని నిశ్చయపడుచున్నది. పూర్వకాలమందు ఘనులని పేరుపడ్డ వారిలోనయితము చాలమందియొక్క యభిప్రాయము లిప్పుడు తప్పులైపోయినవి. అప్పుడువా రాచరించినట్టియు, లేక యామోదించినట్టియు, ననేకసంగతుల నిప్పుడెవరును, ఆమోదించుటకు వలనుపడదు. అయినను మొత్తముమీద మానవుల యభిప్రాయములలోను, బ్రవర్తనములోను ఎక్కువపాలు హేతుసిద్ధమై యుండుటకుఁ గారణమేమి? ఇట్లెక్కువ పాలులేనియెడల మానవకోటి యొక్క వ్యవహారము లిదివఱకెప్పుడును, ఇప్పుడునుగూడ నధోగతిపాలుగ నున్నవని యెంచవలసి వచ్చును. నిజముగ నెక్కువ పాలుబాగున్నయెడ మానవుని తప్పులను సవరించుటకు వీలున్నదియనెడిగుణమే దీనికిఁ గారణము. ఈగుణమే మనుష్యుని మానసిక, నీతి విషయిక వ్యవహారములలో గౌరవాస్పదమైన సమస్తసంగతులకును హేతుభూతమగుచున్నది. మనుష్యుఁడనుభవమువలనను, బర్యాలోచనమువలనను, దనపొరపాటులను దిద్దుకొనుటకు సమర్థుఁడు. కాని యీపని కేవల మనుభవమువలనఁ గానేరదు. అనుభవమును

సార్థకముగఁ జేయుట కాలోచన కావలెను. దురభిప్రాయములును దురాచారములును యథార్థమునకును, యుక్తికిని లొంగిపోవును. అయిననివి బుద్ధియెదుటకువచ్చు వఱకును వానిపనిని జేయఁజాలవు. సామాన్యముగ నేసంగతియును వ్యాఖ్యానములేక స్వయముగ బోధపడదు. మనుష్యులు చేయు విమర్శనముయొక్క ఫలమును, విలువయు వారు పొరపడినప్పుడు సవరణ చేయవచ్చుననెడి గుణము నాశ్రయించియున్నవి. కాన నట్లుసవరించుటకుఁ గావలసిన సాధనములు నిరంతరము నందుబాటులో నున్నప్పుడుమాత్రమే యావిమర్శనమును విశ్వసింపనగును. ఏమనుష్యునియొక్క గాని విమర్శనము నిజముగ విశ్వాసార్హమని చెప్పినప్పుడు దాని కాయోగ్యత యెట్లుకలిగినది? అతఁడు తనయభిప్రాయములను బ్రవర్తనమునుగూడ నితరుల విమర్శనములకు లోఁబఱచుటకు సిద్ధముగానుండుటవలన నేకదా. అతఁడు తనయభిప్రాయమునకు విరోధముగ నెన్ని యాక్షేపములఁ జెప్పవచ్చునో వానినన్నిటినాలకించి, వానిలో న్యాయమయినవానివలన లాభమును బొంద, యక్రమమయిన వాని యక్రమమును దానుబోధపఱచుకొని, యగత్యమయినపు డితరులకు బోధించియుండు వాడుకఁగలవాఁడగుటచేత నేకదా? ఏమనుజుఁడుగాని యేవిషయమునైనను బూర్ణముగఁ దెలిసికొనుటకు దానినిగూర్చి యితరుల భిన్నాభిప్రాయములనువిని, దాని నేబుద్ధిచేత నేయేవిధముగఁ జూడనగునో యాయాప్రకారము పరిశీలించుట మాత్రమే క్రమమయినత్రోవయని యతఁడు గ్రహించి యుండుటవలననే గదా? ఈవిధమునఁ దప్ప మఱి యేయితర విధమున నెవఁడును, ఎప్పుడును, జ్ఞానమును సంపాదించియుండలేదు. మనుష్యుని బుద్ధిస్వభావమునుబట్టి యిది దక్క వేఱు మార్గములే లేదు. ఎవఁడైనను దనయభిప్రాయము నితరులయభిప్రాయములతోఁ బోల్చి తన్మూలమునఁ దప్పులను దిద్దుకొని తనయభిప్రాయమును బూర్తిచేసికొను నిరంతరాభ్యాసమువలన నాచరణములో సంశయ వితర్కములను దప్పించుకొనును. తన మతమునందుఁ గ్రమమయిన విశ్వాసమున కిదియే స్థిరమయిన యాధారము. ఎందువలననఁగా, ఇట్టిపురుషుఁడు తనకు విరోధముగా బైటికిఁ జెప్పదగిన

దానినంతను దెలిసికొని, ప్రస్తుతవిషయమునుండి యేవిధమయిన జ్ఞానమును మఱుఁగుచేయక, విమతులపైఁబ్రతిఘటించి, వారుచేయునాక్షేపములను, అభ్యంతరములను, దప్పించుకొని పారిపోక యెదుర్కొనినవాఁడు గావున నతఁడు ద్రొక్కిన మార్గమును ద్రొక్కని పురుషునియొక్కయు, జన సమూహముయొక్కయు నిర్ణయముకంటె తననిర్ణయమే శ్రేష్ఠమని యెంచుట కతనికి స్వాతంత్ర్యముగలదు.

లోకములోఁ జాలమంది యవివేకులును గొద్దిమందిమాత్రమే వివేకులై యున్నారు, కనుకమనుష్యులలో నత్యంతవివేక సంపన్నులై తమ యాలోచనము సత్యమనినమ్ముట కర్హులైనవారుసయితమేమర్యాదకులోఁ బడినఁ గాని వారికి విమర్శనానిశ్చయము కలుగదో యట్టిమర్యాదకు లోకసామాన్యముతప్పక లోఁబడవలసి యుండును. మిక్కిలి మతవిద్వేష పూరితులైన రోమనుకాతోలిక్కులు సహా వారిలో నెవరికైనను సిద్ధజనపదవి నొసంగకపూర్వము ప్రతిపక్షసమర్థక వాదమున కవకాశమిచ్చి దాని నోర్పుతో నాలకింతురు. దీనినిబట్టి ప్రతికక్షిరూపమున "పిశాచము" చెప్పఁగలిగిన దంతను విని పరిశీలించిన మీఁదఁగాని మనుష్యులలో నెంత పుణ్యపురుషుఁడైనను మరణానంతరమున గౌరవార్హుఁడు కానేరఁడని కన్పట్టుచున్నది. న్యూటనుసిద్ధాంతములైనను వివాదపఱచి పరీక్షించుట కవకాశమిచ్చి యుండనియెడల మనకుదానిసత్యత విషయమైయిప్పుడున్నంత నిశ్చయముండఁజాలదు. లోకు లందఱును మన కత్యంతము విశ్వసనీయములైన సిద్ధాంతములనుగూడ విమర్శించి యవి నిరాధారములైనచో నట్లుస్థాపింప వచ్చునని మన మెల్లప్పుడును సిద్ధముగానుండుటకన్న వాని కెక్కుడు స్థిరమైనయాధారములేదు. ఇట్టియాహ్వానమును సంగీకరింపని యెడలను, అంగీకరించినను, బ్రయత్నములు భగ్నములైనప్పుడును గూడ మనకు వానివిషయమై నిశ్చయము కుదురదుగాని, ప్రస్తుతావస్థలో మనుష్యబుద్ధికి సాధ్యమయినంత వఱకుఁ జేయఁదగినదంతయుఁ జేసినవారమైతిమి. మనకు

సత్యము లభించుటకుఁ గావలసిన యేసంగతి నుపేక్షచేయక వివాదమునకెప్పు డును సిద్ధముగా నుండుటంబట్టి మనమునమ్మినదానికంటె నెక్కుడు సత్య మున్న యెడలనది మనఃపరిపక్వమైనతోడనే సిద్ధించునని యెంచవచ్చును. అంతపర్యంతము మనకాలములో సాధ్యమైనంత సత్యమునుబొందితిమిగదా యని నమ్మియుండవచ్చును. మనుష్యుఁడు ప్రమాదవశుఁడు. అతనికింతి కంటె నెక్కువనిశ్చయము లభింపఁజాలదు. దానికిఁబైనిఁజెప్పిన దానికంటె వేఱు మార్గమును లేదు.

మానవులు నిరాటంకముగ వాదముచేయ వచ్చునను టకు నుపపత్తుల నంగీకరించియు వాని నిరతిశయవ్యాప్తికి మాత్రమాక్షేపము చెప్పుటయెంతయు విపరీతముగనున్నది. ఆ యుపపత్తులు నిరవధికమైన దృష్టాంత మందు వర్తింపనిచో నేదృష్టాంతమునందును గూడవర్తింపఁ జాలవని కనిపెట్టకయున్నారు. సందేహాస్పదములైన సమస్త

విశేష సంగతులు.

విషయములనుగూర్చియు స్వేచ్ఛగఁజర్చజరగవలసినదని యొప్పుకొనియు, నేది యోయొక సిద్ధాంతముగాని లేకన్యాయముగాని మిక్కిలి నిశ్చయమను హేతువునుబట్టి దానిని వివాదమునుండి తొలఁగింపవలసినదిగా నూహించుట విచిత్రముగనున్నది. నిశ్చయమన్నప్పుడు వారికిమాత్రమే నిశ్చయము గదా! ఏసిద్ధాంతమునైనను నిశ్చయముకాదని వివాదము చేయుట కవకాశ మిచ్చిన యెడల నట్లు తర్కించువాఁడొక్క మానవుఁడైన నుండియుండఁగా నాతని కవకాశ మియ్యకనే యా సిద్ధాంతమును నిశ్చితమని చెప్పిన పక్ష మున, రెండవ పక్షమును వినకుండ మనమును మనతో నేకీభవించువారును మాత్రమే నిశ్చయ నిర్ణేతలమని భావించుకొనినవారమగుదుము.

ఈలోకమందు ఆస్తికత్వము లేకపోయినను నాస్తికత్వమనిన భయ పడుదురు. ఇట్టికాలములోజనులకు వారియభిప్రాయములు యథార్థము లని నిశ్చయము లేకపోయిన నవిలేకుండ నెగ్గలేమని మాత్రము విధిగ భావిం చుచున్నారు. కనుక నేయభిప్రాయమునైనను లోకులు ఖండింపవలదని యాఁకట్టినప్పు డట్లు చేయుట కాయభిప్రాయము యొక్క సత్యత్వము

గాక సంఘమునకు దాని ప్రాముఖ్యతయే కారణముగనున్నది. సంఘముయొక్క స్వస్థత కావశ్యకములు కాకపోయినను మిక్కిలియుపయోగములైన నమ్మకములు కొన్ని గలవనియు, వానిని సంఘముయొక్క యితర శ్రేయములతోఁ బాటు దొరతనపువారు విధాయకముగఁ గాపాడ వలసినదనియు నింత యవశ్యమై విధాయకమయిన విషయములోఁ దమ యభిప్రాయమును లోకులు కూడ సామాన్యముగ ధ్రువపఱచుచుండఁగ దాని ప్రకారము దొరతనమువారు ప్రవర్తించుట న్యాయమేగాక విధికూడ నగుచున్నదనియు, ఇట్లు చేయుటలో నప్రమాదిత్వ కల్పన లేదనియుఁ వాదముచేయుచున్నారు. ఇంతియగాక యీ శ్రేయోదాయకములయిన నమ్మకముల బలమును దగ్గింపఁగోరువారు చెడ్డవారు తప్ప మఱెవ్వరుండరు. కాఁబట్టి వారి నణఁచి పెట్టి వారుమాత్రమే చేయఁగోరు చెడుకార్యమును నిరోధించుటలోఁ దప్పులేదనికూడ వాదము చేయుదురు. ఇట్లు తలంచువారు వాదముచేయువారికంటె నెక్కువగఁ గలరు. ఈవిధముగ నాలోచించుటవలన సిద్ధాంతముల సత్యత్వ మావలకుఁ బోయి, వాని యుపయోగమును బట్టియే వాదనిరోధ దోషపరివారమొకటి సంప్రాప్తమగుచున్నది. ఈవిధమయిన యాలోచనవలన నభిప్రాయ విమర్శనములో నప్రమాదిత్వ కల్పనాపవాదము తొలఁగిపోయెనని సంతోషము కలుగుచున్నది. అయిన తృప్తిఁ జెందువారొక్క దానియందుఁ గాకపోయిన మఱియొక దానియందు నప్రమాదిత్వమును గల్పించుకొనుచున్నారని కనిపెట్టక యున్నారు. ఒక యభిప్రాయముయొక్క యుపయోగముకూడ నభిప్రాయము మాత్రమేకదా! మొదటి యభిప్రాయమువలెనే యిదియుఁ గూడ వివాదాస్పదమునుచర్చాధీనమును నయియున్నది. నిషేధింపఁబడిన యభిప్రాయమును నిలువఁబెట్టుటకు సంపూర్ణావకాశమున్నప్పుడు తక్క వేఱుచోట్ల నేయభిప్రాయమైన నసత్యమని తీర్మానించుటకెటులనో యటులనే యది యపాయకరమని నిశ్చయించుటకును గూడ నప్రమాది యైన విమర్శకుఁడు కావలసియున్నాఁడు. కాఁబట్టి పతితుని యభిప్రాయము యొక్క సత్యత్వమును ధ్రువపఱచుటకవకాశము లేకపోయినను దానియొక్క నిరపాయత్వమునుగాని యుపయో

గమునుగాని ధ్రువపఱచుట కవకాశమిచ్చితిమి గదాయని చెప్పఁగూడదు. అభిప్రాయముయొక్క సత్యత్వముగూడ దాని యుపయోగములోని భాగమయి యున్నది. ఏసిద్ధాంతము నైనను విశ్వసింపవలసిన యక్కఱ యున్నదా లేదాయని విచారించునప్పుడది సత్యమా యసత్యమా యనువిచారణము నవతల పెట్టుటకు వీలుండునా? మనుష్యులలోఁ జెడ్డవారేకాక శ్రేష్ఠులయిన వారు సయితము సత్యమునకు విరుద్ధమయిన విశ్వాసము నిజముగఁ బ్రయోజనకారి కానేరదని యభిప్రాయపడుచున్నారు. ఇట్టివారసత్యమని నమ్మిన సిద్ధాంత ముపయోగకరమని లోకులు చెప్పినను దానినివిసర్జించుటవలనఁ గలుగు దోషారోపణమునకు వారు లోనైనప్పుడు పైనిఁ జెప్పిన వాదమును జేయక మానరు. బహుజనాంగీకృతమగు నభిప్రాయముల నవలంబించువారీవాదమును సంపూర్ణముగ నుపయోగించుచున్నారు. వారు సత్యత్వమును బ్రయోజనమునుండి పూర్ణముగ విడఁదీసి విచారించుటయే లేదు. వారి సిద్ధాంతము యొక్క సత్యత్వమే, దానిని తెలిసికొని విశ్వసించుటకు నత్యావశ్యకమైన హేతువుగఁ జెప్పుచున్నారు. ఇంతముఖ్యమయిన హేతువు నొకపక్షమువా రుపయోగించుకొని రెండవపక్షము వా రుపయోగించుకొనుటకు వీలులేనప్పుడు ఉపయోగమును గుఱించిన వాదము సరిగ జరుగుటకు వీలులేదు. క్రియకు నేదేని నభిప్రాయమును సత్యముకాదని నిరాకరించినయెడల శాసనములకును లోకులకు నెంత యసహ్యము కలుగునో యది యుపయోగకరము కాదని నిరాకరించినప్పుడుగూడ నంతే యనాదరణ కలుగుచున్నది. వారాయభిప్రాయమును కేవలమావశ్యకమని చెప్పక దానిని నిరాకరించినదోషమును బాతకముగ నెంచకుండుటయే మిక్కిలి గొప్ప సంగతి.

**దృష్టాంతములు. — 1.** మనము విచారించి నిరాకరించిన మాత్రమున నేయభిప్రాయమును గూర్చియు వాదమును వినకుండుటవలనఁ గలుగు ననర్థము నెక్కువబాగుగ దృష్టాంతీకరించుటకు నొక్కయనుభవవిషయమును విచారింపవలసియుండును. ఇట్లు

చేయుటలోనాకు మిక్కిలితక్కువ యనుకూలముగనుండు దృష్టాంతములనే యెత్తికొనుచున్నాను. వీనియందు సత్యత్వమును, ఉపయోగమునుబట్టి కూడ నభిప్రాయ స్వాతంత్ర్యమునకుఁ బ్రతిబంధకమైనవాద మెక్కువబలవంతమైయున్నది. దేవుఁడున్నాఁడనిగాని, యాత్మనిత్యమని గాని, నీతివిషయమున సాధారణముగ నందఱు నొప్పుకొనునట్టిగాని నమ్మకములకు ఖండనము వచ్చినప్పుడు పక్షపాతియైన ప్రతికక్షికి విశేషమైన లాభము కలిగియున్నది. ఎందువలనన, నతఁడీ సిద్ధాంతములు చట్టములవలనఁ గాపాడుటకుఁదగినంత నిశ్చయములు కావాయనియు, దేవుఁడున్నాఁడని నిశ్చయముగ నమ్ముటలో నప్రిమాదిత్వ కల్పనయేయున్నదనియుఁ బ్రశ్నించును. పక్షపాతములేనివారుకూడఁ జాలమంది యిటులనే మనస్సులో ననుకొనుచుందురు. కానిసిద్ధాంత మేదైనను దానిని నిశ్చయమని యనుకొనుటలో నప్రిమాదిత్వకల్పన యున్నదని నేను చెప్పయుండలేదు. ఇతరులు దానికి వ్యతిరేకముగఁ జెప్పుదానిని వినకుండఁ జేసి వారికిఁగాను మనమేనిశ్చయింపఁ బూనుకొనిన నది యప్రిమాదిత్వకల్పనముగుచున్నది. మనకుఁగలిగియున్న పరమనిశ్చితాభిప్రాయముల పక్షమున నైననిట్టి యధికారము దూష్యము. ఒకసిద్ధాంతముయొక్క అసత్య, అనర్థ, అధర్మ, అక్రిమములనుగూర్చి యొకరి కెంత దృఢనిశ్చయమున్నను, దానికి లోకుల నిశ్చయము తోడ్పడినను గూడ నాసిద్ధాంతమును నిలువఁబెట్టుటకుఁ జెప్పఁదగినదానిని వినకుండఁ జేసినయెడల నాతఁడు తనకు నప్రిమాదిత్వమును గల్పించుకొనిన వాఁడగుచున్నాఁడు. ఆయభిప్రాయ మక్రిమమని యధర్మమని చెప్పినంతమాత్రమున వికల్పమునందలి యాక్షేపము గాని యపాయము గాని తగ్గిపోవుట లేదు సరిగదా, యిట్టిసందర్భములోనే యదియన్నిటికంటెనధికముగ ననర్థదాయకమగుచున్నది. ఒకతరమువారు చేయు ఘోరమైనతప్పులను గుఱించి తరువాతి తరమువా రాశ్చర్యమును అసహ్యమును జెందెడి సందర్భములిట్టివియేగదా? ఈసందర్భములను విచారించినయెడలఁ జట్టముల మూలకముగ మనుష్యశ్రేష్ఠులను, సిద్ధాంతరత్నములను నిర్మూలముచేసిన దృ

ష్టాంతములు చరిత్రములోఁ బ్రసిద్ధముగఁ గనఁబడుచున్నవి. ఆమనుష్యులు నశించియే పోయిరి. సిద్ధాంతములుమాత్రము కొన్ని మిగిలియున్నవి. ఈసిద్ధాంతములనుండిగాని వానివిషయమై సామాన్యముగ వాడుకలోనున్న వ్యాఖ్యానము నుండి గాని విడిపోయినవారియెడల పూర్వపు తరము వారి వలెనే దౌర్జన్యమును వహించి దానిని సమర్థించుట కీసిద్ధాంతములనే సాక్షీభూతములుగఁ జేసికొనుట యొక్క వెక్కిరింతగానున్నది.

**2. సాక్రటీసు దృష్టాంతము**

ఒకానొక కాలమున సాక్రటీసను మహాపురుషుఁడుండెననియు, అతనికిని అప్పటి యధికారులకును జనాభిప్రాయమునకును సుప్రసిద్ధమైన సంఘర్షణ కలిగెననియు, మనుష్య ప్రపంచమున కొన్నిసారులు జ్ఞాపకముచేసినను చేయవచ్చును. మహాపురుషులతో నిండిన దేశమునందును యుగమునందును బుట్టిన వాఁడయ్యును, ఆయుగమును ఆయనను గూడఁ జక్కఁగ నెఱిఁగియున్న వారప్పటికున్న మనుష్యులలో నతఁడే శ్రేష్ఠుఁడని చెప్పియున్నారు. తరువాతి ధర్మోపదేశకులందఱకునతఁడే మూలపురుషుఁడనియు, ప్లేటోయొక్క మహోన్నతమైన యాధ్యాత్మిక దృష్టికిని ఆరిస్టాటిలుయొక్క విమర్శనాయుక్తమైన నీతిసిద్ధాంతమునకు ననఁగా ధర్మసంబంధమైనట్టియు మఱి యితరమైనట్టియు సర్వశాస్త్రములకు నాధారభూతములైన రెండిటికిని గూడనితఁడే జన్మభూమియనియు మన మెఱుఁగుదుము. అప్పటినుండి యిప్పటివఱకును జన్మించినయాలోచనకర్తలలో శ్రేష్ఠులందఱును శిరసావహించిన మహోపాధ్యాయుఁడైన యితని కీర్తి రెండువేలసంవత్సరములనుండి వర్ధిల్లుచున్నది. అతనిపట్టణమును గీర్తివంతముగఁ జేసిన తక్కినవారందఱి కీర్తికంటె నెక్కుడుగఁ దులతూఁగుచున్నది. ఇటువంటి సాక్రటీసును అతనిదేశస్థులు విమర్శించిదుర్నీతి, నాస్తికత్వము అను నేరములను మోపి మరణము నొందించిరి. నాస్తికత్వమనఁగా రాచఱికపు వారంగీకరించినదేవతలను నిరాకరించుట. ఇతనిమీఁద నేరము మోపినవాఁ డితఁ డేదేవతను నమ్మలేదని చెప్పియుండెను. దుర్నీతి యనినప్పు

డతని సిద్ధాంతయులవలనను ఉపదేశములవలనను చిన్నవయస్కులను జెడఁగొట్టెనని చెప్పిరి. అతఁడీరెండు నేరములను జరిగించెనని న్యాయకర్తలు నిష్కపటముగా నమ్మిరని యెంచుటకుఁ దగినహేతువులున్నవి. అట్లునమ్మి మనుష్యప్రపంచములో నాకాలమున జన్మించి యున్న వారిలోకెల్లపూజ్యుఁడగు నాతని నపరాధిగ నెంచి మరణశిక్షవిధించిరి.

మఱియొక ఘోరమైన యన్యాయమును గూర్చి విచారింతము.

3. క్రీస్తు దృష్టాంతము. ఇజసాక్రిటీసునకుఁజేసిన శిక్షకంటెఁ దీనిపోవునది కాదు. ఇప్పటికి 1800 సంవత్సరములకంటె నెక్కుడుకాలముక్రిందనది కాల్వరీవద్ద జరిగినది. ఎవని పుణ్యశీలతే యతనిజీవితమునకును, సంభాషణములకును సాక్షీభూతులైన వారి డెందంబుల నాటుకొనెనో, ఎవనిని 1800 సంవత్సరములవఱకు జను లీశ్వరావతారముగ సేవించుచుండిరో, వానిని నీశ్వరదూషకునిగ నీచమైనరీతిని మరణమునొందించిరిగదా! ఈవిషయమున మానవులు తమమహోపకారి యైనవానిని సరిగ గ్రహింప లేకపోవుటయేగాక యతని యథార్థస్వభావమునకుఁ గేవలము విరుద్ధమైన నాస్తికాగ్రేసరునిగ నెంచియుండిరి. అట్లు చేసినందుల కిప్పుడు వారికి నాస్తికాగ్రేసరులను వాడుక సంప్రాప్తమయినది. ఈదుఃఖభాజనమయిన చర్యలను, ముఖ్యముగ, రెండవ విషయమున జరిగినవానిని బట్టి మానవకోటిమనస్సు కలవరపడి, యాచర్యలను జరిగించినవారియెడ మిక్కిలియన్యాయమయిన యభిప్రాయమును బుట్టించుచున్నది. ఆకార్యములను జరిగించినవారు సామాన్య మానవులకంటె నెక్కుడు చెడ్డవారుగ నుండినట్లు కనఁబడరు సరిగదా! అప్పటి కాలములోని జనులన్వమత, నీతి, దేశాభిమానములను పూర్ణముగఁ గలిగియున్నట్లగపడెడిని. ఒకవేళ నుండవలసినదానికంటె నెక్కువ యభిమానమును గలిగియున్నట్లుకూడఁ దలఁపవచ్చును. అటువంటిజనులు సర్వకాలములయందును నిర్దోషులుగను గౌరవనీయులుగను, జీవయాత్ర గడపుటకు సర్వవిధముల నవకాశమున్నది. తన దేశస్థుల యభిప్రాయప్రకారము పరమనికృష్టమై

దోషసూచికమగు మాటలనువినినప్పుడు తనవస్త్రములను జింపుకొనిన ప్రధాన గురువుయొక్క యాగ్రహమును అసహ్యమును ఇప్పటికాలములో నీతిమత విషయములయందు ధర్మనిష్ఠగలిగిన గౌరవనీయులతోఁ బాటు నిష్కపట మయియుండవచ్చును. అతని ప్రవర్తనను గూర్చి యిప్పుడు కంపమొందు వారా కాలమున యూదులుగఁ బుట్టియుండిన యెడల సరిగా నతనివలెనే ప్రవర్తించియుందురు. మొట్టమొదట క్రైస్తవులమీఁద రాళ్లురువ్వి చంపినవారిని తమకంటె హీనులని యెంచు క్రైస్తవశిష్టులు సెంటుపాలు కూడ నటుల హింసించినవారిలో నొకఁడని జ్ఞప్తియందుంచుకొనవలయును.

మార్కస్ ఆరెలియస్సు దృష్టాంతము.

వివేకియుఁ బుణ్యశీలుఁడునగు మానవుఁడే దేనినొకపొరపాటును జరిగించినప్పుడు ఆపొరపాటెంతబలవంతమైనదో తెలియఁగలందులకు మఱియొక దృష్టాంతమును జూపించెదము. అధికారమును వహించిన వారిలో నెవ్వఁడైన తనకాలపు జనులందఱికంటెఁ దానే శ్రేష్ఠుఁడును జ్ఞానవంతుఁడును ననుకొనుట యుక్తియుక్తమైనయెడల అదిమార్కస్ ఆరెలియసునకే చెల్లియుండఁదగును. నాగరికతగల ప్రపంచమున కంతకును నిరంకుశ ప్రభువయ్యు నాతఁడు యావజ్జీవము నిర్దుష్టమైన న్యాయశీలుఁడుగ నుండెను. ఇంతియగాక సుఖదుఃఖములను సమానముగఁ జూచుశిక్షయందుఁ జెరిఁగిన వాఁడయ్యును నత్యంతకోమలమైన హృదయమును గలిగియుండెను. అతని యందు లోపములేవేనిఁ గొన్ని యున్నయెడల నవి యతని ప్రసన్నగుణము చేతఁ గలిగినవి. అతని గ్రంథములు పూర్వకాలపు మహోత్కృష్టమైన నీతివిద్యను సూచించుచున్నవి. ఇవి క్రీస్తుయొక్క విశేషబోధనలకంటె నీషన్మాత్రమైనను భేదించునని చెప్పుట కలవికాదు. శిష్టుల యభిప్రాయ ప్రకారము కాకపోయినను, యథార్థముచేత నతని తరువాత రాజ్యము చేసిన క్రైస్తవ ప్రభువులందఱికంటెను శ్రేష్ఠమయిన క్రైస్తవుఁడని చెప్పఁదగియున్నది. ఇటువంటి మార్కస్ ఆరెలియస్ క్రైస్తవులను హింసించి యున్నాఁడు. మానవకోటి కప్పటికిఁగల విద్యల కన్నిటిలో

మహోన్నతుఁడై సర్వ స్వతంత్రమైన బుద్ధిమంతుఁడై యొరుల ప్రోద్బలము లేకయే తన గ్రంథములయందుఁ గ్రైస్తవ మతావధిని బోధింపవచ్చిన వాఁడయ్యును ఇతఁడు తనయధీనమయిన రాజ్యమునకుఁ గ్రీస్తుమతము చెఱుపుచేయునది గాక మేలుచేయున దగునని కనిపెట్టలేకపోయెను. అప్పుడు మిక్కిలి దుస్స్థితిలోనున్నట్లగపడుచుండిన సంఘమును చెదరిపోయి పాడుకాకుండ పట్టుకొని వచ్చుటకు నప్పటికిఁ బ్రజలంగీకరించి యున్న దేవతలను విశ్వాసముతో నారాధించుటయేసాధనమని యతఁడు తలంచెను. సంఘమును చెదరిపోకుండఁగాపాడుట ప్రభువయిన తనకువిధియని యతఁడెంచి యుండెను.

అప్పటికుండు నిబంధనలు పోయినయెడల సంఘమునకుఁ దగిన కట్టుబాటులు మఱియెవ్వియు నతనికి గనఁబడవయ్యె. ఇట్టిసందర్భమునఁ గ్రొత్తగ బయలుదేరిన క్రీస్తుమతము సంఘముయొక్క నిబంధనలను నాశనముచేయునట్లగపడెను. కనుక నతఁడామతమును విధిగ నవలంబించుటకు వలనుపడనప్పుడు దానిని నాశనము చేయుటయే విధిగఁ గాన్పించెను. క్రైస్తవమత మతనికి సత్యమనిగాని యీశ్వర దత్తమనికాని కానిపింపదయ్యె. సిలువమీఁద మరణము నొందిన యీశ్వరావతారమతనికిఁ గేవల మవిశ్వసనీయమయి పోయెను. అంత యవిశ్వసనీయమయినదాని నాధారపఱచుకొన్న సిద్ధాంతము లోకమును గొంతవఱకయిన నుద్ధరింపఁబోవుచున్నదని యతనికి గోచరము కాదయ్యె. ఈకారణములనుబట్టి ప్రభువులలోనెల్లను, తత్వవేత్తలందఱికంటెను మిక్కిలి సాధువయి కృపాశీలుఁడయిన నితఁడు క్రైస్తవమతమును హింసించుట తనకు విధియని శిరసావహించెను. ఇది నాబుద్ధికి చరిత్రములోనెల్ల దుఃఖకరమైన యంశములలో నొకటిగఁదోఁచెడిని. కాన్‌స్టాంటైను చక్రవర్తి యొక్క యాదరణమునకు బదులుగ మార్కసు ఆరెలియస్ యొక్క యాదరణముక్రింద గ్రీస్తుమతము రాజమతముగ నంగీకరింపఁబడిన యెడల, నామతము లోకములో నిప్పుడు కనఁబడుచున్న దానికంటె నెంత భేదముగనుండునో తలఁచుకొనినప్పుడు మనస్సునకు వ్యసనము కలుగకమానదు. క్రీస్తుమతమునకు విరుద్ధమైనబోధనను శిక్షించుటకెన్ని హేతువులుగలవో, యతఁడుక్రీస్తు

మతవ్యాపకమును దండించినందున కన్నిహేతువులును సంపూర్ణముగఁ గలిగి యుండెనని యంగీకరింపనిచో నతనికిన్యాయము కలుగుటయే గాక కేవల మసత్యము కూడనగుచున్నది. అప్పటికాలపు జనులందఱిలో నతఁడే క్రీస్తు మతసారస్యమును గ్రహింపఁ గలిగినవాఁడు. అయినను నాస్తికత్వము క్రైస్తవునకెంత యసత్యముగను, సంఘమునకెంత యనర్థదాయకముగను గాన్పించునో మార్కస్అరెలియసు దృష్టికి క్రైస్తవమతమంత యసత్యముగను అనర్థదాయకముగను గాన్పించెను. కనుక మార్కస్ఆరెలియసుకంటె వివేకియుఁ బుణ్యశీలుఁడును, విద్యాపరిపూర్ణుఁడును, బుద్ధిమంతుఁడును, సత్యగ్రహణ పారీణుఁడును, సత్యసంధుఁడును అనుకొనివిజ్ఞవీగెడువాఁడు తప్ప మఱెవ్వఁడును అభిప్రాయ ప్రకటనమునకై దండనల నొప్పుకొని తనకును జనసమూహమునకును గూడ నప్రమాదిత్వ కల్పనచేసికొనఁగూడదు. అట్లు చేసికొనిన యెడల అంటోనయినసు ప్రవర్తనమువలనఁ గలిగిన దుర్దశయే కలుగును.

పూర్వ పక్షము.

మతవిషయికాభిప్రాయ నిరోధమునకై దండనను సమర్థించుటకసాధ్యము. దీనికేకారణము చెప్పిన నదే కారణమువలన మార్కసుఆంటోనైనసునుగూడ సమర్థించుటకు వీలుండకపోదు. ఈసంగతివలన మతవిషయిక స్వాతంత్ర్య విరోధులకునొత్తుడువచ్చినప్పుడీయర్థము నంగీకరించి, డాక్టరుజాన్‌సన్ తోఁ బాటు క్రీస్తు మతావలంబకుల హింససరియైనదని చెప్పుచుందురు. మఱియుమతవిషయమైన హింసవలన నాఁటితేఱిన నేగాని సత్యము బయలుపడదనియు, నదెప్పుడు నీవిధముననే జయప్రదముగ వెలువడుననియుఁ జట్టముల మూలమున విధింపఁబడు దండనలుతుదకు సత్యమును బాధించుట కసమర్థములనియు, నపాయకరములైన దుస్సిద్ధాంతములప్పుడప్పుడీ దండనలవలన నణఁగిపోవుచుండు ననియుఁగూడఁ జెప్పుదురు. మతవిషయికమైన ద్వేషమును సమర్థించుటకుఁ జేయఁబడువాదములో నిదిమిక్కిలి విశేషమైనది యగుటచేత దానిని విమర్శింపకుండఁ బోనియ్యఁగూడదు.

సత్యమునకు హింసవలన బాధకలుగదు. కనుక నట్టిహింస సమర్థనీయమని వాదించువారిని నూతనసత్యగ్రహణమునకు బుద్ధిపూర్వకమైన శత్రువులనిచెప్పుటకు వీలులేదు. కాని యానూతనసత్యములను బ్రపంచమునకుఁ బ్రసాదించిన వారినీవిధముగ నాదరించు నౌదార్యమును మాత్రము పొగడఁజాలము.

పూర్వపక్ష పర్యవసానము.

ప్రపంచమున కత్యంతము సంబంధించిన దానినిగని పెట్టి, యంతవఱకునజ్ఞానములోనున్న లోకమునకు కాసత్యమును బ్రసాదించి, ఐహికమునఁగాని ఆముష్మికమునఁగాని యొకముఖ్యాంశములోఁ బ్రపంచము పొరపడుచుండినప్పుడా పొరపాటును యుక్తియుక్తముగఁ కనఁబఱచుటకంటె మనుష్యజాతికెక్కువ యవశ్యకమైన కార్యములేదు. ప్రాచీన క్రైస్తవులు సంస్కర్తలువంటి కొందఱువిషయములో డాక్టరుజాన్‌సన్ మున్నగువారు ప్రపంచమునకు లభింపఁగల యమూల్యప్రసాద మదియేయని నమ్ముచుందురు. ఇట్టి శ్రేయోదాయకులకుఁ బ్రతిఫలముగ హింసనొనర్చుటయుఁ బరమనికృష్టులైనయపరాధులతోఁ బాటువారిన నాదరించుటయు, నీసిద్ధాంతముప్రకారము పొరపాటుగను దురదృష్టముగనెంచి విచారపడ నక్కఱలేదు. మఱియు నీ దురవస్థ స్వభావసిద్ధమైనది గాన సమర్థనీయము. ఈ సిద్ధాంతము ప్రకారమొకనవీన సత్యమునుబ్రోధించు వాఁడు లోక్రియనులలో (Locrians) నూతనశాసన నిర్వాహకుని వలెనే మెడకురిత్రాడును దగిలించుకొని యతఁడుచెప్పు కారణములను విని యాసత్యము నంగీకరింపనిచో వెంటనేత్రాడును బిగియఁదీయుటకు సంసిద్ధుఁడుగ నిలఁబడ వలయును. లోకోపకారుల నీరీతి ననాదరించు జనులాయుపకారములను విలువగలిగినదిగాఁ జూచుచున్నారని చెప్పుటకు వీలులేదు. ఇంతియగాక యీవిషయమునఁ బైనిఁజెప్పినరీతి నాలోచించువారు పూర్వకాలమునందు నూతనసత్యము లవశ్యమనియెంచిన నిప్పుడవశ్యములేదని యూహించుచున్నట్లు నేను దలంచెదను.

అయిననునిజము విచారించినయెడల సత్యమెల్లప్పుడును హింసలను దప్పించుకొని జయప్రదముగ నిలుచునను సిద్ధాంత మెంతయింపుగనున్నను,

సిద్ధాంతము. వట్టి భ్రమయైయున్నది. కానిదీనిని మనుష్యులు తఱచుగఁ జెప్పుకొనుచుండుట వలన, సర్వసామాన్యమై యుండ వచ్చునుగాని యసత్యమును, అనుభవమునకు విరోధము నయియున్నది. హింసవలనసత్యము నశించిపోయినందుకుఁ జరిత్రలోననేక దృష్టాంతములు కలవు. ఒకవేళశాశ్వతముగ రూపుమాసిపోకున్నను, అదియనేక శత సంవత్సరముల వఱకు వెనుకఁబడి పోవచ్చును. ఒక క్రై మతవిషయమును ఎత్తుకొని చెప్పెదను. యూరపునకుఁ బూర్వము మత సంస్కరణ మధమ మిరువదిసారు లంకురించినది. అన్నిసారులునుగూడఁ దల యెత్తకుండ నణఁగిపోయినది ఆర్నాల్డును, ఫ్రిడాల్‌సినోయును, సావనరోలాయును' ఆల్బిగీయాసును, వాడాయులును, లోలార్డులున్ను, హూస్సైటులును' అంతరించిరి. యూరపుశకమునకుఁ బిమ్మట సయిత మెచ్చ టెచ్చటఁ బట్టు విడువకుండ హింసజరిగెనో యచ్చటచ్చట హింసయే జయము నొందెను. స్పెయిన్, ఇటలీ, ఫ్లాండర్సు, ఆస్ట్రియా రాష్ట్రములలో సంస్కరణనొందిన మతము మూలచ్ఛేదితమై పోయెను. మేరీరాణి జీవించి ఎలిజబెత్తురాణి చనిపోయినయెడల నింగ్లాండులోఁగూడ బహుశా యీరీతినే జరిగియుండును. ఫలితములు హింసవలన నశించుటకు వలనుపడకుండ బలవంతులైనచోటఁ దక్క తక్కినచోటుల హింస సర్వదా గెలుపునొందెను. రోమకరాజ్యములోఁ గ్రీస్తుమత మంతరించిపోవుటకు వీలులేదని ప్రాజ్ఞుడైనవాఁ డెవ్వఁడును శంకింపఁడు. దానికి హింస లప్పుడప్పుడుకొద్దికాలము మాత్రము సంభవించి, మధ్యమధ్య చాలకాలము నిరాటంకముగ వ్యాపించుటకవకాశములు చిక్కియుండుటచే వ్యాప్తమునొంది యాధిక్యతను జెందెను. సత్యము స్వశక్తిచేఁ గారాగృహ దహనాది శిక్షల జయించునను యూహ కేవల వ్యర్థాభిమానమై యున్నది. మనుష్యులకుఁ దఱచుగ నసత్యమునందుఁ గల యుత్సాహముకంటె సత్యమునం దెక్కుడు త్సాహము ముండుటలేదు. రెండిటిలో దేనినైనను రాజక సాంఘిక దండనలను జాలినంతఁ బ్రయోగించి వ్యాపింపకుండ సాధారణముగఁ

జేయవచ్చును. యథార్థమైన యభిప్రాయ మొకటి రెండుసార్లు లేక యనేకపర్యాయములు రూపుమాపఁబడినను గాలక్రమమున ననుకూలమైన సందర్భములలోఁ దిరిగి దానిని గనుఁగొనువారుందురు. అట్లు మరలఁ బొడచూపినప్పుడు హింస జరుగకుండుటచేఁ దగినంత బలిష్ఠమయి పిమ్మట దాని నణఁగఁ గొట్టుటకు జరుగు ప్రయత్నములకు లొంగకుండఁ బోవచ్చును. ఇదియే నిజముగ సత్యమునకుఁ గల బలము.

దృష్టాంతములను బట్టి సిద్ధాంత వాదము.

మన పూర్వులవలె మన మిప్పుడు నూతనాభిప్రాయ బోధకులను, మతోపదేశకులను జంపుటలేదనియు, వారికి సమాధులను గూడ నిర్మించి గౌరవించుచున్నామనియుఁ జెప్పవచ్చును. మనమిప్పుడు విమతులను జంపకుండుమాట నిజమే. అత్యంత మసహ్యాకరమయిన యభిప్రాయములను సయితము నశింపఁజేయఁగల దండనలకిప్పుడు లోక మొప్పుకొనదు. కాని యిప్పటికి సహితము రాజ్యాంగరీతిని హింస జరిగించుచున్నామను నిందనుండి మనము కేవలము విముక్తుల మయితిమని సంతోషింపఁగూడదు. అభిప్రాయమునకై కాని లేక దానిని ప్రకటననిమిత్తమయి కాని యిప్పటికిని దండనవిధించు చట్టములున్నవి. వానినెప్పటికైనను సంపూర్ణబలముతోఁ బ్రయోగింతురను నమ్మికను కేవలము త్రోసివేయుటకు వీలుపడకుండఁగొన్ని దృష్టాంతము లగపడుచున్నవి. 1857 సంవత్సరమున వేసవికాలములో కారనువాలు జిల్లాయందు న్యాయసభయెదుట సమస్త విషయములలో నిర్దుష్ట చర్యగల యొక మనుష్యునిఁ బెట్టి క్రీస్తుమతమును గుఱించి యేవియో కొన్ని దూషణవాక్యముల నుడివి, యొక బహిర్ద్వారముమీఁద వ్రాసినందులకై యా దురదృష్టుని 21 మాసములు కారాగృహశిక్ష విధించిరి. తరువాత నొక మాసములోపలనే యిద్దఱు మనుష్యులను వేఱువేఱు సమయముల జూరరులుగఁ (Jurors) బనికిరారని నిరాకరించి వారిలో నొకనిని న్యాయకర్తయు న్యాయవాదులలో నొకరును నాస్తికుఁడని యగౌరవము కూడ చేసిరి. విదేశీయుఁ డొకఁ డొకచోరుని మీఁద నభియోగము తేఁగా

నిదే కారణమునుబట్టి నాతనికి న్యాయము జరుగకుండఁ ద్రోసివేసిరి. ఏ మనుష్యుఁడుగాని యేదోయొక దేవుఁడున్నాఁడనియు, ఆత్మనిత్యమనియు నమ్మనియెడల న్యాయసభలో సాక్ష్య మిచ్చుటకు నర్హుఁడను దొరతనపు వారి సిద్ధాంతమే యిట్లు న్యాయము కలుగకుండఁ ద్రోసివేయుటకుఁ గారణమైయున్నది. దీనియర్థమేమనిన, ఇట్టివంటిమనుష్యులకుఁ జట్టములవలనను న్యాయసభలవలనను రక్షణముగలుగదనియు వీరివలెనే నాస్తికాభిప్రాయము గలవారి యెదుటఁ జోరులపాలఁబడిన నా చోరులకు శిక్షలేదనియు తేలుచున్నది. ఇంతియగాక మఱియెవ్వరయినను జోరులచేతిలోఁ జిక్కినప్పుడా విషయమునకుఁ బూర్వోక్తమైన నాస్తికులు సాక్ష్యమిచ్చుట తటస్థించినయెడల వారికినిగూడ న్యాయము కలుగనేరదనియుఁ దేలుచున్నది. "పరలోకములేదని నమ్మునట్టివాఁడు చేయు ప్రమాణమేదైనను నిరర్థక మనుకొనుటయే దీనికిఁ గారణమై యున్నది. ఈ సిద్ధాంతము నొప్పుకొను వారికిఁ జరిత్రజ్ఞానము లేదని దీనివలననే కనఁబడుచున్నది. సర్వకాలములయందును నాస్తికులలోఁ జాలమంది వారియోగ్యతకును యథార్థతకును పేరుపడియుండిరనుట చరిత్రాంశమే. లోకములోఁ బుణ్యశీలతచేతను సమర్థతచేతనుగూడ సుప్రసిద్ధులయిన పూర్వులలో నెందఱు నాస్తికులని పేరుపడిరో దాని లేశమైన నెఱిఁగినవారీ సిద్ధాంతము నొప్పుకొనరు. ఇంతియగాక యీ శాసనము స్వఘాతుకమును స్వనాశన హేతువునైయున్నది. నాస్తికు లసత్యవంతులను హేత్వాభాసచేత వారిలో ననృతమాడుట కొప్పుకొనువారి సాక్ష్యము నంగీకరించి, యసత్యమును బలుకుటకు మాఱుగ నసహ్యమైన మతసిద్ధాంతమును బహిరంగముగ స్వీకరించి యవమానపడుటకైన సాహసించువారి సాక్ష్యమును నిరాకరించుచున్నది. ఇంత యక్రమమై స్వదూషణహేతువైన శాసనముయొక్క యుద్దేశమును విచారించినయెడల నిది కేవల మసూయా సూచికమయినహింసాశేషముగ మాత్రము నిలిచియున్నది. ఈహింస యే హేతువుచేత జరుగఁగూడదో యా హేతువుచేతనే జరిగించుటకూడఁ దటస్థించుచున్నది. ఈ శాసనము దీనికి హేతుభూతమయిన

సిద్ధాంతమును ఆస్తికులకు నాస్తికులకుఁ గూడ సమానమయిన యగౌరవమును గల్పించుచున్నవి. ఎందుకనినఁ బరలోకమును నమ్మనివాఁ డసత్యవంతుఁ డనుటచేత దానిని నమ్మినవారికి నరకభీతి యసత్యమాడకుండ నాటంకపడుచున్నదని తేలుచున్నది. ఇటుల నాటంకముకలుగుటకూడ సంశయాస్పదమే. ఈ సిద్ధాంతమును బ్రతిపాదించినవారును, దానికి సహాయులునుగూడఁ గ్రైస్తవ ధర్మాచరణమునకు వారి స్వానుభవమునుబట్టి యర్థము చేసినారని చెప్పినందున వారికేమయిన నింద తెచ్చినవార మగుదుమేమోయని యట్టి యూహను మానుకొనుచున్నాము.

మనోదాస్యము.

ఇవి పూర్వకాలపు హింసా శేషములనియు, వీనినిబట్టి హింసేచ్ఛ గలదని యూహింపరాదనియు నేదేని దుస్సిద్ధాంతమును వ్యవహారములోనికిఁ దీసుకొనివచ్చునంత దుర్మార్గము లేకపోయిన నా సిద్ధాంతమును విడువక పట్టుకొనుటయం, దాంగ్లేయులకుఁ గల పిచ్చి సంతోషమునకును లోపమునకు నవి దృష్టాంతములేగాని యితరములు కావనియుఁ గొందఱనుకొనవచ్చును. కాని యొకతరమునఁ జట్టముల మూలమున హేయమయిన హింసకు విరామము కలిగినంత మాత్రమున నా విరామము స్థిరమని యూహించుటకు వీలులేదు. ఇదెంతయు శోచనీయము. ఈ యుగములో నూతన శ్రేయోదయమునకు యత్నములు జరిగినటులనే పూర్వకాలమందలి విపత్తులను పునరుజ్జీవింపఁ జేయుటకును దఱచుగ యత్నములు జరిగి నిత్యకృత్యముల శాంతికి భంగము కలుగుచున్నది. ఇప్పటి కాలములో మతోద్ధారణమని చెప్పి విజృంభించునది యల్పుల మనస్సులో మతద్వేషోద్ధారణముగఁ బరిణమించుచున్నది. ఈ దేశములోని సామాన్య జనుల యంతఃకరణ లెల్లప్పుడును మతద్వేష భూయిష్ఠములైయు యున్నందున వారి కేమాత్ర ముద్రేకము కలిగినను హింసకుఁ బాత్రులని తోఁచెడివారిని క్రియయందును హింసింపకమానరు. * ఈ కారణమును

* సిపాయిలతిరుగబాటుసమయమున మన (ఆంగ్లేయ) జాతివారి

బట్టి యరయఁగాఁ దమ మతముతో నేకీభవింపనివారియెడల నిచ్చటి జనులకుఁ గల యభిప్రాయములను అంతఃకరణ వృత్తులనుబట్టి యీ దేశమునందు మనస్స్వాతంత్ర్యము లేకయున్నయది. చాలకాలమునుండి చట్టములమూలమున విధింపఁబడు దండనలు సంఘమువలనఁగలుగు నవమానములకుఁదోడ్పడి చెఱుపు చేయుచున్నవి. ఈ యవమానమే నిజముగ బలవంతమయినది. ఇతర దేశములలోఁజట్టములు విధించు దండనకుఁ బాత్రులనుగఁ జేయు నభిప్రాయప్రకటనముకంటె నింగ్లాండులో సంఘమువలనఁగలుగు నవమానమునకుఁ బాత్రులనుగఁజేయు నభిప్రాయ ప్రకటనమే తక్కువగనున్నది ఇతర మనుష్యుల దయ యక్కఱలేకుండ జీవింపఁగల ధనసంపన్నుల విషయమయి తక్క తక్కినవారి విషయములోఁ బైనిఁజెప్పబడిన యభిప్రాయము చట్టముతో సమానమయిన బలముకలదై యున్నది. మనుష్యులను గారాగృహ

---

దుశ్శీలతాప్రభావమునకు హింసకుల మనోవికారములు తోడ్పడి విశేషమైన ప్రబోధనను గలిగించుచున్నది. చాందసులయొక్కయు దాంభికుల యొక్కయు పిచ్చిబోధన లటుండనిండు. మతవ్యాపక సమాజాధికారులుఁకూడ బైబిలు చదివింపని బడులకు ధనసాహాయ్యము చేయఁగూడదనియు, యథార్థముగనో మాయగనో క్రైస్తవులైనవారికిఁ దప్ప యితరులకుద్యోగము లియ్యఁగూడదనియు. నీసూత్రము ననుసరించి హిందువులను మహమ్మదీయులను బరిపాలింపవలయుననియు వారి నియమముగఁ బ్రకటనముఁ జేసిరి. 1857 సంవత్సరములో 12 నవంబరున అండరు సెక్రిటరీ తన నియోజకులతో నిట్లుపన్యసించినట్లు వినుచున్నాము. "పదికోట్లజనులు మతమని పేరు పెట్టుకొనినమూఢనమ్మికను బ్రిటిషుగవర్నమెంటువారు సహించి యూరకుండుటవలన బ్రిటిషువారి పేరుప్రతిష్ఠల కాటంకము కలిగి, క్రీస్తుమతము సలక్షణముగవృద్ధి చెందకుండఁబోయెను. ఈదేశములో(ఇంగ్లాండులో) మతవిషయిక స్వాతంత్ర్యమునకు సహనమే ముఖ్యాధారము. కాని యీసహనపదమును వారు దుర్వినియోగము చేయఁగూడదు. ఒకటే విషయము నా

మునఁ బెట్టుట యెంతయో వారి జీవనోపాధిని దీసివేయుటకూడ నంతయే.
జీవనోపాయము కలిగియుండి యధికారపురుషులయొక్కయు, జనసంఘముల
యొక్కయు, లేక జనసామాన్యముయొక్కయు, ననుగ్రహమును గోరని
వారికి నే విధమయిన యభిప్రాయ ప్రకటనమువలనను జెడ్డవారనిపించు
కొని యప్రతిష్ఠ పాలగుటకంటె నెక్కువ జడియవలసిన సంగతిలేదు. వీనిని
భరింపఁగలుగుటకు విశేష పౌరుష మక్కఱలేదు. ఇటువంటివారికి జాలి
నొందవలసిన యవకాశములేదు. అయిన నిప్పుడు మనకంటె భిన్నముగ
నాలోచించువారిని పూర్వకాలమునందువలె మిక్కిలి విపత్తులపాలు చేయక
పోయినను మనకు వారియెడఁగల యనాదరణమువలన మనకిపుడు నంత కీడు
కలుగుచున్నది. సాక్రటీసు మరణశిక్ష నొందినను అతని సిద్ధాంత మాకా
శమునందలి సూర్యునివలెఁ బ్రవర్ధమానమయి మనఃప్రపంచమును నంత ప్రజ్వ
లింపఁజేసెను. క్రైస్తవులు సింహముల వాతఁబడినను క్రైస్తవ సాంప్ర
దాయము విపులమయిన మహోన్నత వృక్షము రీతిని బెరిఁగి యదివఱకుండు
కొన్ని తక్కువ బలవంతమయిన వాని నన్నిటి నణఁగఁద్రొక్కి తన నీడ నవి
పెరుఁగకుండ నశించునట్లు చేయుచున్నది. కేవలము సాంఘిక రీతిని
మనము కనఁబఱచు ననాదరణముచేత నెవఁడును హతుఁడగుటగాని, యే

---

ధారపఱచుకొని దేవతారాధనచేయుఁ గ్రైస్తవులలో యథేచ్ఛముగ నారాధిం
చుట కుండవలసిన సంపూర్ణస్వాతంత్ర్యమే సహనమని నా తాత్పర్యము.
ఒకటే మధ్యవర్తిత్వమును నమ్మునట్టి క్రైస్తవశాఖలవారందఱ యెడలఁ బ
స్పరముసహనమని తాత్పర్యము," లక్ష్యముతో గమనింపవలసినదని నేను గో
రెడి యంశమేదనఁగా, నీదేశపు రాచరికములో నౌదార్యశీలురైన మంత్రి
గణము క్రింద గొప్ప యుద్యోగమున కర్హుఁడని యెంచఁబడిన యొక మాన
వుఁడు క్రీస్తును దేవుఁడని విశ్వసింపని వారందఱు సహనబాహ్యులనుసిద్ధాంత
మును బ్రతిపాదించుచున్నాఁడు. ఇట్లు వికలమతి ప్రకాశమైనపిమ్మట నె
వఁడు మతవిషయికహింసల నిఁక నెప్పటికిఁ దిరిగి తలయెత్తకుండ నశించిపో
యినదని భ్రమచెందగలఁడు?

యభిప్రాయములను మూలచ్ఛేదితములగుటగాని సంభవించుట లేదు. ఆయిన నీ యనాదరణమువలన మనుష్యులు తమయభిప్రాయములను మఱుఁగుపఱుచుటయు, లేదా వానిని వ్యాపింపఁజేయుటకుఁ జాటుమగ యత్నింపకుండుటయు సంభవించుచున్నది. మన నూతనాభిప్రాయములు పదిసంవత్సరముల కాలము లేకయొకతరములో స్ఫుటముగ వ్యాపించినట్లుగాని క్షీణించినట్లుగాని యగపడదు. అవి యెప్పుడును విశేషదూరము ప్రజ్వలింపక యాలోచనపరులును శ్రద్ధాశీలురునైన యేస్వల్పజన కూటములలోఁ బుట్టినవో యచ్చటనే రవులుచుండును. వానివలన మానవ వ్యవహారములకు యథార్థమైనట్టియు లేక భ్రమాస్పదమైనట్టియుఁ బ్రకాశము లభించుటలేదు. ఈ విధమున లోకవ్యవహారముండుటచేతఁ గొందఱి మనస్సులకుఁ జాల తృప్తి కలుగుచున్నది. దీనివలన నెవరిని గారాగృహమునఁ బెట్టి ధనదండన విధించి యసహ్యము పొందకుండఁగనే వాడుకలోనున్న యభిప్రాయము లన్నిఁటిని గలవరపడకుండ బైటకుఁ గాపాడ వీలగుచున్నది. ఇంతియగాక దీనిమూలమున విచారణయనుజాడ్యముచేతఁ బీడితులగువిమతులబుద్ధివ్యాపారమునకుఁ గేవలమాటంకము లేకయున్నది. మనః ప్రపంచములోని వ్యవహారము నిదివఱకున్న రీతినే యుండనిచ్చి శాంతము కలిగియుండుట కిది యనుకూలమయిన పద్ధతి. కాని మనః ప్రపంచములో నీరీతిని శాంతము సంపాదించుటచేత మనుష్యబుద్ధికిఁగల ధర్మశూరత యావత్తును గోలుపడుచున్నది. మనుష్యజాతిలో నత్యంత ముత్సాహవంతులై విచారణ శీలురగు బుద్ధిమంతులలోఁ జాలమంది వారినమ్మకముల కాధారభూతములైన న్యాయములను వారిమనస్సులలోనే దాఁచిపెట్టుదురు. వెలుపలకుఁ జెప్పువానిలో సయితము సాధ్యమయినంత వఱకు వారి సిద్ధాంతములను వారి బుద్ధిచేత విసర్జించిన న్యాయముల కనుకూలముగఁ జెప్ప యత్నింపవలసియుండును. ఇట్టి సంగతి సందర్భములలో నిష్కాపట్య నిర్భయ శీలతయు, యుక్తియుక్తమయి యవిరోధమయిన బుద్ధివిశేషమును బూర్వము ప్రపంచము నలంకరించినరీతి నలంకరించుటకు

వీలులేదు. ఇట్టిసందర్భములోఁ బ్రపంచమునకు లభింపఁగలిగిన మనుజులు సామాన్యన్యాయము ననుసరించిన వారుగను లేక సత్యమునందు లోకానుగతి కలుగను, ఉందురు. వీరు సకలోత్కృష్ట విషయములందును జెప్పెడియుక్తులు వినెడివారి ననుసరించి యుండునేగాని వారికి దృఢప్రత్యయ మయినవిగ నుండనేరవు. ఈపక్షము నవలంబింపక పోయినచో వారి తలంపులను ఉత్సాహములను తగ్గించుకొని న్యాయ విచారణపథమును ద్రొక్కుటకు సాహసింపక స్వల్పవిషయములందు మాత్రమే లక్ష్యముంతురు. మనుష్యబుద్ధి బలపడి వికసించినచో నీవిషయములు స్వతస్సిద్ధముగనే లభింపఁగలవు. అంతవఱకు నవి సరిగ లభింపఁజాలవు. కాని మనుష్యబుద్ధిని బలపఱచి వికసింపఁజేయుటకుఁ గావలసిన యుత్కృష్టవిషయ విచారణ సాహసముతో యథేచ్ఛముగ జరుగకుండఁ ద్యజింపఁబడుచున్నది.

మనోదాస్య ఫలము.

నూతనాభిప్రాయబోధకు లీవిధముగఁ దూష్ణీంభావము నొందియుండుటవలన నష్టములేదను దృష్టిగలవారందఱును దీనివలన నూతనాభిప్రాయములకు న్యాయమయిన సంపూర్ణ విచారణ కవకాశ మెప్పుడును గలుగదనియు నట్టి విచారణకు దాళఁజాలని యభిప్రాయములకు వ్యాపకము లేకుండ నాటంకము కలిగినను గేవలము రూపు మాసిపోవుట లేదనియు మొట్టమొదట నాలోచింపవలసియున్నది. కాని శిష్టసిద్ధాంతములందుఁ బర్యవసింపని విచారణను సర్వము నిషేధించుటవలన నూతనాభిప్రాయ బోధకుల బుద్ధిమాత్రమే భ్రష్టముకాదు. విమతులు కాకపోయినను విమతాపవాదభీతిచే బుద్ధివికాసతను గోలుపోయి విమర్శనజ్ఞానము సంకోచము నొందియుండు వారలందఱకు నత్యంతముకీడు మూఁడుచున్నది. మతవిరోధముగఁగాని, యవినీతిగఁగాని పర్యవసించునేమోయను భీతిచేత ధైర్యోత్సాహస్వాతంత్ర్య మయిన విచారణమార్గమును ద్రొక్కక పిఱికివారై వృద్ధిఁ జెందవలసిన బుద్ధిని గోల్పోయిన వారెందఱు గలరో, దానివలనఁ బ్రపంచమున కెంతనష్టము.

కలుగుచున్నదో యెవరు లెక్కకట్టఁగలరు. వారిలో నక్కడక్కడ ధర్మశీలుఁడును, సూక్ష్మగ్రాహియు, సుబుద్ధియునగు నొకఁడు కనుపట్టుచుండును. ఇట్టివాఁడు తనకణఁచిపెట్టఁ దరముగాని తనబుద్ధిని కుతర్కలోఁ బెట్టి, తనయంతరాత్మ విమర్శనజ్ఞాన ప్రబోధనలను శిష్టసాంప్రదాయములతో సమన్వయము చేయవలయునని తనశక్తియుక్తుల నన్నిఁటిని ప్రయోగించి యావజ్జీవమును ధారపోయుచున్నాఁడు. అయిన నీప్రయత్నమెప్పుడును జయప్రదము కాకపోవచ్చును. పర్యవసానమేమైనను దనబుద్ధిని బూర్ణముగ ననుసరించిపోవుట ప్రథమకర్తవ్యముగ గ్రహింపని వాఁడెవ్వఁడును గొప్పయాలోచనకర్త కానేరఁడు. అవిచారుల యభిప్రాయ యాథార్థ్యమువలనఁ గలిగినలాభముకంటె విద్యావ్యాసంగముగల సవిచారుల స్ఖాలిత్యముల వలననే సత్యమునకెక్కువ లాభము కలుగుచున్నది. గొప్పయాలోచన కర్తలు లభించుటకుమాత్రమే మన స్వాతంత్ర్యముండవలెనని నాతాత్పర్యముకాదు. సామాన్యజనులకు లభింపఁగలిగిన మనోభివృద్ధిని జెందుటకు నిదియే కావలసియున్నది. వీరికెక్కువ యవశ్యమనికూడఁ జెప్పవచ్చును. విచారణవిషయమున జనసామాన్యము దాస్యములోనున్న సందర్భమునఁగూడ, మహోన్నతులగు విచారణకర్తలుద్భవించియున్నారు. అటులనే యిఁకముందును పుట్టవచ్చును, కాని యట్టిబానిసతనములో నున్న జనసామాన్యము మాత్రము బుద్ధివికాసము నిదివఱకెన్నఁడును జెందియుండలేదు. ఇఁకముందెప్పుడును జెందఁబోదు. ఒకవేళ నిట్టియవస్థను గొంచెముకాల మేజనులైనఁ జెందియున్నచో నది నూతనాభిప్రాయ విచారణభీతి కొలఁదికాలము సడలియుండుటవలన సంభవించినది. ఎచ్చట న్యాయములను వివాదపఱుపఁగూడదని యొక నియమమూహ్యమైయుండి, మనుష్యజాతికిఁ గావలసిన గొప్పవిషయములను గూర్చినవాదము ముగిసిపోయినటుల భావింపఁబడుచున్నదో, యచ్చటఁ జరిత్రయందుఁ గొన్నిభాగములలో మిక్కిలిప్రసిద్ధిఁగాంచిన బుద్ధిచాకచక్యౌన్నత్యము కలుగుటకెంత మాత్రము నాశపెట్టుకొనుటకు వీలులేదు.

ఉత్సాహమును ప్రజ్వలింపఁ జాలినగొప్ప ముఖ్యాంశములయందు వివాదము మాని వేయఁబడి నప్పుడెప్పుడును సామాన్య బుద్ధికి నయితమాలోచనకర్త యను గౌరవమును గలిగించు గాఢమగు మనోద్దీపనమును, బ్రవృత్తియు సంభవించి యుండలేదు. దీనికి దృష్టాంతములు. ధర్మపరివర్తనము (Reformation) నకు సాక్షాదనంతరము యూరోపుఖండస్థితియొకటి. ఇంగ్లండు గాక తక్కిన యూరోపు ఖండములో విద్యావంతులతో సంబంధించినది మాత్రమే యయినను 18 వ శతాబ్దములో నుత్తరార్ధమునఁగలిగిన యాధ్యాత్మిక విచారణ మఱియొకటి. ఇంతకంటెను దక్కుకాలముజరిగినదైయినను జర్మనీ గోయతీ, ఫిక్టీలకాలపు మనోత్సేకమింకొకటి. ఆయాకాలములలోని యభిప్రాయవిశేషములు మిక్కిలిగఁ బరస్పరభేదముగలిగియున్నవి. అయిన నధికారభార విసర్జనమీమూడిటి యందును సమానలక్షణమైయున్నది. వానిలోఁబ్రతిదానియందును మనస్ప్రపంచమునఁ బ్రాచీన నిరంకుశాధికారము త్రోసివేయఁబడెను. నూతనముగ నట్టియధికారమమదేదియు నెత్తికెక్కకుండెను. ఈమూడు పర్యాయములును గలిగిన ప్రచోదనమువలననే యూరోపు పిప్పడుండి నట్లుండఁగలిగెను. మనఃప్రపంచమునఁగాని ప్రతిష్ఠాపన విషయమునఁగాని యేయభివృద్ధికలిగిన నదిపైనిఁ జెప్పిన హేతువులలో నేదియో నొకదానివలనఁ గలిగినదని స్పష్టముగఁ జూపింపవచ్చును. చూచువారికిఁ గొంతకాలమునుండి యామూడు ప్రవృత్తులును గూడ దుర్బలములై పోయినట్లు కనిపించుచున్నవి. కాన మన స్వాతంత్ర్యమును దిరిగి ప్రతిష్ఠించిననే గాని మనకు నూతన స్ఫురణ కలుగునని నిరీక్షించుట కవకాశముండదు.

రెండవహేతువు

ఇఁకనింతట వాడుకలోనున్న యభిప్రాయములలో నేవి గానియసత్యములను ననువాదమును విడిచిపెట్టి పరిష్కృతమైన వాదములో రెండవభాగము నెత్తుకొనెదము. అభిప్రాయములు సత్యములయిన పక్షములో వానిసత్యత్వము ధారాళముగను బహిరంగమును

భ్రమపడనిచో వానిని నమ్మెడురీతియొక్క యౌచిత్యమును బరీక్షింతము. ఎవ్వఁడయిన నొక యభిప్రాయమును సత్యమని పట్టుదలతో నమ్మినప్పుడొక వేళ యసత్యమగుట కవకాశమున్నదని యొప్పుకొనుట కెంత యిష్టము లేక పోయిన నాయభిప్రాయమును దఱచుగను, పూర్ణముగను, నిర్భయముగను చర్చింపనిచో నది సారవంతమయిన సత్యముగాక నిస్సారమయిన సిద్ధాంతమయి పోవునేమోయను నాలోచనయయిన తలపెట్టక తప్పదు.

హేతువివరణము.

సత్యమున కాధారభూతమయిన హేతుజ్ఞానము లేకపోయినను, ఎంత స్వల్ప యాక్షేపము గలిగినప్పుడు కూడ దానిని జక్కఁగ సమర్థింపలేకపోయినను, ఎవ్వఁడయిన దాను సత్యమని తలఁచినదానిని నిస్సంశయముగ స్వీకరించినఁ జాలునని యెంచు తరగతివారు కొందఱుగలరు. వీరు మునుపటివలె విస్తారముగ లేకుండుట మనయదృష్టము. ఇట్టివారు వారిమతమును నధికారముచే బోధింపఁగలిగినచో నిఁక దానిని వాదములో దిగనిచ్చినందువలన మేలేమియుఁ గలుగక కొంతకీడు కలుగునని యెంచుట సహజము. వారియధికారము సాగినప్పుడభిమత సాంప్రదాయమును అవిచారముగను మౌఢ్యముతో విసర్జించుటకు వీలుండును గాని, పరిశీలించి వివేకముతో వదలివేయుటకు దాదాపుగ నసాధ్యమగును. ఎందువలననఁగా వివాదముబొత్తిగ లేకుండఁ జేయుట యెప్పుడును సాధ్యముకాదు. అది యొకసారి ప్రారంభమయినచో నిర్ధారణలేని నమ్మకము లెంత స్వల్ప వాదాభ్యాసమున కయినను లొంగిపోవును. ఈపక్షమును వదలి యథార్థాభిప్రాయము మనస్సునందు నిలుచునని యెంచిన నది ప్రమాణాభావమును బ్రమాణనిర్భిన్నము నయిన యవిచార నిర్ణయమయి యుండును. హేతుజ్ఞానముగల మనుష్యమాత్రుఁడు సత్యము నవలంబించు మార్గమిదికాదు. ఇది యథార్థజ్ఞాన మనిపించుకొనదు. ఈరీతిగ సత్యమును నమ్ముటవలన సత్యావగాహనములేదు గాని దానిని బోధించు శబ్దావలంబనము మాత్రము తటస్థించుచున్నది, ఇట్టినమ్మకము మూఢవిశ్వాసముగనుక యిది వఱకుండియున్న మూఢవిశ్వాసముల సంఖ్యకింకొక్కటి జత పడుచున్నది.

సత్యస్ఫురణమునకుఁ బ్రతిపక్షవాద మావశ్యకము.

మానవుల బుద్ధియు విమర్శనాశక్తియు వృద్ధిఁజెందవలెనని ప్రొటె
స్టెంటుల మట్టుకయిన యొప్పుకొనక పోలేదు.
మనుష్యుఁడేవో కొన్ని యభిప్రాయములను గలిగి
యుండవలసినంత యావశ్యకమయిన విషయము
నందుఁ గంటె మఱి దేనియం దాశక్తుల నెక్కువ
యుక్తముగఁ బ్రయోగింపఁ గలఁడు? ఎవరి యొక్క యయిన యభిప్రా
యములకు హేతువులను దెలిసికొనుటయే మనోభివృద్ధి కన్నిటికంటె
నిశ్చయముగ నెక్కుడు సంగతి. సరియయిన నమ్మకములనుగలిగియుండవలసిన
దేసంగతులయందు మిగుల ముఖ్యమో యావిషయముల యందలి నమ్మికల
లకుఁగల సామాన్య యాక్షేపములనయిన మానవులు నివారించుకొనఁ
గలిగి యుండవలెను. కాని కొందఱీవిధముగఁ జెప్పవచ్చును. "యభి
ప్రాయములకు హేతువులను వారికి నేర్పినఁజాలును. అభిప్రాయములకు
విరోధవాదము వినియుండనంత మాత్రమున నవి చిలుకపలుకులవలె నున్న
వని చెప్పరాదు. క్షేత్రగణిత శాస్త్రము నభ్యసించువారు దానిలోనుండు
ప్రమేయోపపాద్యముల నూరక కంఠపాఠము చేయుక యుపపత్తులను గూడ
గ్రహించి నేర్చుకొనుచున్నారు. క్షేత్రగణిత సిద్ధాంతముల నెవ్వరును
ప్రత్యాఖ్యానముచేసి నిరాకరించుటను వారు వినియుండలేదు గాన వారికా
సిద్ధాంతోపపత్తులు తెలియవని చెప్పుట యనుచితము" ఇదంతయు నిజమే
గాని గణితశాస్త్రమువంటి యవిరోధమయిన విషయములో నిట్టి బోధన
చాలును, గణితశాస్త్ర సిద్ధాంత ప్రతిపాదన మంతయు నొక పక్షముగ
నుండుటయే దాని విశేషలక్షణము. ఇచ్చట యాక్షేపములుండవు. ఆక్షే
పములకు సమాధానములు లేవు. కాని యభిప్రాయ భేదముల కవకాశ
ముండు ప్రతివిషయమునను సిద్ధాంతపూర్వపక్షముల గౌరవనిర్ణయమే సత్య
మున కాధారముగనున్నది. ప్రకృతిశాస్త్ర విచారమందుఁగూడ నొకటే
తరగతి యంశములను సమన్వయించుటకు సిద్ధాంతవికల్పము లెల్లప్పుడునుండి
యున్నవి. భూభ్రమణ సిద్ధాంతమునకు మాఱుగ సూర్యభ్రమణ సిద్ధాం
తమును, అక్సిజను (Oxygen) కు మాఱుగ ఫ్లోజిస్టన్ (Phlogiston)

యును దీనికి నిదర్శనములు. వికల్పమయిన సిద్ధాంత మెందువలన సత్యము కాదో నిరూపింప వలసియున్నది. ఈనిరూపణము జరుగు పర్యంతమును, వానిక్రమమును దెలిసికొను వఱకును మనయభిప్రాయములకు హేతువులను మనము గ్రహించినవారము కానేరము. ఇదిగాక నింతకంటె నత్యంత మెక్కువ చిక్కుగలిగిన నీతిమతరాజక సాంఘిక సంబంధములను, లోకవ్యవహారమును విచారింపవలసి వచ్చినప్పుడు వివాదములో దిగిన యభిప్రాయమును బ్రతిపాదించుటకుండియున్న యుపత్తులలో ముప్పాళ్లుతేర్చినాభిప్రాయ హేత్వాభాసనిరాననముతో సరిపోవుచున్నవి. ప్రాచీనవక్తలలో రెండవ వాఁడని పేరుపొందిన యతఁడు తనవాదముకంటెను బ్రతికక్షివాదమునే యెక్కువ శ్రద్ధతోఁ బరిశీలించినట్లు లిఖితపూర్వకమైన ప్రమాణమువలనఁ గనఁబడుచున్నది. న్యాయసభలో గెలుపునిమిత్తము సిసెరో యభ్యసించిన పద్ధతిని బ్రతివిషయమునందును సత్యగ్రహణనిమిత్త మెల్లవారు ననుకరింపవలసియున్నది. స్వపక్షమున మాత్రము తెలిసికొనిన వాఁడా పక్షమును సయితము బహుస్వల్పముగ గ్రహించినవాఁడగును. పరుల కలవిగాని మంచిహేతువులను స్వపక్షమునఁ గలిగియున్నను, బ్రతిపక్షమున నుండుహేతువులను ఖండింప సమర్థుఁడుగాకుండిన యెడలను, అధమ మాహేతువులేవియో తెలిసికొనియుండని యెడలను రెండుపక్షములలో దేనినిగూడ స్వీకరించుటకుఁ గారణములేదు, ఇట్టిసందర్భమునఁ బరిష్కార విలంబనమే సరియైనమార్గము. కానిచోఁ బరబుద్ధిబ్రచోదితుఁడు గావలెను. లేదా లోకసామాన్యమువలె స్వాభిలాషానుకూల పక్షావలంబకుఁడు గావలెను. ఇంతియగాక ప్రతిపక్షవాదములను స్వమతాచార్యులు చెప్పు రీతి ననువాదఖండనములతో వినియుండినఁజాలదు. ప్రతిపక్షవాదములను సరిగఁబరిశీలించి మనస్సునఁబట్టించుకొనుట కిదిమార్గముకాదు. వానిని గేవలమునమ్మియుండి నిష్కపటముగఁబ్రతిపాదించి వానికైతమశక్తినంతను ధారపోయువారివలన నావాదములను వినవలసియున్నది. అవిమిక్కిలి యుక్తియుక్తముగను హృదయరంజకముగను నుండురీతిని దెలిసికొని యా

విషయముయొక్క యథార్థరూపమున కెట్టియాటంకములుగునో దాని బలమునంతను మనస్సునకనాటించుకొని పరిష్కరింపవలసియున్నది. లేని యెడల నాయాటంకమును బరిహరింపఁగల యథార్థలేశమునిజముగా లభింపఁజాలదు. చదువుకొనినవారిలోను, దమయభిప్రాయములను ధారాళముగఁ జర్చింపఁగలవారిలోను నయితము నూటికిఁ దొంబది తొమ్మండ్రిస్థితిలోనే యుండియున్నారు. వారికిఁదెలిసిన పర్యవసానము సత్యముకావచ్చునుగాని వారికిఁగలజ్ఞానమును బట్టిమాత్రమే విచారించినయెడల నదిసత్యముకాక పోవచ్చును. తమకంటెభిన్నముగ నాలోచించువారి మనోవృత్తినవలంబించి అట్టివారేమిచెప్పనైయుందురో వారెన్నఁడును విమర్శించియుండలేదు. ఈ హేతువువలన వీరవలంబించినసిద్ధాంతమును గ్రిమమయిన రీతిని దెలిసికొనినవారుకారు. ఆసిద్ధాంతములో నేభాగములను దెలిసికొనినఁ దక్కినవానిని బోధపఱచి సమర్థింపనగునో, యేవిచారణవలనఁ బరస్పరవిరోధాభాసములైన యంశములు సమన్వయములగునో, యేహేతువువలన బలవంతములుగాఁగనఁబడు రెండుకారణములలో నొకదానిని త్యజించి రెండవదానిని స్వీకరింపవలెనో వారికిఁదెలియదు. వాదముయొక్క తూకమును నొకవైపునకు ద్రిప్పి, సంపూర్ణజ్ఞానముగల విమర్శనమును నిశ్చయపఱుపఁగల సత్యాంశమునకు వారు దూరస్థులు. ఉభయపక్షములను సమానముగను నిష్పక్షపాతముగను గమనించి, యుభయవాదములను మిక్కిలి స్పష్టమైనరీతిని బరిశీలించుటకు యత్నించినవారికిఁ దప్ప యితరులకేసిద్ధాంతమును నిజముగనెప్పుడును దెలిసియుండదు. నీతివిషయికమైనట్టియు, మానవుఁడు విచారింపవలసినట్టియు సర్వవిషయములను సరిగ గ్రిహించుట కీశిక్షమిగుల ముఖ్యము. కాన ముఖ్యమయినసిద్ధాంతములకుఁ బ్రితికక్షులులేనప్పుడు వారున్నట్లూహించి వారుచెప్పఁదగిన యుక్తియుక్తమైబలవత్తరమైన హేతువులను ననుసదించుట యత్యావశ్యము.

మతసిద్ధాంతులును, శాస్త్రివాదులును అభిప్రాయముల

పూర్వపక్షము

కనుకూలముగఁగాని ప్రతికూలముగఁగాని చెప్పెడి దానినంతను సామాన్యజనులు తెలిసికొని గ్రిహించు

కొనవలసిన యావశ్యము లేదనియు కుయుక్తులు పన్నెడి ప్రతికక్షియొక్క పొరపాటులను, కుతర్కములను గనుపఱుపఁగలసమర్థత సామాన్యజనుల కక్కఱలేదనియు, వీనికన్నిటికిని బ్రత్యుత్తరముచెప్పి యజ్ఞానులైనవారు తప్పుత్రోవను బడకుండ సర్వమును నివారింపఁగలవాఁడెవ్వఁడో నొకఁడుండినఁజాలుననియు, సత్యమున కాధారములైన విస్పష్టహేతువులను నేర్చనపిమ్మట శేషించినదాని విషయములో నధికారులు అధికారియైనవానిని నమ్మియుండవచ్చుననియు, అడ్డమురాఁగలిగిన యంశయములనన్నిటిని వారింపఁగల జ్ఞానసమర్థతలు తమకులేవని తెలిసికొని యట్టిసంశయములనన్నిఁటి నిదివఱకునివారించి ముందునివారింపఁ గలవిశేషప్రజ్ఞావంతులున్నారని నిశ్చయముగఁ దెలిసికొని యూరకుండవచ్చుననియుఁ జెప్పి వాదస్వాతంత్ర్యవిరోధులు పైనిఁజెప్పిన విచారణబలమును దగ్గించుటకొకవేళ యత్నింపవచ్చును.

సిద్ధాంతము

సత్యమును నమ్ముటకుఁ గావలసిన గ్రహింపు ఉండినఁ జాలునని తృప్తిఁ జెందియుండువారీ విషయమునఁజెప్పఁదగినదానినంత నొప్పుకొనినను వాక్స్వాతంత్ర్యవాదబలముతగ్గిపోదు. ఎందువలనన, నీసిద్ధాంతములో నయిత మాక్షేపములన్నిటికిసరియైనప్రత్యుత్తరములు వచ్చియుండెనని మానవులకు సహేతుకమయిన నిశ్చయము కలిగి యుండవలెనని యొప్పుకొనుచున్నది. అయినను దేనికిఁ బ్రత్యుత్తర మియ్యవలెనో దానిని బైటకుఁ జెప్పనియెడల ప్రత్యుత్తర మెట్లు తటస్థించును? ఈప్రత్యుత్తరము సంతుష్టికరముగ లేదని చూపించుట కాక్షేపకుల కవకాశము లేనిచో నది తృప్తికరముగ నున్నదని యెట్లు తెలియనగును? సామాన్యజనులు కాకపోయినను శాస్త్రివాదులు, సిద్ధాంతుల మట్టుకయిన సంశయ నివారణ చేయవలసినవారు గనుక వీ రా సంశయములయొక్క చిక్కులనన్నిఁటిని బాగుగఁ దెలిసికొనవలయును. కాని వానిని ధారాళముగఁ జెప్పి సాధ్యమైనంత చక్కగఁ బ్రతిపాదింపని యెడల తెలిసికొనుట తటస్థింపఁ జాలదు. ఈ చిక్కు సంగతిని సమర్థించుకొనుట కొక మార్గముగఁ గాతోలిక్కు (Catholic)

సాంప్రదాయకులు, జనులలోఁగొందఱు విమర్శించి సిద్ధాంత స్వీకరణము చేయ సమర్థులనియుఁ గేవలము విశ్వాసము మీఁద స్వీకరింపవలసినవారు కొందఱనియు విభజనము చేయుచున్నారు. వీరిలో నేతెగవారికిని గూడ నంగీకరింపవలసిన విషయములో స్వేచ్ఛలేదు. పూర్ణముగ నమ్మకముంచఁదగిన ధర్మప్రవర్తకుల మట్టుకైన ప్రతికక్షివాదములకుఁ బ్రత్యుత్తరమిచ్చు నిమిత్తమావాదములను దెలిసికొనుట సాధ్యమును ఉచితమును అయియున్నది. కనుక వారు విమత గ్రంథ పఠనము చేయవచ్చును. కాని ప్రాకృతజనులు ప్రత్యేక మనుజ్ఞ పొందిననే గాని యట్టి పఠనము చేయఁగూడదు. అనుజ్ఞ దొరకుటకూడఁ గష్టముగనున్నది, ఇట్టినియమమువలనఁ బ్రతికక్షులవాదమును బోధకులు తెలిసికొనుట లాభకరమని యంగీకరించి ప్రపంచములోఁ దక్కిన వారాజ్ఞానమును సంపాదింపకుండెడి సాధనమును విధించుచున్నది. దీనివలన నుత్కృష్ట పురుషులకు సామాన్యజనులకంటె మనోస్వాతంత్ర్య మెక్కువ లేకపోయినను జ్ఞానమును మాత్ర మెక్కువగ సంపాదించుచున్నారు. ఈ యుపాయముచేత నాసాంప్రదాయ వ్యవహారములకుఁ గావలసిన యుత్కృష్టజ్ఞానము లభించుచున్నయది. ఎందుచేతననఁగా స్వాతంత్ర్యము లేని కృషి వలన బుద్ధివికాసము కలుగక పోయిననేదేని విషయమును సమర్థించుటకు ముందుగఁ గావలసిన తెలివిమాత్రము కలుగఁ గలదు. అయినను ప్రొటెస్టెంటు మతావలంబనము చేసిన దేశములో నిట్టి యుపాయమున కవకాశము లేదు. మతస్వీకరణ భారము గురువులమీఁదఁ ద్రోసివేయుటకు వలను పడదని ప్రొటెస్టెంటులు చెప్పుదురు. ప్రతిమనుజుఁడును దనకుఁ దానే బాధ్యుఁడుగ నున్నాఁడు. ఇంతియు గాక ప్రపంచముయొక్క వర్తమానస్థితి యందుఁ బండితులు చదువు గ్రంథములను బామరుల కందకుండఁ జేయుట క్రియ యందసాధ్యము. గురువులుగ నుండువారు తెలిసికొనవలసిన దంతయు గుర్తెఱిఁగియుండ వలెనని సమస్తమును నిరాటంకముగ లిఖించి ప్రచురము చేయవలసియున్నది.

**సిద్ధాంత వివరణము**

బహుజనాంగీకృతములైన యభిప్రాయములు సత్యములయినప్పుడు వాక్స్వాతంత్ర్యాభావము వలన జనులకుఁ దదభిప్రాయహేతుజ్ఞానములేక పోవుటయే కీడైనయెడల నిది కేవలము బుద్ధివిషయమైనదిగాని నీతి విషయమయినదికాదు. కనుక నభిప్రాయములకును, సుశీలతకును గల సంబంధమును బాధించదు గదాయని తలంపవచ్చును. కాని యథార్థమయిన వాక్స్వాతంత్ర్యము లేనప్పు డభిప్రాయహేతువులను మఱచి పోవుటయే గాక, యాయభిప్రాయము యొక్క యర్థమును గూడ మిక్కిలి తఱచుగ మఱచిపోవుచున్నారు. దానిని నిర్వచించు శబ్దములు నిరర్థకములయి పోవును, లేదా మొట్టమొదటఁ గల యర్థములోఁ గొంచెము భాగము మాత్రమే ద్యోతకమగుచుండును. స్పష్టమయిన యర్థమును, సారవంతమయిన విశ్వాసమును నశించిపోయి చిలుకపలుకులవలెఁ గొన్ని వాక్యములు మాత్రము మిగిలి యుండును. లేక యర్థములో నేమయిన శేషించినయెడల నది సారహీనమైన పొట్టు వలె మిగిలి యుండును. మానవజాతియొక్క చరిత్రలో నీయంశమును వర్ణించు భాగము నెంత యభిలాషతోఁ బఠించి మననము చేసినను జేయవచ్చును.

**అనుభవము.**

సమస్త నీతిమతసిద్ధాంతానుభవమును దీనికి సాక్షీభూతముగ నున్నది. ఆసిద్ధాంతముల యర్థసారస్యములు తత్కారకులకును వారిసన్నిహితశిష్యులకును సంపూర్ణముగఁ దెలియును. ఇతరసిద్ధాంతములకంటె వానికి నాధిక్యతను సంపాదించుటకుఁ బెనఁగులాట జరుగుచున్నంత మట్టుకు వానియర్థబలము తగ్గిపోదు. ఒకవేళ నెక్కువ స్పష్టమైనను గావచ్చును. తుదకది జయప్రదమై బహుజనాంగీకృతమగును, లేదా దానియభివృద్ధి యంతటితో నాగిపోవుచుండును. వీనిలో నేఫలము సంప్రాప్తమైన నావిషయమునుగూర్చి చర్చవడి తగ్గిక్రమముగ నశించి పోవును. ఆసిద్ధాంతము సర్వజనాంగీకారము కాకపోయిన నంగీకృతమైన శాఖగనో యుపశాఖగనో ధ్రువపడును. దాని నవలంబించినవారు పితురాచారముగ ననుసరించుచున్నారుగాని స్వయముగ నవలం

బించుటలేదు. కనుక నీసిద్ధాంతములలో నొకదానినివిడిచి మఱియొక దాని నవలంబించుట సామాన్యముగఁ దటస్థింపదు. ఈకారణముచేత నిట్టి యభిప్రాయాంతర స్వీకరణమనునది తదవలంబకుల మనస్సునఁ బట్టనేపట్టదు. మొట్టమొదటివలె వారుతమమతమును లోకులుచేయు నాక్షేపములనుండి కాపాడుకొనుటకుఁగాని లోకులను దమవైపునకుఁద్రిప్పు కొనుటకుఁగాని నిరంతరము జాగరూకులుగ నుండక సమాధానముఁ జెందు దురు. తమమతముమీఁది యాక్షేపములను సాధ్యమైనంతవఱకు వినిపించు కొనుటకూడ మానివేసి తమవాదమును మతాంతరులకు బోధపఱచుట వదలు కొందురు. ఇట్లుతటస్థించినపోడనే యాసిద్ధాంతముయొక్క బలసారస్య స్యములు క్షీణింపమొదలుపెట్టును. సర్వమతములలోనాయామతావలంబకుల మనస్సులయందు సత్యస్ఫురణ తగ్గిపోకుండఁబట్టుట కష్టతరముగ నున్న దని యాయాధర్మప్రవర్తకులు విలపించుచున్నారు. దీనివలన నాసత్యము జనులయంతఃకరణ వృత్తులఁబరివేష్టించి ప్రవర్తనమును బరిపాలించుటలేదు. అయిన నేసిద్ధాంతముగాని పాదుకొనుటకుఁ బెనఁగులాడుచున్న కాల ములో నిట్టిలోపము సంభవింపదు. అప్పుడా సాంప్రదాయములోఁ జేరిన దుర్బలులైనను దాముదేని నిమిత్తము పెనఁగులాడుచున్నారో యాసాం ప్రదాయమును, దానికిని ఇతరసిద్ధాంతములకును గలభేదము ననుభవ సిద్ధముగ గ్రహించుచుందురు. అట్టితరుణములోఁ జాలమంది తమమత న్యాయములలో ముఖ్యమైనవాటిని సర్వవిధముల ననుభవపఱచుకొని సమస్త విషయములందును వానిప్రాధాన్యతను జక్కఁగఁ బరిశీలించి చూడఁగలరు. ఆమతమును సంపూర్ణముగ నవలంబించినవారి శీలమెట్లుం డఁగలదో వారికనుభవసిద్ధమగును. అయిననిది పితురాచారమగుట వలన నప్రయత్నముగ సిద్ధించినప్పుడు దానినవలంబించుట వలనఁ దటస్థించు సంశయములను బరిహరించుటవలన మొట్టమొదటియంత తీవ్రముగ బుద్ధి యుక్తులఁ బ్రయోగింపవలసిన నిర్బంధము వదలిపోవును. మతమునందు విశ్వాసమున్నంత మాత్రమునదానిని బుద్ధియందు నాటించుకొని స్వాను

భవముచేతఁ బరీక్షింపవలసిన యవశ్యముతొలఁగి పోయెనోయనినట్లు దాని యందామోదము మందగిలి సూత్రములుతప్ప తక్కిన భాగమునంతను మఱచిపోవుప్రవృత్తి నిరంతరమును సంప్రాప్తమగుచుండును. తుట్టతుదకు దానికిమానవుని యంతఃకరణ వృత్తులతో సంబంధమే తెగిపోవును. అటుపిమ్మట మతముమనస్సునుండి దూరమైపోయి యితరబోధనలేవియు మానవతత్త్వమునందలి యుత్కృష్టాంశము నంటకుండ బుద్ధినావరించి పాషాణతుల్యముగఁజేయును. ఇట్టిమతము మనస్సునకుఁగాని హృదయమునకుఁగాని యేవిధమైనమేలును జేయక, సారవంతమైన నూతనసిద్ధాంతమేదియు వానియందుఁ జొరఁబడకుండ శూన్యముగ నుంచుటకు కావలివానివలె నిలువఁబడి తనప్రభావమును జూపించుచుండును. ప్రపంచముయొక్క వర్తమానస్థితిలో బహుజనులిట్టి యవస్థయందున్నారు.

దృష్టాంతము

సహజముగమనస్సునగాఢముగ నాటుకొనఁదగిన సిద్ధాంతములు మనోభావములను, అంతఃకరణ వృత్తులను, బుద్ధినికూడ నంటకుండ నెంతవఱకు నిస్సారములై పోవునో క్రైస్తవ సిద్ధాంతావలంబకులలో బహుజనుల వైఖరిని జూచిన దెలియఁగలదు. ఈ సందర్భమునఁ గ్రైస్తవ మతమునఁగూడ నూతన నిబంధన (New Testament) లోనుండి తన్మత సాంప్రదాయకులలో సర్వశాఖలవారి వల్లన నంగీకరింపఁబడిన సిద్ధాంతములును, నిబంధనలు నని నా తాత్పర్యము. ఇవి క్రైస్తవులమని పేరు పెట్టుకొనిన వారందరవలనను బవిత్రమైన శాసనములుగ శిరసావహింపఁబడుచున్నవి. అయినను వెయ్యింట నొక్కఁడయినఁ దన ప్రవర్తనము నాశాసనముల ప్రకారము శోధించి సవరించికొనుట లేదని చెప్పిన నతిశయోక్తి కాదు. తన జాతి, కుల, శాఖాచారమును దన నడవడికిఁ బ్రదర్శనముగ నేర్పఱచుకొనుచుండును. ఈ కారణముచేత నొకవైపునఁ దన ప్రవర్తనమును బరిపాలించుట కీశ్వర ప్రసాదితమైన నీతి సిద్ధాంతపుంజమును, రెండవవైపున నా సిద్ధాంతములతోఁ గొంతవఱ కేకీభవించుచుఁ జాల భాగమేకీభవింపక కొంతవఱకు విరోధముగఁగూడ నుండిన సిద్ధాంతాచార

పుంజమును సంపాదింప్తమగుచున్నది. దీనివలన మెత్తముమీఁదఁ గ్రైస్తవ మతమున కైహికేచ్ఛలతోను, లాభములతోను సాంకర్యము జరుగుచున్నది. మతసిద్ధాంతము నొప్పుకొనిన నాచరణయందు యథార్థముగ రెండవపక్షము నే యవలంబించుచుండును. బీదలయి వినయసంపత్తి గలిగి యైహికమందుఁ బీడితులయినవారు ధన్యులనియు, సూదిబెజ్జమున నొంటె ప్రవేశించుటకంటె ధనవంతుఁడు స్వర్గమునఁజేరుట యెక్కువ కష్టమనియు, నితరులయందుఁ దప్పుపట్టినఁ దమయం దీశ్వరుఁడు తప్పుపట్టుననియు, నేవిధమయిన యొట్టును బెట్టుకొనఁగూడదనియు, నితరులను దమవలెనే ప్రేమించ వలయుననియు, నెవ్వఁడైనఁ దమ సొత్తులో నుపవస్త్రమువంటి స్వల్పవస్తువును హరించినప్పుడు తక్కిన దుస్తునుగూడ వానికే యిచ్చివేయవలెననియు భవిష్యత్తునుగూర్చి తాపత్రయపడఁగూడదనియు పూర్ణులగుటకుఁ దమసర్వస్వమును విక్రయించి బీదలకు ధారపోయవలెననియుఁ, గ్రైస్తవులందఱును నమ్ముచున్నారు. ఈ నమ్మకమును గపటమని చెప్పఁగూడదు. నిరంతర సంస్తూయమానమయి నిర్వివాదమయిన సంగతిని వినుచుండిన జనుల కెట్టినమ్మకముండునో వీరికి నట్టి నమ్మకము గలదు. కాని పరివర్తనమును బరిపాలించు విషయములో లోకమునం దాసిద్ధాంతమునకు సాధారణముగ నాచరణ మెంతగలదో యంత వఱకే విశ్వసించుచున్నారు. అవి పూర్ణముగ విరోధులమీఁదఁ బ్రయోగించుటకు మాత్ర మనుకూలముగ నున్నవి. మెప్పుకలిగినదాని నేమైనఁజేసి నప్పుడు దానికి హేతువులుగ నీసిద్ధాంతములను సాధ్యమైనంతవఱకుఁ జెప్ప వచ్చునని యూహించుచుందురు. కాని యెవ్వఁడైన వాదికిఁ దోఁచనిరీతిని బదార్థసంబంధమును గనుపఱచినయెడల నతఁడు తక్కినవారికంటె ఘనుఁడని పించుకొనఁగోరుచున్నాఁడని యనాదరణచేయుదురు. సామాన్య జనులకాసిద్ధాంతములయందుఁ బట్టులేదు. అవి వారి మనస్సులందు బలవంతములుగ నుండవు. వారికి వానియందు శ్రవణమాత్రమయిన యానుచారిక మర్యాద యుండునేగాని పదార్థవిచారణ యుండదు. కాన నాపదార్థమును మనస్సున కెక్కించుకొని సూత్రానుగుణముగఁ బరివర్తనమును విచా

రింపవలసి వచ్చినప్పుడెల్ల వారి కిరుపక్కలనుండు ఎల్లయ్యా పుల్లయ్యాగార్ల
క్రీస్తునెంతవఱకు నవలంబింపవలెనని చెప్పెదరో దానికై చూచుచుందుగు-

**దృష్టాంత పర్యవసానము.**

ఇప్పుడిట్లు లున్నను ప్రాచీనక్రైస్తవులు దీనికి మిక్కిలి
భిన్నమైన రీతిని బ్రవర్తించిరని మనము నిశ్చయముగా
నమ్మవచ్చును. లేక యిటులనే యుండినయెడల క్రీస్తు
మతము అనామకులై అవజ్ఞులైన హీబ్రూవారినుండి రోమక రాజ్యమంతటను
వ్యాపింపకపోయియుండును. 'క్రైస్తవులెంత పరస్పరానురాగము గలిగి
యున్నారో చూడుఁడని' వారి శత్రువులు చెప్పెడివారు. ఇట్టి వదంతి
యిప్పుడుపుట్టుటకుబహుశా యవకాశముండదు. అప్పటికాలములోఁ గ్రైస్త
వుల కుండినంత సాంప్రదాయార్థానుభవము పిమ్మట నెప్పుడును గలిగియుండ
లేదు. బహుశా యీ కారణమువలననే క్రీస్తుమత వ్యాపక మాఁగిపోయి
యుండవచ్చును. పదునెనిమిదివందల సంవత్సరములైనను యూరోపియను
లును దత్సంతతివారును మాత్రమే దాని నవలంబించి యున్నారని కొంచె
మించుమించుగాఁ జెప్పవచ్చును. ధర్మాచరణమందు నిష్ఠగలిగి సిద్ధాంతము
నందు మిక్కిలి పట్టుదలయుండి, జనసామాన్యమునకంటె నెక్కుడు నర్థావ
బోధముగలవారు సయితము సాధారణముగ కాల్వినో నాక్సో లేక తమతో
నేకీభవించు నేయితర పురుషుఁడో నిర్మించిన యంశము నందెక్కువ యభి
లాషఁగలిగియున్నారు. దీనితోఁబాటు క్రీస్తుబోధనలు వారి మనస్సునం
దూరక నిలిచియుండెనేగాని మధురవాక్య శ్రవణఫలముకంటె నెక్కుడు
ఫలమును బుట్టింపలేకున్నవి. అంగీకృతమయిన శాఖలవారి సిద్ధాంతముల
కంటెఁ దక్కిన శాఖవారి విశేషసిద్ధాంతములకు సత్తువ యెక్కువయుండుట
కనేకకారణము లున్నవి. ఈ విశిష్ట సిద్ధాంతముల కాక్షేపము
లెక్కువ కలుగుటయు, ఆక్షేపకులకు సమాధానము చెప్పవలసిన యగత్య
మెక్కువ కలిగియుండుటయు నొక ముఖ్యకారణమని నిశ్చయముగఁ జెప్ప
వచ్చును. బోధకులును బోధితులును గూడ నవిరోధసిద్ధి కలిగినతోడనే
యుపేక్షఁ జెందుదురు.

ఐహికమందును, నీతి, మతసిద్ధాంతములందును గూడఁ బారంపర్యముగ వచ్చువానికన్నిఁటికిని మొత్తముమీఁద నీగతియే సంభవించునని

సత్యస్ఫురణమునకుఁ బ్రతిబంధకములు.

చెప్పవచ్చును. జీవితమునుగుఱించియు, దానినినడపింపవలసిన మార్గమును గుఱించియు, సామాన్యవిధులు సమస్తభాషాసాహిత్యములందును జాలఁగఁ జెప్పఁబడియున్నవి. ఇవి ప్రతిమనుజునికిని దెలియును. ప్రతిమనుష్యుఁడును వీనిని విని యొప్పుకొని తఱచుగస్మరించుచుండును. వీనిని స్వతస్సిద్ధములుగఁ బ్రతిమనుజుఁడు నంగీకరించుచుండును. కాని బహుజనులకు సాధారణముగఁ గష్టము కలుగు పర్యంతము వానియథార్థము నిజముగఁ దెలియకున్నది. ఏదో యొకకష్టముగాని, యాశాభంగముగాని తటస్థించినప్పుడు లోకసామ్యములు తఱచుగ జ్ఞప్తికి వచ్చుచుండును. ఇవియాపురుషునకు యావజ్జీవమును దెలిసినవేయైనను వానియర్థము నిప్పుడు గ్రహించినట్లు ఇదివఱకు గమనించియుండినయెడల నావిపత్తుసంప్రాప్తమై యుండదు. దీనికిఁ జర్చాభావ మొకటియే గాక యితర కారణములును గలిగియున్నవి. అనఁగ ననేకసిద్ధాంతముల యొక్క యర్థము స్వానుభవము మీఁదఁగాని పూర్తిగనాటుకొనఁజాలదు. పూర్వపక్ష సిద్ధాంతములను దఱచుగ వినుచుండినయెడల నాసిద్ధాంతముల యర్థము చాలనెక్కువగఁ దెలిసి యదిమనస్సునఁజాలనెక్కువలోఁతుగనాటుకొనియుండును. ఏసంగతియైనను నిశ్చయమైనతోడనే దానినిగూర్చి మానవ జాతి విచారింపమానివేయు దౌర్భాగ్యపు ప్రవృత్తియే వారితప్పులలో సగపాలునకుఁ గారణమగుచున్నది. దీనికి నాధునిక గ్రంథకర్త యొకరు "నిశ్చితాభిప్రాయగాఢనిద్ర" యనిసార్థకముగఁ బేరుపెట్టియున్నారు.

ఇట్లు చెప్పినప్పుడు యథార్థజ్ఞానమునకుఁ దప్పనిసరిగ యభిప్రాయభేదముండవలెనాయేమి యనియు, నొకరికి యథార్థానుభవము కలుగు

పూర్వపక్షము.

నిమిత్తము మానవజాతిలోఁ గొంతమంది అయథార్థములో బాదుకొనియుండవలెనా యనియు, ఏదేనిసమ్మతము సర్వజనాంగీకారమైన తోడనే నిస్సారమై యసత్యమైపోవు

నాయనియు, సంశయ శేషముండినఁగాని సిద్ధాంతావగాహనము పూర్తిగఁ గలుగ కేరదాయనియు, మానవులందఱును నైకకంఠ్యముగ నొకసత్యము నంగీకరించినతోడనే యాసత్యము వారి మనస్సున లోలోపలనే క్షీణించిపోవు నాయనియు, ముఖ్యాంశములందు మానవజాతికిఁ దెలివి హెచ్చినకొలఁది నేకీభావము కలుగుట సర్వోత్కృష్టమైన ఫలమై యుండఁగ నా తెలివి సఫలము కానంతవఱకు మాత్రముండి పిమ్మట నశించిపోవునాయనియు, ఫలపూర్తి యగుటయే ఫలనాశనమునకు హేతువగునాయనియు నెవరైన నడుగవచ్చును.

సమాధానము.

నేను ప్రతిపాదించు సిద్ధాంత మిట్టిదికాదు. మానవు లభివృద్ధిఁ జెందినకొలఁది నిర్వివాద సిద్ధాంతసంఖ్య క్రమముగ హెచ్చగుచుండును. నిర్వివాదస్థితిని బొందిన సిద్ధాంతముల సంఖ్యనుబట్టియు, ప్రాముఖ్యతను బట్టియు మానవు లెంతయుచ్చదశను జెందినది కొంతమట్టుకుఁ దెలిసికొనవచ్చును. సిద్ధాంత సంస్థాపనకు బలవత్తరమయిన యభిప్రాయ భేదము లేకుండుట యత్యావశ్యకము. ఈ సంస్థాపన మసత్యాభిప్రాయ విషయమున నపాయకరమై విషతుల్యమవునుగాని సత్యాభిప్రాయ విషయమున శ్రేయోదాయకమై యమృతతుల్యముగ నుండును. అభిప్రాయ భేదము క్రమముగ తగ్గిపోవుట యావశ్యమును అనివార్యమును గూడ నయినను దానివలనఁగలుగు ఫలమంతయు సుఫలమేయని భావింప నగత్యములేదు. ప్రతి కక్షులకు బోధపఱచి వారియాక్షేపములనుండి కాపాడు నగత్యమువలన సత్యమును యుక్తియుక్తముగ గ్రహించుటకు మిక్కిలి సాహాయ్యము కలుగుచున్నది. ఈ యగత్యము లేకపోవుటవలనఁగలిగిన నష్టము ఏకీభావమువలన గలిగినలాభముకంటె నెక్కువదియని చెప్పఁగూడదు గాని నష్టము మాత్రము కాకమానదు. కనుక పైని జెప్పిన సాహాయ్యము లేనప్పుడు దానికిఁ బ్రతిగ మఱియొక దానిని సత్యావబోధకము లేర్పా[illegible] యవలె నని న్యాయాపేక్షయము. ప్రతి కక్షి తనవైపు ప్రసకప్త మనుష్య బుద్ధిని

ద్రిప్పుకొనుటకు యత్నించు నప్పు డెట్టి యాక్షేపములు గోచరము లగునో యట్టులనే సర్వదా గోచరము చేయుట కుపాయమును బన్నవలసి యున్నది.

సత్యస్ఫురణమునకు సాధనములు

అయినను దీని నిమిత్త ముపాయములను గల్పించుటకు మాఱుఁగ నిది వఱకున్న వానినిగూడఁ బోఁగొట్టుకొనిరి. సాక్రటీసు పేరు పెట్టి ప్లేటో లిఖించిన దివ్యములయిన తర్క-సంవాదము లిట్టి యుపాయములలోఁ జేరినవే. వానియందు వ్యావహారిక శాస్త్రీయ విషయములను గూర్చి పూర్వపక్షవాదము బహుచమత్కారముగఁ జేయఁబడియున్నది. దీనివలనఁ బ్రసిద్ధ సాంప్రదాయముల నవిచారముగ స్వీకరించినవానికి విషయజ్ఞానము లేదనియు, వాని యర్థము వానికింక బోధపడలేదనియు ధ్రువపడుచున్నది. ఇవివాని యజ్ఞానమును బయటఁ బెట్టి తన్మూలమున సిద్ధాంతములను వాని యుపపత్తులను స్పష్టముగ గ్రహించి దృఢవిశ్వాసమును గలిగించు మార్గమున వానినిఁబెట్టఁగలవు. యూరోపు చరిత్రలో మధ్యకాలమునఁ జేయఁబడిన వివాదములుకూడ నిట్టిఫలమునే యపేక్షించి జరిగినవి. విద్యార్థికి స్వమతమును దానితో విధిగ సంబంధించియున్న విరోధమతమును నిశ్చయముగ బోధపఱచి, స్వపక్షమందు హేతువులను బ్రతిపాదించి, ప్రతిపక్షమున హేతువులను ఖండించుటయే వాని యుద్దేశము. ఈవాదములలోని పతిజ్ఞలు నియోగములుగాని హేతుభూతములు కావు. ఇదియే వానియందలి గొప్పలోపము. కనుక బుద్ధికి శిక్షనుజేయువిషయములో బ్రతిసంగతి యందును సాక్రటీసు పద్ధతినవలంబించిన తర్క-వాదముల బలమునకుఁ దీసిపోవుచున్నవి. అయిన నీ రెండు పద్ధతులును జాలలాభకరములు, ఇవి యింత ప్రయోజనకారులని ఆధునికు లొప్పుకొనరు. ప్రస్తుతము వాడుకలోనున్న విద్యాపద్ధతులలో వానియందొక దానికైనను సాటివచ్చునది కొంచెమయినను లేదు. బోధకుల వలనఁగాని గ్రంథములనుండి గాని విద్యనంతను సంపాదించువాఁడు చిలకపలుకుల వలె నేర్చి యూరకుండు మోహాకులమునుండి తప్పించుకొనిన నుభయపక్ష

ములను నిర్బంధముగ వినవలసిన యగత్యముండదు. కనుక విచారణకర్తలలో నయిత ముభయ వాదముల నెఱిగియుండు ప్రజ్ఞ యవశ్యమైయున్నది. ప్రతిమనుజుఁడును స్వపక్ష నిర్వాహణములోఁ బ్రతిపక్షుల నుద్దేశించి చేయువాదము మిక్కిలి దుర్బలమయి యుండును. సిద్ధాంతవాదముఁ జేయుటకు మాఱుగ లోపములను అనాచారములను జూపించెడి పూర్వపక్షవాదమును ప్రస్తుతకాలమున నిరసించుట లాంఛనమై యున్నది. ఈనిషేధవాదమును పరమ ప్రయోజనముగ నెంచినయెడల తుచ్ఛమగునుగాని యెన్నికకు రాఁదగిన సిద్ధాంత జ్ఞానమును, దృఢప్రత్యయమును బొందుటకుదాని విలువ యింతయని చెప్పవలవికాదు. మానవులను దిరిగి నాపద్ధతిని గ్రమముగ శిక్షించిననేగాని గణితశాస్త్ర, ప్రకృతిశాస్త్రములయందుఁ దప్ప తక్కిన వానిలో గొప్ప యాలోచనకర్తలుండఁజాలరు. జనసామాన్యము యొక్క యాలోచన శక్తిహీనమైయుండును. ప్రతికక్షులతోఁ దీవ్రముగఁ బోరాడునప్పుడు పోవలసిన మనోగతినే ఇతరులబలాంతము చేతఁగాని స్వబుద్ధిచేఁగాని యీవిషయములలోఁగూడ నవలంబింపనియెడల నెవని యభిప్రాయములును జ్ఞానమనిపించుకొనుట కర్హములు గావు. ఏది లభించినప్పుడగత్యమును బట్టి, కల్పించుకొనుట బహుకష్టతరమో, యది స్వతస్సిద్ధముగఁ బ్రాప్తించినపుడు దానిని బోఁగొట్టుకొనుట యెంతయు నయుక్తమే గాక దానికంటె హీనమని కూడఁ జెప్పవచ్చును. ప్రసిద్ధసాంప్రదాయమును వివాదపఱచెడు వారు లేక రాజశాసనముగాని లోకవృత్తిగాని యవకాశమిచ్చిన యెడల నట్లుచేయుటకు సిద్ధముగనున్నవారుగాని లభించినయెడల వారు చెప్పెడు దానిని మనస్సునఁబెట్టి, మన నమ్మకముల దృఢత్వమును సారస్యమును గౌరవించుటకు మనము మిక్కిలి యెక్కువ కష్టపడి చేయవలసిన కృషిని మన నిమిత్తముచేయువారు లభించిరి గదాయని సంతోషించి వారియెడఁ గృతజ్ఞులమైయుండవలెను.

ఏహేతువువలన నభిప్రాయభేద మిదివఱకు లాభకారిగనుండెనో

అభిప్రాయ భేదములవలని లాభవిశేషము.

ఇఁకముందెన్నఁడో నిర్ణయింపసాధ్యముకాని కాలమున మనుష్యజాతి చెందఁదగిన బుద్ధికుశలతను జెందువఱకుపయోగముగ నుండఁగలదో యట్టిముఖ్యహేతువు నిప్పుడింకను జెప్పవలసి యున్నది. వాడుకలోనున్న సాంప్రదాయ మసత్యమై మఱియొకటి నిజముకావచ్చుననియు లేదా వాడుకలోనున్న యభిప్రాయము నిజమైనప్పుడు దాని సత్యత్వమును స్పష్టముగ గ్రహించి యనుభవపఱచుకొనుటకుఁ దద్విరుద్ధమైన దుస్సిద్ధాంతముతోఁ బోరాట మనగత్యమనియు రెండువికల్పములను మాత్రమే యింతవఱకు విచారించియుంటిమి. కాని యీరెంటికంటె నెక్కువసాధారణమయిన వికల్పము మఱియొకటి గలదు. పరస్పరవిరోధముగల సిద్ధాంతములలో నొకటి నిజమై రెండవది యసత్యమగుటకు మాఱుగ రెంటిలోను గొంతసత్యముండవచ్చును. ఈసందర్భమునఁ బ్రసిద్ధసాంప్రదాయముయొక్క సత్యాంశమును సంపూర్తిచేయుటకుఁ దద్వ్యతిరిక్తసిద్ధాంతము కావలసియుండును. స్థూలదృష్టికి గోచరముకానట్టి విషయములందు జనసామాన్యాభిప్రాయములు దఱచుగ నిజములైనను వానియందు సత్యము సంపూర్ణముగనుండుట మిక్కిలియరుదు; లేదా యసంభవమనియే చెప్పవచ్చును. వానియందొకప్పుడు కొంచెమెక్కువగను ఒకప్పుడుగొంచెము తక్కువగను సత్యము పొడచూపుచుండును గాని యీసత్యాంశముకూడ నతిశయోక్తిగను, వికృతిగను దానితోననుబంధముగనుండి తద్వ్యాప్తిని దగ్గించు నితరసిద్ధాంతములతో సంబంధము లేకుండఁగ నుండును. ఇఁకదుస్సిద్ధాంతములన్ననో, యవిసాధారణముగ నిట్లుపేక్షితములై తిరోభావమునొందినసత్యాంశములైయుండును. కనుక వానినిర్బంధములను ద్రెంపుకొని వాడుకలోనున్న సాంప్రదాయముతో సమన్వయము నపేక్షించుచుండును. లేదా దానితోశత్రుభావమువహించి తాముకూడ సంపూర్ణసత్యవంతములైనట్లు నటించుచుండును. సాధారణముగ మనుష్యబుద్ధి పక్షావలంబమై, సమగ్రదృష్టి యరుదగుటం బట్టి యీరెండవవికల్పమే, యింతవఱకును సంప్రాప్తించినది. కనుక నభి

ప్రాయపరివర్తనమునందుఁగూడనొక సత్యాంశముదయించుతఱిని మఱియొకటి యస్తమించుచున్నది. ఒకసత్యమునకు మఱియొకటితోడ్పడుట యభివృద్ధికి లక్షణము. కాని యిదివఱకభివృద్ధిఁజరిగినప్పుడు కాలానుకూలమును, అగత్యమును బట్టి ఒకసత్యాంశమును అణఁగఁద్రొక్కి మఱియొక యసంపూర్ణమైనసత్యాంశమును నూతనముగ నవలంబించుచువచ్చిరి. ప్రసిద్ధసాంప్రదాయములు సత్యములైనప్పుడుకూడ నవియిప్పుడుచెప్పినరీతిని పక్షనిక్షిప్తములగుటంజేసి వీనిలోలేనిసత్యాంశమును బ్రతిపాదింప నభిప్రాయములు దోషసంభ్రమయుక్తములైనను, అమూల్యముగ నెంచవలసి యున్నది. మనకుఁ గనఁబడెడి సత్యములలోఁ గొన్నిటిని జూడలేకపోయినను మనకుఁగనఁబడని సత్యములను బట్టుదలతోఁ జూపించువారియెడల విధిగ నాగ్రహమునొందుట మానవ వ్యవహారములను నిదానముతోఁబరిశీలించు వానికి లక్షణముకాదు. అట్టివాఁడు ప్రసిద్ధసిద్ధాంతము పక్షనిక్షిప్తమైయుండినంతవఱకు ననాదరణీయమైన సత్యాంశముయొక్క పక్షము నవలంబించి, దానిని బ్రతిపాదించువారు లేకపోవుటకంటె నుండుటయే శ్రేయోదాయకమని తలంచుచుండును. వీరు తమకు దొరకిన సత్యాంశమును సంపూర్ణసత్యమైనట్లు వాదించుచుండినను ఆయంశమునకుఁ బరాఙ్ముఖులైనవారి దృష్టినాకర్షించుట కిదియేబలవత్తరమై బహుశా జయప్రదమయిన మార్గమై యుండును.

రూసోదృష్టాంతము

పదునెనిమిదవ శతాబ్దమున దాదాపుగ సంస్కారులందఱును, వారి యనుచరులైన యసంస్కారులును, నాగరికతయని పేరుజెందిన దానియందును, ఆధునిక శాస్త్రసాహిత్యాధ్యాత్మిక విద్యల యందును, ఆశ్చర్యమగ్నులై తమకును బూర్వులకునుగల భేదము నతిశయోక్తిగఁ జెప్పుకొనుచు తమయాధిక్యతకై విఱ్ఱవీగుచుండిరి. ఇట్టిసమయమున రూసోవిరచితములైన లోకవిరుద్ధన్యాయములు, ఆగ్నేయాస్త్రములవలెఁ బ్రతిఘటించి గాఢముగ నల్లుకొనియున్న పక్షనిక్షిప్తాభిప్రాయపుంజమును భేదించి, వానియవయవములను నూతనాంశములతోఁ జేర్చి యెక్కువ

ప్రశస్తమైన కీర్తిని బునర్నిర్మాణము చేసెను. ఇట్లుచెప్పినందువలన రూసో యొక్క యభిప్రాయములకంటె లోకప్రసిద్ధములైన సిద్ధాంతములు సత్యమునకు దూరముగ నుండెనని నాతాత్పర్యముకాదు. ఇవియే యెక్కువ సత్యవంతములును, దోషరహితములును అయియున్నవి. అయినను లోకప్రసిద్ధసిద్ధాంతమునందు లోపించిన సత్యాంశము రూసో సిద్ధాంతము నందుండెను. కాన నతని యభిప్రాయ పరంపరాప్రవాహము వ్యాపించి విరమించినప్పు డసత్యము నిక్షేపముగ నిలిచియుండెను. రూసోకు పిమ్మట సంస్కర్తలైన వారలెవ్వరును శుద్ధజీవనము యొక్క ప్రాశస్త్యమును, కృత్రిమ జీవనములోనుండు నిర్బంధకాపట్యములవలన సంప్రాప్తములగు దుర్బల భ్రష్టత్వములను, ఎప్పుడును మఱచి యుండలేదు. కాలక్రమమున నీయభిప్రాయములఫలము సంపూర్ణముగ లభింపఁగలదు, కాని ప్రస్తుతము వానిని మునుపటివలెనే నొక్కిచెప్పవలసినయావశ్యక మున్నది. మఱియు నీవిషయమున శబ్దబలము చాలనందున నాయభిప్రాయమును గార్యరూపమున సాధింప వలసియున్నది.

రాజనీతినుండి దృష్టాంతము.

రాజనీతియందు రాష్ట్రవ్యవహారము సుస్థితి నుండుటకు స్థిత్యాచారపాలకులును, సంస్కర్తలును గూడ నావశ్యకమనియు, వీరిలో నొకరయిన దేనిని రక్షించుకొని దేనిని విసర్జింపవలెనో తెలిసికొని యాచారమును సంస్కరణమును సమానముగ గ్రహించు బుద్ధికౌశల్యముఁ జెందువఱకు నుభయకక్షులు నుండ నగత్యమనియు సర్వసాధారణముగ నందఱకుఁ దెలిసినవిషయము. వీరిలో నొకతెగవారు రెండవ తెగవారి లోపములను గనిపెట్టుటవలనఁ బ్రయోజనకారులగుచున్నారు. వీ రొకరికొకరు విరోధముగ నుండుటవలన నుభయులును న్యాయమును మర్యాదను జాలవఱకుఁ దప్పకుండ నుండఁగలుగుచున్నారు. ప్రజాస్వామిక, అభిజనస్వామికములకును, ప్రభుత్వసమానత్వములకును, సహకారిత్వస్పర్థలకును, భోగవైరాగ్యములకును, సమష్టివ్యష్టులకును, స్వేచ్ఛాశిక్షలకును, వ్యావహారికమందునిత్యముగఁ బరస్పరవిరోధములయిన యింకనితరధర్మములకును, అనఁగా నుభయపక్షములకునుగూడ ననుకూల

ముగనుండు నభిప్రాయముల నన్నిట సమానస్వాతంత్ర్యముతో ధారాళముగఁ జెప్పి, సమానశక్తియుక్తులతో సమర్థించి నిర్వహించు పర్యంతము, ఉభయ వాదములకు సమాన న్యాయము గలుగుట కవకాశముండక, యొకవైపు తూకమెక్కువై రెండవవయిపు తక్కువగుట నిశ్చయము. వ్యావహారికమందుఁ జాలవఱకుఁ బరస్పరవిరుద్ధ న్యాయములను సమన్వయము చేసి సంపుటిచేయుటవలన సత్యము తేలుచున్నది. ఈసమన్వయమును జాలవఱకు సరిగఁజేయుటకుఁ జాలినంత నిష్పక్షపాత విపులబుద్ధిగలవారు మిక్కిలి యల్పసంఖ్యాకులుగనున్నారు. కాన నీపని భిన్నసాంప్రదాయకుల సంఘట్టనవలనఁ గష్టమయిన రీతిని జరగవలసివచ్చినది. పైనిజెప్పఁబడిన విశేష వివాదాంశములో దేశకాలావస్థనుబట్టి యల్పసంఖ్యాశ్రితమయినది కేవలము సహనపాత్రము గాక ప్రోత్సాహాంగీకార యోగ్యమని చెప్పవచ్చును. క్రమమయిన శ్రద్ధలేకపోవుట వలన మానవులకుఁ గలుగవలసిన మేలులో నుపేక్షితమగు నంశమును, ఆపక్షమాకాలమున సూచింపుచుండును. ఈదేశములో నీవిషయములను గూర్చి చాలవఱకు భిన్నాభిప్రాయసహనము గలదని నేనెఱుఁగుదును. మనుష్యబుద్ధి ప్రస్తుత ముండుకొనిన స్థితిలో నభిప్రాయభేదమువలననే గాని సత్యముయొక్క యన్నియంశములకును సమానన్యాయము గలుగనేరదను సూత్రము సర్వదా వర్తించునని చూపించుట కందఱునొప్పుకొనిన యనేకదృష్టాంతములతో నీభిన్నాభిప్రాయ విషయముల నుపన్యసించి యుంటిని. ఏవిషయమునఁగాని లోకులు సత్యమార్గములో నుండి యేకాభిప్రాయులై యున్నట్లు కనఁబడుచుండఁగఁ గొద్దిమంది భిన్నపక్షము నవలంబించిన యెడల నయితేము, ఆపక్షమున వినఁదగిన యంశమెల్లప్పుడు నుండవచ్చును. వారిని మాటాడనివ్వక పోవుటవలన సత్యమునకుఁ గొంతనష్టము కలుగవచ్చును.

పూర్వపక్షము.

అయినను ప్రసిద్ధ సాంప్రదాయములలో ముఖ్యముగ నుత్కృష్ట విషయములయందు న్యాయము లర్ధసత్యములు గావనియు, వీనికి నిదర్శనముగఁ గ్రైస్తవసాంప్రదాయము

నందలి నీతి సంపూర్ణముగనుక, తద్భిన్ననీతిని యెవ్వరయినను బోధించిన యెడల నదికేవల మసత్యమయి యుండవలెననియు నాక్షేపము రావచ్చును. ఆచరణమందు మనకుఁగల విషయములలో నిదియ మిక్కిలి ముఖ్యమైన నగుటంబట్టి పైనిజెప్పిన న్యాయమును బరీక్షించుట కింతకంటె యోగ్యమయిన యవకాశము చిక్కదు. కాని 'క్రైస్తవనీతిసాంప్రదాయము యొక్క సత్యాసత్యములను బరిష్కరింపక పూర్వము ఆపేరనొప్పునట్టి, విషయమేదియో నిశ్చయింపవలసి యున్నది.

నూతన నిబంధనములోఁ (New Testament) జెప్పఁబడి యుండు నీతికీ పేరుఁ బెట్టిన యెడల నాగ్రం

ఖండన

ధమును దెలిసిన వాఁడెవ్వఁడయిన నది నీతివిద్యను సంపూర్ణముగఁ జెప్పినదనిగాని, యట్లుచెప్ప నుద్దేశించినదని గా చెప్పినచో నాకాశ్చర్యము పుట్టకమానదు. ఈగ్రంథ మిదివఱకున్న నీతిని బురస్కరించుకొని దానిలో నేయేవిషయములఁ ద్యజించి యంతకంటె నుత్కృష్టములై విపులములైన యంశముల గ్రహింపవలెనో విధించుచున్నది. ఈగ్రంథములో నుండువాక్యములు సర్వసాధారణముగ నుండుట వలనను, ధర్మశాస్త్రమున కుండవలసిన సునిశ్చయములేక మనోహరమైన కవిత్వావైభవరీతి నుండుటవలనను వానిని ముఖ్యార్థమందు గ్రహించుటకుఁ జాలవఱకసాధ్యము. ప్రాఁత నిబంధనము నెత్తుకొనకుండ నీగ్రంథము నుండియే ధర్మశాస్త్రసంపాదనము సాధ్యముకాదు. అనఁగా విపులమయినను మూర్ఖులకై యుద్దేశింపఁబడి యనేకవిషయముల నశ్లీలయుక్తమైన గ్రంథము నుండి ధర్మమును వెదుకవలసి యున్నది. ఇట్లు యూదుల సిద్ధాంతము నవలంబించి క్రీస్తుసిద్ధాంతమున కర్థముచేసి, సంపూర్తి చేసికొనుటకు యూదుల పరమశత్రువయిన పాలు (Paul) ఎంతమాత్రము నొప్పుకొనఁడు. అయిన నితఁడు కూడ దనయాచార్యుని సిద్ధాంతమునకుఁ బూర్వమందున్న గ్రీకు రోమనులనీతిసిద్ధాంతములఁబురస్కరించుకొని క్రైస్తవులనదాని కనుగుణముగ హెచ్చరించుచున్నాఁడు. ఈకారణముచేత బానిసవృత్తిని నయితము సరియైదిగ నొప్పుకొనిన ట్లగపడుచున్నది. క్రీస్తుపేరట వెలసిన నీతిసిద్ధాంత

మును క్రీస్తుగాని, వారిసాంప్రదాయ ప్రవర్తకులుగాని, నిర్మాణము చేసి యుండలేదు. వారికిఁ దరువాతఁ జాలకాలమునకు అనఁగ 500 సంవత్సరములలో కాథొలిక్కు సాంప్రదాయకులు నిర్మాణము చేసియున్నారు. కాన నది వ్యాఖ్యాతృకృతమని చెప్పవలసియున్నది. దీనిని నవీనులును, ప్రొటెస్టెంటులును సంపూర్తిగ నంగీకరింపకపోయినను మార్పవలసినంతగ మార్చియుండలేదు. చాలవఱకు మధ్యకాలములోఁ జేరిన క్రొత్తసంగతులను మాత్రము విసర్జించి ప్రతిశాఖవారును దమ శీలప్రవృత్తుల కనుకూలములైన మఱికొన్ని క్రొత్తసంగతులను జేర్చుకొని యున్నారు. ఈ నీతి సిద్ధాంతములవలనను, దద్బోధకులవలనను, మానవజాతికి మేలుకలుగలేదని నేనెన్నటికిఁ జెప్పను. కాని చాల ముఖ్యమైన యంశములలో నా నీతిశాస్త్రము నసంపూర్తిగను పక్షపాతముగను ఉండినదనియు, దాని యధికారమునకు లోఁబడని భావములును వృత్తులును యూరోపుఖండవాసుల జీవన శీలములయందుఁ బ్రవేశించి యుండనియెడల వ్యవహారకాండ యిప్పుడున్న దానికంటెఁ జాల హీనస్థితిలో నుండునని చెప్పుటకు మాత్రము నేను వెనుకఁదీయను. క్రైస్తవనీతి యనుదానియందు నప్పటికిఁ బూర్వమందున్న నీతికిఁ బ్రతిహతములైన లక్షణము లన్నియుం గనుపట్టుచున్నవి. అది చాలవఱకుఁ బ్రతిమార్చనమునకు విరోధముగ నున్నది. అది బోధించు పరమావధియందు విధికంటె నిషేధమును, బ్రవృత్తికంటె నివృత్తియు నౌదార్యముకంటె నమాయికత్వమును, శ్రేయోన్వేషణోత్సాహముకంటెఁ బాపవిముఖత్వమును ఎక్కువగఁ గనఁబడుచున్నవి. దానియందు విధివాక్యములకంటె నిషేధవాక్యలెక్కువగలవని చెప్పుట యుక్తము. ఇంద్రియ లోలత్వము మీఁది యసహ్యముచేత వైరాగ్యమును అది విస్తారముగఁ గొనియాడుచు వచ్చినది. ఇట్లు చేయుటవలనఁ బ్రవర్తనము క్రమక్రమముగ ధర్మశాస్త్రనిబద్ధమయి నంతవఱకు నొక ఛాయగ నిలిచిపోయెను. స్వర్గాపేక్షను నరకభీతిని పుణ్యశీలతకు సరియైన శాస్త్రీయమయిన హేతువులనుగఁ జూపించుచున్నది. ఈ విషయమునం దీ నీతి పూర్వుల పరమసిద్ధాంతముకంటె మిక్కిలి హీనమై

నది. మనుష్యుఁడు నీతియందు స్వలాభాపేక్షతోఁ బ్రవర్తించునట్లు చేయు చున్నది. స్వప్రయోజనాపేక్షతో సంబంధించినంతవఱకుఁ దప్ప తక్కిన విషయములలోఁదోడి మానవుల లాభమునకు విధాయక వృత్తితో సంబంధము లేకుండ విడఁదీయుచున్నది. ఆ సిద్ధాంతము ముఖ్యముగనిష్ప్రయోజనమైన విధేయతను బోధించుచున్నది. అడివఱకు నిలిచియున్న యధికారులందఱకు లోఁబడి యుండుమని యుపదేశించుచున్నది. ఈ యధికారులు మతవిరోధమయిన సంగతిని విధించినప్పుడు దానియందుఁ బ్రవర్తింపనక్కఱ లేదు గాని వారు తమకెంత ఘాత నొనర్చినను వారి యాజ్ఞకుఁ బ్రతిబంధము కలిగింపఁ గూడదు. అధికారోల్లంఘన మంతకంటెఁ బనికిరాదు. ప్రతిమార్చ కులలో శ్రేష్ఠులయినవారి నీతిశాస్త్రము ప్రతి మనుజునకును న్యాయముగ నుండవలసిన స్వాతంత్ర్యమునకు భంగము కలిగించినను వాఁడు రాష్ట్రవిష యమయి కొన్నివిధుల నివర్తింపవలెనని యుపదేశించుచున్నది. కాని కేవలము క్రైస్తవనీతి సిద్ధాంతమం దాముఖ్యమయిన యంశమును గమనించి నట్లగపడదు. తనరాష్ట్రమం దెక్కువ యోగ్యుఁడుండఁగ నే యుద్యోగమునకయిన మఱియొకని నేర్పాటుచేసిన ప్రభువు రాష్ట్రము విషయమునను ఈశ్వర దృష్టియందును ఘాతకుఁడనువాక్యము కొరానులోనిది గాని నూతననిబంధనములోనిది కాదు. వర్తమాన నీతిసిద్ధాంతములో లోకము విషయమై నివర్తింపవలసిన విధులను గుఱించిన భావ మేమయినఁ జూడచూపినయెడల నది గ్రీకు, రోమనులవలన సిద్ధించినది గాని క్రైస్తవులసాంప్రదాయమునుండి లభించినది కాదు. స్వజీవన విషయమయిన నీతియందలి యౌదార్యము, మహత్త్వము, ఆత్మగౌరవము, గౌరవముయొక్క యర్థము, సయితము మతవిషయికమైన విద్యాభ్యాసమువలనఁ గలిగినవి గావు, లౌకిక విద్యవలన లభించినవి. విధేయతయే పరమోత్కృష్టముగ గ్రహించిన నీతిమార్గమున నీగుణము లంకురించుటకే వీలులేదు.

క్రైస్తవనీతి నెట్లు విచారించిన నీ లోపములు దానియం దనివార్యముగ స్వభావసిద్ధములై యుండుననిగాని, ప్రస్తుతము దానియం దగపడని

ఖండన పర్యవసానము

సంపూర్ణ నీతిసిద్ధాంతమునకుఁ గావలసిన యంశములు చాల వఱకు దానితో సమన్వయము కానేరవనిగాని నేను వ్యపదేశము చేయను. క్రీస్తు స్వయముగ నుపదేశించిన సిద్ధాంతములను విధులనుగూర్చి యిట్టివ్యపదేశముఁ జేయుటకు నాకంతకంటెః నిష్టములేదు. క్రీస్తుబోధనల యొక్క యుద్దేశమును గనఁబఱచుట కేమాత్రమైన ప్రమాణము గలదంతయు వానియందుఁగలదని నానమ్మకము. సమగ్రమైన నీతిసిద్ధాంతమునకుఁ గ్రీస్తుబోధనలతో విరోధము లేదనియు నాచారకాండకుఁ గావలసిన విషయముల నాబోధనలనుండి గ్రహించుటలోఁ బూర్వపు వారికంటె నతిశయముగ వాక్యార్థమును ధ్వంసము చేయకుండఁగనే నీతిసిద్ధాంతములోఁ బ్రశస్తమయినదంతయు వానిక్రిందికిఁ దేవచ్చుననికూడ నాకునమ్మకముగలదు. కాని యిట్లుచెప్పినందువలనఁ గ్రీస్తునుపదేశములలో లిఖితమైన వానియందుఁ గొంతసత్యము మాత్రమే యిమిడియున్నదనియు, వానియుద్దేశముకూడ నంతేయనియు, ఉత్కృష్టనీతి మార్గమునకుఁ గావలసిన ముఖ్యాంశములు చాలవఱకు వానిలో లేవనియు, అట్లుండుట వానియుద్దేశము కాదనియుఁ జెప్పిన విరోధముకాదు. అయుపదేశముల నాధారపఱచుకొని క్రీస్తు సాంప్రదాయకులు నిర్మాణము చేసిన నీతిపద్ధతిలో నీవిషయములను బొత్తిగ వదలివేసిరి. కనుక క్రైస్తవసిద్ధాంతమందు మనపరివర్తనమును బరిపాలింపఁగల సూత్రము సంపూర్ణముగనున్నదని పట్టుపట్టుట చాలగొప్ప పొరపాటు. ఇట్టిసూత్రమును సంపాదించి పరివర్తింపఁజేయుటకు నా మతకర్త సిద్ధాంతములో నవకాశమిచ్చియుండెనుగాని దానిని సంపూర్ణముగఁ బ్రసాదించియుండలేదు. ఇంతియగాక యిటువంటి సంకుచిత సిద్ధాంతము గొప్ప యనర్థమునకు హేతువగుచున్నది. నీతి విద్యా శిక్షలను వృద్ధిపఱచెడు సదుద్దేశముతోఁ గృషి చేయుచున్న వారి యత్నములకు లోపమును గలిగించుచున్నది. కేవలము మత సిద్ధాంతము ననుసరించి;మనోబుద్ధి వృత్తుల నిరూపింపవలెననెడి యత్నము వలనను, ఇదివఱకుఁ గ్రైస్తవనీతి సిద్ధాంతమునకుఁ దోడ్పడి దాని యందు

లోపించినవానిని బూర్తి చేయుచు దానిసారమునుగ్రహించి తనబలమును దానికిఁ బ్రసాదించుచు వచ్చిన లౌకిక ప్రమాణమును విసర్జించుటవలనను నీచమై హీనమైనదాస్య ప్రవృత్తి సంప్రాప్తమగుచున్నది. ఇఁకముందు నిటులనే సంభవించును. ఇట్టి ప్రవృత్తిగలవా రుత్కృష్టమని నమ్మిన విధికి లోఁబడుచుందురుగాని పరమ సద్భావమును గ్రహించి, దానిని బొందఁ గల సమర్థత లేకుందురు. మానవులనీతి నుద్ధరించు నిమిత్తము క్రీస్తు సిద్ధాంతమునుండి లభించెడునీతిగాక వేఱు నీతిసిద్ధాంతముగూడ దానికి దోడుగఁ గావలెనని నానమ్మకము. ఎందుకన, మానవబుద్ధి హీనమయినస్థితిలో నున్నంతవఱకు నభిప్రాయభేదమువలన సత్యములకు లాభము కలుగుచున్నదనెడి న్యాయమును క్రైస్తవ సాంప్రదాయము కూడ నతిక్రమింపఁ జాలదు. క్రీస్తుమతములోలేని నీతిసిద్ధాంతములను గ్రహించుటవలన దానిలోనున్న వానిని ద్యజింప నగత్యములేదు. ఇటువంటి యవిచార కార్యముగాని యుపేక్షగాని సంభవించినపుడు దానిని గేవలము కీడుగభావింపవలసియుండును. అయిన నీ కీడునుండి మనమెల్లప్పుడును దప్పించు కొనఁజాలుదుమని యూహింపరాదు. విశేషలాభమునిమిత్త మానష్టమునకు లోఁబడవలసి వచ్చెఁగదాయని భావింపవలసి యుండును. సత్యములోఁ గొంతభాగమును స్వీకరించి, దానికంటె వేఱు సత్యము లేనటుల నదియే సంపూర్ణమని వాదము వచ్చినపు డట్టివాదమును విధాయకముగ నెదిరింపవలెను. ఇట్లెదిరించు ప్రవృత్తిగల ప్రతి కక్షులయందుఁ గూడ నన్యాయముదొరలి, వీరును పాక్షికాభిలంబను లైనచో నదిదుఃఖకరమయినను దానిని సహించి యుండవలెను. నాస్తికులు క్రీస్తుమతము విషయమయి న్యాయముగ నుండవలెనని క్రైస్తవులు కోరినచో వీరునాస్తికత్వము విషయమున ముందుగ న్యాయముగ నుండవలెను. నీతి సిద్ధాంతములో నమూల్యమయిన యుత్కృష్టాంశము క్రీస్తుమతమునను దెలిసియు దానిని స్వీకరింపక విసర్జించిన వారివలన లభించినదని విద్యావిషయిక చారిత్రముతో సామాన్య పరిచయము గల వారందఱకును దెలిసిన సంగతియే. ఈసంగతినిజూడక కన్నులు మూసికొనుటవలన సత్యమున కేమియు లాభము కలుగదు.

సిద్ధాంతము.

వికల్పాభిప్రాయము లన్నిటిని సర్వస్వాతంత్ర్యముతో నిర్వచించుటవలన మతవిషయిక మైనట్టిగాని, యాధ్యాత్మిక విచారణవిషయమయి నట్టిగాని, శాఖాభేద ములవలని విపత్తులు నశించిపోవునని నే నుపదేశించుటలేదు. అల్పబుద్ధిగలవారి కేసత్యము నందుఁ బట్టుదలగలదో దానిని బ్రతిపాదించి బోధించి దానిప్రకార మనేక విధములఁ బ్రవర్తించి, దానికంటె వేఱుసత్యముగాని దానిని బాధింపఁగల సత్యేతరముగాని లేనియట్లు నడచుకొనుచుందురు. అభిప్రాయము లన్నిటి యందు శాఖలుగ నేర్పడెడు ప్రవృత్తి గలదు. వాక్స్వాతంత్ర్య మెంత లభించిన నిది నివారణము కాదు సరిగదా అనేక సమయములలో హెచ్చు క్రోధోద్దీపనమునకు హేతువగును. సత్యము నదివఱకుఁ జూచి యుండకపోవుటయే గాక దానిని బ్రతికక్షులు ప్రతి పాదించి నారను కారణముచేత మఱింత యుద్రేకముతో విసర్జింతురు. అయినను రాగాన్వితుఁడైపక్షపాతము గలవానియందభిప్రాయ సంఘట్టనము వలనఁ గలుగఁ గలలాభము కనిపింపక పోయినను శాంతముగలవారై, రాగరహితులై తటస్థులుగ నుండువారికిఁ దప్పక లాభము గలుగును. సత్యాంశసంఘర్షణ మొకగొప్ప కీడు గాదు గానిసత్యములో సగపాలును నెమ్మదిగ నణఁచివేయుట మిక్కిలిగొప్ప విపత్తు. మానవు లుభయపక్షములను వినవలసిన నిర్బంధము కలిగినప్పుడు మేలుకలుగుట కవకాశమున్నది. ఒకపక్షమును మాత్రమే గమనించినయెడల నభిప్రాయదోషములు దురాగ్రహ రూపము నొంది, సత్య మతిశయోక్తివలన నసత్యరూపము నొంది దానిగుణమును గోలుపోవును. ఏవిషయమునఁ గాని యుభయపక్షములను యుక్తాయుక్తముగ నిదానముతో విమర్శింపఁగల మనోవృత్తి మిక్కిలి యరుదు. ఏపక్షమునవలంబించినవాఁడు, యాపక్షమును విశదీకరించుటం బట్టి సత్యములోఁ బ్రతియంశమునకును, అంశలేశమునకునుగూడ, వాదియేర్పడి లోకులాలకించునంత బలవంతముగ నాపక్షమును వాదించిననే గాని సత్యమునకు సంపూర్ణావకాశము చిక్కదు.

మానవుల మనోవృత్తి మంచిస్థితిలోనుండినగాని యితరవిధమైన మంచి కలుగ నేరదు. మనోవృత్తి బాగుగ నుండుట కభిప్రాయ స్వాతంత్ర్యమును, అభిప్రాయ ప్రకటనస్వాతంత్ర్యమును, ఆవశ్యకమనియింతవఱకుఁ గ్రహించితిమి. దీనికిఁ జెప్పబడియున్న నాలుగు హేతువులనుసంక్షేపముగఁ బునరవలోకనము చేసెదము.

మనోవాక్స్వాతంత్ర్య ప్రతిపాదనమునకుఁ జెప్పబడిన హేతువులు నాలుగు

మొదటిది, ఏయభిప్రాయమునైనను మెదలకుండ నిర్బంధించిన యెడల నాయభిప్రాయ మొకవేళ సత్యమైనదేమో? కాదని మనము నిశ్చయముగఁ జెప్పఁజాలము. అట్లు చెప్పినచో మన కప్రమాదిత్వకల్పన చేసికొనిన వారమగుదుము.

రెండవది, బైలుపడకుండ నణఁచివేసిన యభిప్రాయము దప్పైనను దానియందు కొంతసత్యాంశ ముండవచ్చును. సర్వసాధారణముగ నట్లుండుటయే తటస్థించుచున్నది. ప్రసిద్ధ సాంప్రదాయములో సత్యమంతయు నిమిడియుండుట మిక్కిలియరుదు. ఎప్పుడును సంపూర్ణముగ నుండదనియే చెప్పవచ్చును. కనుక భిన్నాభిప్రాయ సంఘర్షణము వలన మాత్రమే తక్కిన సత్యాంశము లభింప నవకాశము గలుగును.

మూడవది, ప్రసిద్ధసాంప్రదాయము సత్యమగుటయే గాక యావత్సత్యమును కలిగియున్నదని యూహించినను, ఆసత్యమును బలవంతమైనపట్టుదలగల వివాదమునకు లోబఱచిననే గాని తత్సాంప్రదాయకులలోఁజాల మందికి దానియర్థమును, ఉపపత్తులును దెలియక యవిచారమతముగ నైపోవును. ఇంతియగాక నాల్గవకారణమింకొకటిగలదు. సిద్ధాంతముయొక్కయర్థ మంతర్హితమైపోవును. లేదాదుర్బలమై ప్రవర్తనాశీలములను బరిపాలింప నిస్సారమగును. శ్రేయోదాయకము గాని లాంఛనముగ నిలిచియుండి స్వతంత్రమైన బుద్ధి ప్రాభవమువలనఁగాని యనుభవమువలనఁ గాని యథార్థమై మనః పూర్వకమైననిశ్చయజ్ఞాన మేమియుఁ బుట్టకుండ నాటంక పఱచుచు హృదయసీమ నాక్రమించుకొనియుండును.

వాక్స్వాతంత్ర్య విషయమును ముగింపక పూర్వమింకొక పక్షమును విచారించుట యుక్తము. వాదపద్ధతిశాంతమై మర్యాదను మీఱనంతవఱకు సమస్తాభిప్రాయములను స్వేచ్ఛగఁ బ్రకటింప నవకాశమియ్యవచ్చునని కొందఱుచెప్పెదరు. కాని ఈ నియామకనిర్ణయ మసాధ్యమని చాలవఱకుఁ జెప్పవచ్చును. ఎందుకనఁగఁ బూర్వపక్షము చేయఁబడినవారిమనోవ్యథను బ్రమాణముగఁ బెట్టుకొని యెదమనినఁ బూర్వపక్షమెక్కడెక్కడ బలవంతమై సార్థకముగనుండు చుండెనో యక్కడక్కడనెల్ల నీమనోవ్యథకలుగుచుండుననియు, వారికి నొత్తుడుకలిగించి నిరుత్తరులుగఁ జేయువాఁడు తద్విషయమునఁ బట్టువలగనఁబఱచిన యెడలవాఁడు వారికమర్యాదయైన ప్రతికక్షిగఁ గనిపించుచుండుననియు ననుభవమువలన స్పష్టమగుచున్నది.

ఈస్వాతంత్ర్యమునకు వాదమర్యాదనుబట్టి మితి.

వ్యావహారిక దృష్టిచేత నీయాక్షేపము ముఖ్యమైనను ఇదియింతకంటెముఖ్యమైన యాక్షేపములోనంతర్భాగమగుచున్నది. ఏయభిప్రాయమైనను సత్యమైనను దానిని బ్రతిపాదించుకీతి నిశ్చయముగ నాక్షేపణీయమై న్యాయమునదూష్యము కావచ్చును. కాని యిటువంటి యపరాధములలో ముఖ్యమైన వానిని జరిగించిన వారాకస్మికముగఁ దమలోపముచేత నానినిబయటపెట్టుకొనిననే గాని లేనియెడల వారినాయపరాధము జరిగించినటుల నొప్పించుట చాలవఱకసాధ్యముగ నుండును. యథార్థము నణఁచిపెట్టి, వాదమును మఱుఁగుపఱచి, విషయాంశములనుమార్చిచెప్పి, ప్రతికక్షివాదమునన్యథాఖ్యానముచేసి, కపటవాదమొనర్చుట యీయపరాధములలోకెల్ల మిక్కిలి యధికమైనది. ఇది మిక్కిలి యెక్కువైనరీతిని దటస్థించినప్పుడు గూడ నాయపరాధము నొనర్చువారు మంచియుద్దేశముతోనుండుటయు, నితరమైన యనేకవిషయములలో నజ్ఞానులనిగాని, యసమర్థులనిగాని చెప్పనలవికాకుండుటయు వారివలన నిట్టికార్యము తఱచుగ సంభవించుచుండుటంబట్టియు, ఈ యన్యథాఖ్యానమును నీతిబాహ్యమని యథార్థముగ ముద్రాంకితము చేయుటకు

సమాధానము

సాధారణముగ సాధ్యముకాదు. వాదములో నిటువంటి దురాచారమున జోక్యముకలుగఁజేసికొన నంకించుట ధర్మశాసనమునకు మఱింత సాధ్యము కాదు. సామాన్యముగ నమర్యాదవాదమనినచోట నింద, యాక్షేపము, వాది దూషణ మెందతైనవని తాత్పర్యము. ఈ సాధనముల నుభయపక్షముల సమానముగనివారింపనుద్దేశమైనచో వానిదూషణమెక్కువగ నాదరింపనగును గాని వాడుకలోనున్న యభిప్రాయముమీఁద వీనిని బ్రయోగింపకుండ నివారించుటకు మాత్రము సాధారణముగఁ గోరుచున్నారు. నూతనాభిప్రాయ విషయమున వానిని బ్రయోగించినపుడు సామాన్యముగ ననాదరణ చేయక పోవుటయే గాక తత్ప్రయోక్తయొక్క సత్యశీలతను, సదాగ్రహమును బ్రశంసించుచుందురు. కాని వాని నితరులకంటె నరక్షితులై వారిమీఁద బ్రయోగించినప్పుడే యెక్కువకీడు సంభవించును. ఇట్టి ప్రతిపాదనము వలన నేవాదమునకైన నన్యాయముగ లాభము కలుగుననుకొనెదమా యా లాభము ప్రసిద్ధ సిద్ధాంతములకు మాత్రమే కలుగుచుండును. వాదులలో నెవ్వఁడైన బ్రతివాదిని దుర్మార్గుఁడనియు, నీతిబాహ్యుఁడనియు దూషించుటయు యీ తరగతి యపరాధములలో మిక్కిలి హీనమైనది. విమతులు సాధారణముగ స్వల్పసంఖ్యాకులై ప్రబలులు గాకుండుటనుబట్టియు, వారిపక్షమునకు న్యాయమును సంపాదించుటకై కుతూహలము వారికిగాక యితరులకు లేకుండుటనుబట్టియు, నా రిట్టి నిందకు లోనగుట విశేషముగ సంభవించును. ప్రసిద్ధసిద్ధాంతమును ఖండించువారికి సహజముగ నీ యాయుధము లభింపదు. లభించినను దానిని బ్రయోగించుటవలన వారి క్షేమములకు భంగముగలిగి వారిపక్షమునకే యెదురు హానికరమగును. ప్రసిద్ధ సిద్ధాంతములకు వ్యతిరిక్తముగనుండు సిద్ధాంతములను మిక్కిలి నిదానమైన శాంతవచనములతోఁ జెప్పి యగత్యమైన మనోవ్యథను గలిగింపకుండ మిక్కిలి జాగరూకతతో నుండని యెడల వాపక్షమును వినిపించుకొనుటయే కలుగదు. ఈ మార్గమునుండి యేమాత్రము తొలఁగినను నష్టము కలుగకమానదు. ఇది యిట్లుండ సర్వజనాంగీకారమైన పక్షమున నిందావాక్యముల నపరిమితముగఁ బ్రయోగించు

చుండుటవలనఁ దద్భిన్నాభిప్రాయములను బ్రకటనచేయకుండఁగను, చేసినవి చినకుండఁగను ఆటంకము కలుగుచున్నది. కనుక సత్యన్యాయములను గాపాడుట కిట్టి నిందా వాక్యోపసంహార మెక్కువ యావశ్యకము. ఈ విషయమున నెన్నిక కగత్యమున్న యెడల ఆస్తికత్వముకంటె నాస్తికత్వము మీఁద దోషావహమగు ప్రయోగముల నుపసంహారము చేయవలసిన యావశ్యకత యెక్కుడుగ నున్నది. అందున రాజకీయ శాసనమునకును అధికారమునకును, వీనిలో నేపక్షమునుగాని యుపసంహరించుటకు నిమిత్తములేదని స్పష్టము. ప్రతి సంగతిలోను సందర్భమునుబట్టి లోకులు నిర్ణయము చేయవలసియున్నది. ఏ వాదమునఁ గాపట్యము, దురుద్దేశము, మతావేశము, అసహనము, పొడచూపుచుండునో యాపక్షమును దండించుచు స్వపక్షవిరోధము నవలంబించినంత మాత్రమున నేపురుషునియందుఁగాని యీ దోషముల నారోపింపకుండవలెను. ఎవ్వఁడుగాని తనపక్షమేదైనను బ్రతిపక్షుల యభిప్రాయములను శీలమును గనిపెట్టి చెప్పునంత శాంత సత్యప్రవర్తనములను గలిగియున్నాఁడో ఎవ్వఁ డతిశయోక్తివలనఁ బ్రతిపక్షుల కపవాదము గలిగింపఁడో, వారికి సార్థకముగ నుండునట్టియు, యుండునని యెంచఁదగినట్టియు సంగతిని దేనిని దాఁచిపెట్టఁడో ఆ పురుషుని యోగ్యతకుఁదగిన గౌరవము నిచ్చుచుండవలయును. బహిరంగమైన వాదమున కిదియ నిజమైన మర్యాద. దీనికిఁ దఱచుగ భంగము కలుగుచుండిన నీమర్యాదకు లోఁబడినవారు లనేకులున్నారనియు నంతకంటె నెక్కువమంది దానికై యథార్థముగఁ బెనఁగులాడుచున్నారనియు జ్ఞాపకము చేసికొని సంతోషించుచున్నాను.

-:0:-




## వ్యక్తిస్వాతంత్ర్యము సుస్థితికి ముఖ్యాంశమను విషయము.

కార్యస్వాతంత్ర్య సూత్రము.

ఇట్టికారణముల వలన మనుష్యులు తమ యభిప్రాయముల నేర్పాటు చేసికొనుటకును, వానిని నిరాటంకముగఁ బ్రచురము చేయుటకును స్వాతంత్ర్యముండుట యావశ్యకము. ఈస్వాతంత్ర్యము ప్రతి మనుజునికి నుండవలెను. లేనిచోటనెల్ల దానిని ధ్రువపఱచవలెను. అట్లుకానియెడల బుద్ధికిని దన్మూలమున నీతికిని గూడ ననర్థములు సంప్రాప్తమగును. ఇఁక నీకారణములను బట్టియే మనుష్యులకు వారి యభిప్రాయానుసారముగ నడచుకొనుటకు స్వాతంత్ర్యముండవలెనో లేవో విచారింతము. మనుజులు తమ కృత్యములవలనఁ బుట్టు నష్టములకుఁదమరే బాధ్యులైనంతవఱకు నితరులవలన స్థూలసూక్ష్మరూపమైన యాటంకమేమియు లేకుండఁదమ యభిప్రాయముల నాచరణములోఁబెట్టుటకు స్వాతంత్ర్యముండవలెను. ఇక్కడఁజెప్పిన పరిమితిమిక్కిలి యగత్యము. ఎందుచేతననఁగా, అభిప్రాయవిషయమున నున్నంత స్వాతంత్ర్యము క్రియావిషయమునఁగూడ నుండవలెనని యెవరును జెప్పఁబూనుకొనరు. అభిప్రాయములను వెల్లడిచేయుటవలనఁ జెఱుపునకుఁ గారణమైన సందర్భములలోవానికి సయితముఁగొంత పరిమితిని విధింపవలసియుండును. ధాన్యప్రవర్తకుల మూలమునబీదలు మాడుచున్నారు, ఆస్తిని దాఁచుకొనుట దొంగతనముతో సమానము. ఈమొదలైన యభిప్రాయములను గ్రంథములమూలకముగ మాత్రము ప్రచురపఱచినంతవఱకు వానిజోలికిఁబోఁగూడదు. కాని చిల్లరజనము కోపావేశముతో ధాన్యపుకొట్లయొద్దఁ జేరియున్నప్పుడిట్టి సంగతులను వారిచెవిని బడవేయుటయుఁ గాగితములమీఁద

నెక్కించి వారికిఁ బంచిపెట్టుటయు దండనార్హమగును. తగినంత కారణము లేకుండ నితరులకు నష్టముఁ జేయు కార్యములను నిరాదరణ చేసి, యగత్యమైన యెడల నాటంకపఱుపవచ్చును. ఎవఁడును ఇతరులకు బాధకరముకాఁగూడదు. ఇదియే వ్యక్తిస్వాతంత్ర్యమునకుఁ బరిమితి. కాని

వివరణము. యితరులను బాధింపక స్వకీయవిషయములలోఁ దనయిష్టాభిప్రాయప్రకారము సంచరించునప్పు డెవనికిఁ దొందరలు కలుగఁ జేయఁగూడదు, వానినడతయొక్క లాభనష్టములను వానికే వదలివేయవలెను. అభిప్రాయ నిరూపణములో స్వాతంత్ర్యముండవలెననుట కే కారణములను జెప్పియుంటిమో దీనికి నవే కారణములు గలిగియున్నవి. మనుష్యులు పొరఁబడవచ్చును. వారికిఁ దెలిసిన తత్వములు చాలవఱకు కర్ధసత్యములే గాని సంపూర్ణములు గావు. భిన్నాభిప్రాయములను బోల్చిచూచిన పిమ్మటఁ దేలిన నే తప్ప యభిప్రాయైకత్వ మపేక్షణీయము గాదు. భిన్నాభిప్రాయములుండుట యొకవిపత్తు గాదు. తత్వము నిప్పటికంటె నెక్కువ పరిపూర్ణముగ గ్రహించు సామర్థ్యము మానవులకుఁ గలుగు పర్యంతము భిన్నాభిప్రాయము లుండుట మంచిది. ఈ న్యాయములన్నిటిని యభిప్రాయ విషయమున నేకాక కార్యముల విషయమునఁ గూడఁ గమనింపవలసియున్నది. మనుజులు పరిపూర్ణులు గాకుండు వఱకు భేదాభిప్రాయములుండుట యెట్లులాభకరమో కార్యాచరణమందు భేదములుండుట కూడ నట్లే యుపయుక్తము. ఇతరులకు హానిలేకున్నంతవఱకు భేదపు నడవడులకాటంకము చేయఁగూడదు. ఎవరైనను భేదపునడవడుల లాభనష్టములను గ్రియచేతఁ గని పెట్టి చూడవలెనని కోరినచో నానడవడుల లాభనష్టములను గ్రియాపర్యవసానముచేతఁ బరిష్కరింపవలసి యున్నది. ఇన్నియేల, తమకు గనితరులతో సంబంధము లేనంతవఱకు వ్యక్తిస్వాతంత్ర్యము శ్రేయస్కరము. ఒకపురుషునియొక్క ప్రవర్తనము వానిశీలముచేతఁగాక యితరుల యాచార సాంప్రదాయములనుబట్టి నిర్ణయమైనచో

సుస్థితికిఁగావలసిన ముఖ్యాంశములలో నొకటిలోపించి పోవును. ఇదివ్యక్తి యొక్కయు సంఘముయొక్కయు యభివృద్ధి కగత్యమైన సాధనమై యున్నది.

ఈన్యాయమును సమర్థించుటలోనొక విశేషబాధ యడ్డమువచ్చుచున్నది. కాని యదియందఱు నంగీకరించిన ప్రయోజనమును సాధించుటకుఁ **ప్రతిబంధకము.** గావలసిన సాధనముల గుణాగుణ విచక్షణమువలనఁ బుట్టుటలేదు, జనులుసామాన్యముగ నాప్రయోజనము నే లక్ష్యము చేయకపోవుటవలనఁ గలుగుచున్నది. వ్యక్తియొక్క నిరాటంకాభివృద్ధి సుస్థితికి ముఖ్యాంశమనియు, నాగరికత, జ్ఞానాభ్యాసము, విద్య, సంస్కారములతోనది జతగనుండవలసినది మాత్రమేకాక వానిన్నిటియందును ముఖ్యాంశమై వానినన్నిటిని నియమించు చుండుననియు లోకులకు నాటినయెడల స్వాతంత్ర్యమునకుఁ దగినవిలువ లేకపోవుటను విపత్తుతొలఁగిపోయి వ్యక్తిస్వాతంత్ర్యసంఘనియమసమన్వయ మొక విశేష కష్టముగాకపోవును. కాని వ్యక్తిసంబంధమైన స్వేచ్ఛకు సామాన్య దృష్టిచేత స్వతస్సిద్ధమైన విలువయు, అంగీకారమును, గౌరవమును, లేకుండుట గొప్పకీడుగనున్నది. మనుష్యులలోఁ జాలమంది ప్రస్తుతము వ్యవహారములోనున్న రీతులను వారే నిర్ణయించి యుండుటనుబట్టి యారీతులు బాగుగనున్నవని తృప్తిఁజెందియుందురు. కనుక నారీతులే ప్రతినరునికి నెందుచేత మంచివి కానేరవో వారికిఁ దెలియ జాలదు. ఇంతియెఁకాక నీతిసంఘసంస్కర్తలలోఁ జాలమంది యేర్పఱచుకొన్న పరమావధియందు వ్యక్తిస్వాతంత్ర్యమునకుఁ జోటులేదు. వారు మనుష్యజాతికిఁ బరమశ్రేయమని యూహించినవిషయములను సామాన్యముగ నందఱు నంగీకరింపకుండ నది కష్టతరమైన ప్రతిబంధకముగనుండునని యీర్ష్యతోఁ జూచుచుందురు. పండితుఁడును, రాజనీతిపారంగతుఁడునని ఖ్యాతివహించిన విల్హెల్మువాన్ హాంబోల్టురచితమైన గ్రంథశీర్షికయొక్క యర్థమునుజర్మనీకి వెలుపల మిక్కిలి కొద్దిమందిమాత్రమే గ్రహించియున్నారు. అదేమనిన, "సందిగ్ధములైనట్టియుఁ

తాత్కాలికములైనట్టియు నిచ్ఛలవలనఁ బ్రబోధితముగాక శాశ్వతమై నిర్వికల్పమైనజ్ఞానముచేత విధింపఁబడిన ప్రకారము మనుష్యుని శక్తులు సంపూర్ణముగను బరస్పరానుకూలముగను నభివృద్ధిఁజెంది యఖండముగ నుచ్ఛదశ నొందుటయే పరమావధి." కానఁ, "బ్రతిమనుష్యుఁడును, ముఖ్యముగ నితరులఁ బ్రోత్సాహపఱపఁదలఁచినవారును, వ్యక్తిశక్త్యాభివృద్ధులనుదృష్టి యందుంచుకొని వానికై తమ సర్వప్రయత్నములను నిరంతరము ప్రయోగించుచుండ వలయును." దీనికి "స్వాతంత్ర్యము, అవస్థాభేదము అను రెండును అపేక్షణీయములు." ఈరెంటియొక్క ఐక్యతవలన "వ్యక్తిబలమును, బహుప్రకారభేదమును సిద్ధించి కల్పనాశక్తియందుఁ బర్యవసించును."

కార్యస్వాతంత్ర్యావశ్యకత,

వాన్‌హంబోల్టు ఉదాహరించిన సిద్ధాంతము లోకులకు సామాన్యముగఁ దెలియకపోయినను, వ్యక్తిస్వాతంత్ర్యము నంత నెక్కువగ వర్ణించినందులకు వారి కాశ్చర్యము కలిగినను, ఈ విషయమున నాలోచింపవలసిన సంగతి తారతమ్యాంశమేగాని వేఱుగాదు. లోకులు వారి ప్రవర్తనవిషయములో నొకరినొకరు కేవల మనుకరించి యూరకుండుటయే ప్రశస్తమని యెవ్వఁడును భావింపఁడు. తమ జీవితపద్ధతిలోను, వ్యవహారప్రవర్తనమందును, స్వీయమైన విమర్శమునుగాని వ్యక్తిప్రాభవమునుగాని చూపింపఁగూడదని ప్రతిపాదించువాఁడెవ్వఁడు నుండఁడు. కాని యెవ్వఁడైనను దాను లోకమునం దుద్భవింపక పూర్వము జ్ఞానమేమియు లేనట్లు ప్రవర్తించుటయు, నొకవిధమైన నడతయు, జీవనమును, మఱియొకదానికంటెఁ బ్రశస్తమని తనకంటెఁ బూర్వ మనుభవసిద్ధముగా నట్లు జీవించుటయు వెఱ్ఱితనముగ నుండును. మానవకోటియొక్క యనుభవసిద్ధఫలమును దెలిసి దానివలన లాభము నొందునట్లు పిన్నవయస్సులోఁ బ్రతిమనుజునకు నేర్పి శిక్షింపఁగూడదని యెవ్వఁడును జెప్పజాలఁడు. కాని వ్యక్తతఁ జెందిన ప్రతిమానవుఁడు ననుభవమును దనకుఁ దోఁచినరీతిని అర్థముచేసి యుప

యోగించుకొనుట యుక్తమైనమార్గము. వాని కట్టియధికారము గలదు. అదివఱ కుండియున్న యనుభవములో నేభాగము తన పరివర్తనసందర్భములకుఁ జెల్లనగునో దాని నతఁడే కనుఁగొనవలసి యున్నది. ఇతరుల యొక్క సాంప్రదాయములును, ఆచారములును, వారి యనుభవమువలనఁ దేలినసారాంశమునకుఁ గొంతవఱకు నిదర్శనముగ నుండును. ఈ నిదర్శనము బహుశా నిజమైయుండవచ్చును గాన నవి వాని గౌరవమునకుఁ బాత్రమై యుండును. కాని యొక పక్షమున వారియనుభవము స్వల్పమై యుండ

హేతువులు

వచ్చును. లేక దానికి వారు సరిగ నర్థము చేసియుండక పోవచ్చును. రెండవపక్షమున, వారి యనుభవార్థము సరియైనను వానికది యనుకూలము గాకపోవచ్చును. ఆచారములనునవి సాధారణముగఁ గలుగుచుండు సంగతులను బరివర్తనములను నుద్దేశించి యేర్పడుచున్నవి. కాని వానిపరివర్తనసందర్భములు సాధారణములు కాకపోవచ్చును. మూడవపక్షమున, ఆయాచారములు సహజముగ మంచివియై వాని కనుకూలములైనను గూడ నెవ్వఁడేని వాని నాచారమను దృష్టితో మాత్రమే యవలంబించినయెడల మనుష్యుని విశేష ప్రజ్ఞలోఁ జేరిన గుణములకు వేనికిని వ్యక్తతఁ గలిగించి వృద్ధినొందింపఁ జాలవు. గ్రహింపు, విమర్శనము, వివేకము, మనోచాకచక్యము, నీతినిర్ణయము మొదలుగాఁగల మానవశక్తుల కభీప్సితమందుఁ గాని వ్యాపకము గలుగనేరదు. దేనినిగాని యెవ్వఁడైన నాచారమను కారణముచేత నాచరించినయెడల వానికి నభీప్సిత మనునది లేదు. ఆట్టివాని కుత్తమభాగమును గనిపెట్టి దాని నభిలషించు నభ్యాసము కలుగనేరదు. శారీరిక శక్తులవలెనే మానసికనీతి శక్తులును అభ్యాసముచేత వృద్ధిఁజెందును. ఇంకొకరు నమ్మినారను కారణముచేత దేనినిగాని నమ్మినను, ఇంకొకరు చేసినారను కారణముచేత దేనినిగాని చేసినను ఈశక్తులకు సాధకము గలుగనేరదు. ఏ యభిప్రాయమునకుఁ గాని గలహేతువులు స్వీయమైన హేతుజ్ఞానమునకుఁ దృప్తికరముగ నుండనియెడల నా యభిప్రాయమును స్వీకరించుటవలన వారిజ్ఞానమునకు బలము

కలుగదు సరిగదా బహుశా యది దుర్బలముకూడఁ గావచ్చును, ఇతరుల యొక్క యనురాగమునకుఁగాని స్వత్వమునకుఁ గాని సంబంధములేని విషయములందుఁ బ్రవర్తన నిమిత్తములు వ్యక్తియొక్క చిత్తవృత్తులకును శీలమునకును ఎంతవఱ కనుకూలము గాకుండునో యంతవఱకు నావృత్తి శీలముల చాకచక్యబలములు క్షీణించి యవి నిద్దుర వోయినట్లు మాంద్యము నొందును.

**కార్యమందస్వాతంత్ర్యఫలము.**

తనయొక్క జీవితపద్ధతిని లోకులు నిరూపించుట కొప్పుకొనువానికిఁ గోఁతివలె నింకొకరుచేసిన దాని ననుకరించు శక్తి తప్ప వేఱుశక్తి యక్కఱలేదు. తనపద్ధతిని దాను నిరూపించుకొనువాఁడు మాత్రమే తనకున్న శక్తుల నన్నిటి నుపయోగించినవాఁడగును. ఆగతమును గని పెట్టుట కాలోచన శక్తియు, యనాగతమును గ్రహించుటకు హేతు విమర్శనశక్తులును, నిశ్చయమునకుఁ గావలసిన సామగ్రియొక్క సంపాదనమునకై చాకచక్యమును, నిశ్చయించుటకు వివేకమును, నిశ్చయించినపిమ్మట దానిని దృఢముగ నవలంబించుట కాత్మస్థైర్య, యాత్మనిగ్రహములను బ్రయోగింప వలసియుండును. తనవిమర్శన శక్తి మనోభావముల పరికారము తనపరివర్తనములో నెంతయెక్కువ భాగమును స్వయముగ నిరూపించుచుండునో సరిగనంత యెక్కువగ నీశక్తుల కగత్యముండి సాధకము గలుగుచుండును. దీనిలో నేమియు నక్కఱలేకుండఁగనే సరియైన త్రోవను బడి విపత్తుల పాలుగాకుండుట సాధ్యమేగాని, యీరీతి నతనికి మానవునకుండవలసిన ప్రాశస్త్యమేమాత్ర మెక్కువ లభింపఁగలదు? మానవులాచరించెడి కార్యము మాత్రమే ముఖ్యముగాదు. దాని నాచరించెడు పురుషులెట్టివారో యది కూడ సమానముగ ముఖ్యమే. చక్కఁగ సంస్కరించి మనోరంజకముగఁ జేయుటకై మనుష్యుల యావజ్జీవము కృషి చేయుకార్యములలో నెల్ల మనుష్యుని యభివృద్ధియే నిశ్చయముగఁ బ్రథమగణ్యము. మనుష్యులను యంత్రతుల్యముగఁ జేసి యాయంత్రములచేత భవనములుకట్టించి, ధాన్యములు

పండించి, యుద్ధములు గావించి, వ్యాజ్యములవిచారించి, దేవళములనిర్మించి ప్రార్థనములఁ జేయించుట సాధ్యమైనదనుకొనినను, అటువంటి యంత్రతుల్యములైన మానవులను బుచ్చుకొని యిప్పుడు ప్రపంచములో నాగరికులనిపించుకొనుచున్న మానవజాతి పొందఁగలిగినట్టియు, ఇంకముందుఁ బొందునట్టియు నుచ్చదశనుబట్టి నిజముగ హీనులనిపించుకొను స్త్రీపురుషుల నిచ్చివేసినయెడల నాశేరమువలన విస్తారమయిన నష్టము సంభవించును. ఒకమాదిరినిబట్టి మానవప్రకృతిని యంత్రమువలె నిర్మించి నిశ్చితకార్యమును యథావిధిగఁ జేయునట్లు నియమించుటకు వీలులేదు. ఆ ప్రకృతి సజీవమయినదగుటచే దానిలోనుండు శక్తుల ప్రవృత్త్యానుసారముగ వృక్షమువలె వృద్ధిఁజెంది నానాముఖముల వికాసమునొందుటకు యోగ్యమై యున్నది.

వ్యక్తితాశీలముల యగ్రము

మనుష్యులు తమబుద్ధి నుపయోగించుట యావశ్యకమనియు, నాచారమును వివేకముతో ననుసరించి యొకప్పుడు దానినుండి వివేకియైనవాఁడు తొలఁగుటయుఁగూడ నాచారమును అంధప్రాయముగఁ గేవలము యంత్రమురీతి నాచరించుటకంటెఁ బ్రశస్తమని బహుశా యొప్పుకొందురు. మనబుద్ధి మనస్వాధీనములో నుండవలసినదని కొంతవఱ కంగీకరించుచున్నారు. కాని మనకోరికలును, ప్రవృత్తులును అదేరీతిని మనకు స్వాధీనములయియుండవలెనని గాని, మనకు స్వీయమయిన ప్రవృత్తులుండి యవి యేమాత్రమును బలవంతములగుట మన కుపద్రవమును, పాశబంధమును, గాకుండునని గాని యొప్పుకొనుట కిష్టపడరు. అయినను నమ్మకములును నియమములును పూర్ణుఁడైన మానవుని ప్రకృతిలో నెంతవఱకుఁ జేరియున్నవో అంతవఱకుఁ గోరికలును బ్రవృత్తులును గూడఁ జేరియున్నవి. బలవంతములైన ప్రవృత్తులకుఁ దుల్యభావము సరిగ లేనప్పుడు మాత్రమే యనగ నొకతరగతి యిచ్ఛలును, మనోవికారములును, బలవంతములై, వానితో సమానముగ నుండవలసిన యితరతరగతివి దుర్బలములై విరమించినపుడు మాత్ర

ముపద్రవకరము గావచ్చును. మానవుల యిచ్ఛలు బలవంతములగుట చేత నే దుర్మార్గమునం బ్రవర్తించుటలేదు. వారి సదసద్విచారశక్తి దుర్బలమగుట చేత నది సంభవించుచున్నది. ప్రవృత్తి ప్రబలముగ మున్నప్పుడు సదసద్విచార శక్తి దుర్బలముగ నుండవలెనను స్వతస్సిద్ధ నియమములేదు. వీని పరస్పర సంబంధమును విచారించిన యెడల నానియమము వేఱువిధముగ నున్నది. ఒకని యిచ్ఛా మనోభావములు మఱియొకని యిచ్ఛా మనోభావములకంటె వివిధములై బలవంతములయి యున్నవని చెప్పినపుడు, రెండవవానియందు మనుష్యప్రవృత్తికుండవలసిన సాధనసామగ్రి యెక్కువయున్నది గనుక నెక్కువకీడుసంభవించినను సంభవింపవచ్చును. కాని యెక్కువ మేలు కలుగుట నిశ్చయము. బలవంతములయిన ప్రవృత్తులనగాం శక్తికిం బర్యాయనామ మేకదా? శక్తి కీడునందుం బర్యవసింపవచ్చును. అయినను బద్ధశక్తుండుసు నిష్క్రియుండును అయినవానికంటె శక్తివంతమైన బ్రకృతివలన నెక్కువ మేలు కలుగవచ్చును. ఎవరియందెక్కువ ప్రవృత్తి యుండునో యది కృషి చేత నెక్కువ బలవంతమగును. వ్యక్తియొక్క ప్రవృత్తు లేయోగ్యతవలన బలవంతములుగను, స్ఫుటములుగను గాంగలవో, యాయోగ్యతవలనే యత్యుత్సాహ పూరితమయిన బుణ్యశీలతయు, యతితీవ్రమయిన యాత్మనిగ్రహమును ఫలింపంగలవు. వీనిని వృద్ధి చేయుట చేత సంఘము తనవిధ్యుక్తమయిన కార్యమును నెఱవేర్చి తన మేలును రక్షించుకొనినదగును. కాని మనుజుల నెట్లు శూరులనుగం జేయనగునో తెలియక శూరత్వమునకుం గావలసిన సామగ్రిని విసర్జించుట చేత నాఫలమును బొందంజాలరు. ఏపురుషుని కోరికలును ప్రవృత్తులును వాని స్వాధీనములో నుండునో యట్లగా వానిస్వయంకృషి చేత వృద్ధిం జెంది నిరూపింపంబడి వాని ప్రకృతిని దెలియజేయుచుండునో యాపురుషునికి శీలము గలదని చెప్పుచుందురు. ధూమయంత్రమున కెంత శీలముండునో, అస్వాధీన యిచ్ఛాప్రవృత్తులు గలవానికి నంతే శీలముండును. ఈ ప్రవృత్తులు మానవునిస్వాధీనములో నుండుటయేకాక బలవంతములై దృఢమైన చిత్తవృత్తికి లోంబడియున్నచో వాని శీలమును దృఢముగనుండును.

ఇచ్ఛాప్రవృత్తులవిషయమునవ్యక్తికి వికాసము కలుగునట్లు ప్రోత్సాహము చేయఁగూడదనినయెడల, సంఘమునకు దృఢప్రకృతిగలవా రక్కఱలేదనియు, నట్టివారెక్కువమంది యుండుటవలన సంఘమునకెక్కువమేలు లేదనియు, సంఘమునందు సామాన్యముగ నెక్కువశక్తి కోరఁదగినదికాదనియుఁ గూడ వాదింపవలసియుండును.

లోకసామాన్య ప్రవృత్తి.

కొన్ని ప్రాచీనావస్థలం దీశక్తులను శిక్షించి నిగ్రహింపగల సామర్థ్యము సంఘమునందు లేకుండెనని చెప్పవచ్చును. ఒకానొకకాలమున వ్యక్తిస్వేచ్ఛాంశ మెక్కువై సంఘశక్తి దానితోఁ బెనఁగులాడుటకష్టతరమైయుండెను. అప్పటికాలమునదృఢకాయులును దృఢమనస్కులు నయినవారియిచ్ఛలను నిరోధింపఁగల శాసనములకు వేనికిని లోఁబడియుండునట్లు వారి నాకర్షించుటకుఁ గష్టముగనుండెను. ఈ కష్టములను దొలఁగించుటకుఁ జక్రవర్తులతోఁ బీఠస్థులు పెనఁగులాడినరీతిని శిష్టస్మృతులు మనుజుని యావద్వ్యవహారమును శాసించియుండెను. వారి ప్రకృతిని నిరోధించుటకు సమర్థములైన సాధనాంతరములు సంఘమునందు లేకున్నందున వారి వ్యవహారమునంతను నిగ్రహించుటకు శిష్టాస్మృతులకు శక్తిని గల్పించిరి. కాని యిప్పుడు సంఘము వ్యక్తికంటెఁ జాలినంత బలవంతమై యున్నది. మానవప్రకృతిలో వ్యక్తియొక్క యిచ్ఛాప్రవృత్తుల బలమెక్కువగునను విపత్తువలన భయముతొలఁగిపోయి వానిబలము తక్కువగునను విపత్తు సంప్రాప్తమైనది సహజ శక్తిచేతఁగాని స్థానబలముచేతఁగాని శాసనములకును నియమములకును గొందఱుపురుషులు నిరంతరము తిరుగఁబడుటకు వీలైన స్థితిలో నుండెడివారు. కనుక వారి మనోవికారములను గఠినమైనరీతిని నిర్బంధించివారి కందుబాటులోనున్న మానవుల క్షేమము లేశమైననిలుచునట్లు కాపాడవలసియుండెను. అప్పటికంటె నిప్పుడువ్యవహారస్థితి చాలమాఱిపోయినది. ఈకాలమందు సంఘములో గొప్పతరగతి మొదలు కొద్దితరగతివఱకుఁ బ్రతిమానవుఁడును భయంకరశత్రువగు శిక్షకుని గన్నులయెదుట నున్నట్లు మెలఁగుచుండును. ఇతరులతో సంబంధించిన విషయములనేగాక స్వవిషయములందుఁగూడఁ ప్ర

తివ్యక్తియు, కుటుంబమును, వారికేదియిష్టమో, వారి ప్రవర్తనశీలముల కేది యనుకూలమో వారిలోనుండు నుత్కృష్టాంశములకు యుక్తముగ నవకాశమిచ్చి యది పెంపొందుట కేది వీలుకలిగించునో దానిని విచారింపరు. వారిస్థితి కేది యనుకూలముగనుండునో, వారితో సమానమైన యుద్యోగ ధనాదులు గల వారు సామాన్యముగ నేమిచేయుచుందురో విచారించుచుందురు. తమకంటె నున్నతపదవి నున్నవారు సాధారణముగ నెట్లు ప్రవర్తింతురోయని కూడ విచారించుచుండుట యెక్కువ యనర్థదాయకము. వారియిష్టమున కనుకూలముగ నున్నదానికంటె నాచారములోనున్నదానిని బుద్ధిపూర్వకముగ నాశింతురని నా తాత్పర్యముగాదు. ఆచారములోనున్న దానికంటె వేఱుదాని యందుఁ గోరిక వారిబుద్ధికిఁ దోఁచనే తోఁచదు. మనస్సుపారతంత్ర్యమై యున్నందున విలాసార్థము చేయుదానియందు సయితము లోకాచారమును బ్రప్రథమమున నాలోచించుచుందురు. సమూహముమీఁద వాంఛలెట్లుండునో వానిననుసరించి సామాన్యముగ జరుగుచుండువానిలో నుండియే కోరుకొని యెదరు. అసామాన్యమైనయభిరుచిని, బ్రవర్తనమును అపరాధములతో సమానముగ వదలివేయుదురు. తుదకు వారిప్రకృత్యానుసారముగఁ జేయకుండెడి కారణముచేత వారికిఁ బ్రవృత్తియను

ఫలము.

నదియే లేకపోవును. వారికిబలవంతములైన యిచ్ఛలుగాని స్వతస్సిద్ధములైన మనోరథములుగాని యుండుట కవకాశము లేకపోవును. స్వీయములైన యభిప్రాయమనోభావములు వారిమనస్సున సాధారణముగఁ బుట్టనే పుట్టవు. మానవప్రకృతి యిటువంటి స్థితిలోనుండుట యపేక్షణీయమా, యనపేక్షణీయమా?

కాల్వినుల మతము.

కాల్వినుసిద్ధాంతము ప్రకార మీస్థితియపేక్షణీయమే. దానిలో మానవునకు స్వతంత్రమైన చిత్తవృత్తి యుండుటయే యన్నిటికన్న నెక్కువైన మహాపరాధము. మనుష్యులకు లభింపఁగలిగిన మేలంతయు విధేయతలోనున్నది. స్వతంత్రేచ్ఛ యుండఁగూడదు. ఆచారమొకవిధముగనే యుండవలెను. తద్భిన్న

మనాచారమని పించుకొనును. విధ్యుక్తముగాని దంతయు పాపమే. మానవప్రకృతి సమూలముగఁ బాపభూయిష్ఠమైనది గనుక నాప్రకృతిని లోలోపల నాశముచేసిననే కాని యెవరికిని మోక్షములేదు. ఈసిద్ధాంతము నవలంబించినవాని దృష్టికి మానవుని శక్తిసామర్థ్యయోగ్యతా వినాశమొకకీడుగనుండదు. ఈశ్వరేచ్ఛకు లోఁబడుటకుఁ గావలసిన శక్తితప్ప వేఱుశక్తి మానవునకక్కఱలేదు. అతనిశక్తుల నీశ్వరేచ్ఛగా గ్రహింపఁబడిన దాని నెక్కువ సాఫల్యముగ నెఱవేర్చుట యందుఁగాక యితరనిమిత్తమున వినియోగపఱచుటకంటె నవిలేకున్న నెక్కువ మేలుగనుండును. ఇట్లని కాల్విను సిద్ధాంతము బోధించుచున్నది. ఈసిద్ధాంతమునే కాల్వినులము గామని చెప్పుకొను నారసేకులు లఘురూపమున నవలంబించుచున్నారు. ఈశ్వరునిచిత్తమని చెప్పినదానికి తక్కువ వైరాగ్యముగ నర్థముచేసి మానవులు కొన్ని యిచ్ఛలను తృప్తిపఱచుకొనుటకూడ నీశ్వరేచ్ఛయే యనిచెప్పి పైసిద్ధాంతమునకు లఘుత్వకల్పనము చేసియున్నారు, కాని,మానవులు విధాయకమార్గమున ననఁగాఁ బ్రమాణప్రకారము వారికి విధింపఁబడినరీతిని దప్ప వేఱుగ వారికేఁదోఁచెడిరీతిని యిచ్ఛాపూర్తి చేసికొనఁ గూడదు శాస్త్రీయమైన రీతి స్వాభావికముగ నందఱకు నొకటిగనే యుండును.

ఆక్షేపము.

ఇట్లు పయినిజెప్పిన సిద్ధాంతమునకుఁ గపట వేషము వేయుటవలనఁ బ్రస్తుతమీక్షుద్రమగు జీవితపద్ధతి ననుసరించు మనోవృత్తియు, దాని నాశ్రయించుటవలనఁ బీడ్యమానమైన కృపణవృత్తియుఁ బ్రబలమైనవి. మానవులిట్లు సంబాధితులయి యల్పులై యుండుట ఈశ్వరనిర్ణయమని నిష్కపటముగ భావించువారు నిజముగఁ జాలమంది గలరు. వృక్షములు స్వభావసిద్ధమయిన రీతినుండక జంతురూపమున గాని లేక హ్రస్వముగనుండునట్లు గాని కత్తిరించిన నెక్కువబాగుగ నుండునని తలంచువారివలె వీరు మానవులను గూర్చి తలంచుచున్నారు. సృష్టికర్త మంచివాఁడను నమ్మకము మతాంశమే యయిన యెడల, ఆయన మను

ష్యునకుఁ బ్రసాదించిన శక్తుల నన్నిటిని మూలచ్ఛేదముచేసి నాశము నొందింపక కృషిచేసి వికాసము నొందించుటయు సృష్టికర్త కుద్దేశమనియు, జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు వృద్ధిఁజెందిన కొలఁదిని యాశక్తులు సూచించు పరమావధికి సృష్టపదార్థములు సమీపించిన కొలఁదిని ఆయనకానందమగుననియు నచ్చుట మతమునకెక్కువ యనుకూలముగనుండును. కాల్విను సిద్ధాంతరీతిని భిన్నముగ మానవులు జెందఁదగిన ప్రశస్త్యాదర్శము మఱియొకటి గలదు. ఈదృష్టిప్రకారము మానవునకుఁ బ్రసాదితమయిన ప్రకృతికి నిగ్రహముకన్న వేఱుప్రయోజనములు కలిగియున్నవి. మనుష్యుని ప్రాశస్త్యములోఁ గ్రైస్తవులు చెప్పురీతి నాత్మవైరాగ్యమెట్లు ముఖ్యాంశమో యట్లులే తన్మతాంతికులు చెప్పురీతి నాత్మప్రతిజ్ఞయు ముఖ్యాంశమే. ప్లేటోయును, క్రైస్తవులును ఆత్మసంయమనము పరమావధియని ప్రబోధించుచున్నారు. గ్రీకులాత్మాభివృద్ధి పరమావధియనియుపదేశించుచున్నారు.

గ్రీకులమతము

మొదటిది రెండవదానితో సమ్మిశ్రమము కావలెనేకాని దానిని దొలఁగించి యాస్థానము నాక్రమించుకొనుటకు వీలులేదు. ఆల్సిబియాడీసు యగుటకంటె జానునాక్సును బోలియుండుట ప్రాశస్త్యము గావచ్చునుగాని పెరికిలీసునుబోలియుండుట రెంటికంటె నెక్కుడుప్రాశస్త్యము. ఆ పెరికిలీసు ఈకాలమందుండినయెడల జానునాక్సుతో నుండు ప్రశస్తాంశమేదియు నతనియందు లోపించి యుండదు.

ఇతరుల స్వత్వలాభములతో సంబంధించిన పరిమితిలోపల వ్యక్తివిశేషమును ప్రోత్సాహపఱచి వృద్ధిఁజేయుట వలన మానవులు చెందెడు స్థితి ఘనముగను మనోహరముగను భావింపఁదగి యుండును గాని యందఱును సమానరూపమును బొందునిమిత్తము వారివిశేషలక్షణమును హరింపఁజేయుట వలన వారి కట్టిస్థితి కలుగఁజాలదు. శీలమెప్పుడును గార్యములయందుఁ బ్రతిఫలించుచుండును. కనుక నీపయిని జెప్పిన పద్ధతివలననే మానవుల జీవితము రసవంతమై బహుప్రకారముల నుత్సాహజనకమగును. ఈపద్ధతి

వ్యక్త్యాత్మాభివృద్ధుల భేదములు

వలననే యుత్కృష్టమైన తలంపులకును భావములకును గావలసినంతపుష్టిగలిగి జాతికమితమైన గౌరవమును గలిగించి యాజాతిలోఁ జేరిన వ్యక్తికిని, దానికిని గలసంబంధమును బలపఱచును. వ్యక్తియభివృద్ధి చెందినకొలఁదిని స్వవిషయమున కెక్కువ ప్రయోజనకారియై తన్మూలమున నితరులకు నధిక లాభకారి కాఁగలడు. ఇట్లు వ్యక్తియందు జీవము హెచ్చగును గనుక ననేకవ్యక్తులు చేరి యేర్పడిన సమూహమునందును జీవము హెచ్చుగనుండును. ఇతరుల స్వత్వములకు భంగము కలుగకుండ మానవులలో బలవంతుల నాఁపుచేయుట కగత్యమయినంత యొత్తుడు చేయక తప్పదు. ఈయొత్తుడునకుఁ దగినంత ప్రతిఫలము మానవజాతియొక్క యభివృద్ధి రూపమునఁ గలుగుచుండును. ఇతరులకు హానిని గలిగించి తన యిచ్ఛలను నెఱవేర్చుకొనకుండ నిరోధించుటవలన వ్యక్తియొక్క యభివృద్ధికిఁ గావలసిన సాధనములు కొన్ని లోపించుచున్నవి. ఆసాధనము లితరుల యభివృద్ధికి హాని కలిగించిననేకాని ముఖ్యముగ సిద్ధింపనేరవు వ్యక్తియందలి స్వలాభాంశము నరికట్టుటవలన గలిగెడు నష్టమునకుఁ బ్రతిగ సాంఘికాంశ మెక్కువ చక్కఁగ వృద్ధియయి సంపూర్ణప్రతిఫలమును బొంద సాధ్యమగుచున్నది. ఇతరులనిమిత్తము న్యాయశాసనములకు దిట్టముగ లోఁబడి యుండుటవలన వారి మేలుతో సంబంధించి మనోభావములును శక్తులును వృద్ధియగు చుండును. కాని వారిమేలుతో సంబంధింపని విషయములలో వారి యనాదరమునకు మాత్రము బద్ధులయినచో నుపయోగమయిన శక్తియేదియు వృద్ధిఁ జెందఁ జాలదు. ఒకవేళ నీబంధమును ద్రెంచుకొనుటకేమయిన ప్రయత్నము చేసినయెడలఁ దత్సంబంధమైనశక్తి వృద్ధిఁ జెందియుండవచ్చును. లేకదానికి లోఁబడిన యెడలఁ బ్రకృతియంతయుఁ జాకచక్యము చెడి మందగించిపోవును. ప్రతిమానవుని ప్రకృతికిని న్యాయమయిన యవకాశ మిచ్చెడినిమిత్తము వివిధజనులు వివిధరీతుల జీవించుటకు స్వాతంత్ర్యము ముఖ్యముగ నుండవలెను. ఈస్వాతంత్ర్యమేయుగమందున హెచ్చుగ ననుష్ఠింపఁబడెనో యాయుగము తరువాతితరములవారి కందఱకును స్మరణీయముగ నుండెను. వ్యక్తికి భంగము లేనంత

వఱకు నిరంకుశ ప్రభుత్వము వలనఁగలిగెడు నుపద్రవము సంపూర్ణము కాతే వని చెప్పవచ్చును. ఈశ్వరేచ్ఛయనినను, మానవశాసనమనినను, మఱియే యితర పేరు పెట్టినను, దేనివలన వ్యక్తిత (individuality) నశించుచున్నదో యదియే యథార్ధమున నిరంకుశాధికారము.

**వాద శేష సూచన.**

ఇంతవఱకు వ్యక్తికిని అభివృద్ధికి నభేదమును జెప్పి వ్యక్తితాభివృద్ధివలననే మానవు లభివృద్ధి చెందుదురనియు, లేక చెందఁగలరనియు సాధించియుంటిని. ఇఁక నీవాదమును ముగింపుచేయవచ్చును. ఎందుకన, మానవులు పొందఁగలిగిన శ్రేష్ఠత్వమును వారికిసంపాదించునని చెప్పుటకంటె నేవ్యవహారస్థితిని గూర్చియైన నెక్కువగవర్ణింపసాధ్యము గాదు. ఈశ్రేష్ఠత్వప్రాప్తికాటంకమును గలిగించునని చెప్పుటకంటె నేశ్రేయోనర్థకమును గూర్చియుఁ జెప్పఁదగిన యెక్కువహీనప్రసంగ తేమియు నుండఁజాలదు. అయిన నెవరికెక్కువ యగత్యముగ నొప్పింపవలసియున్నదో వారిని ఒప్పించుటకీహేతువులు చాలవు. అభివృద్ధిఁజెందని వారికిఁ జెందినవారివలన నుపయోగముగలదనియు, స్వవిషయమున స్వాతంత్ర్యమును గోరక యదిలభించినను భుక్తపఱచుకొనక యూరకుండెడి వారికి దానిని నిరాటంకముగ నితరుల నుపయోగపఱచుకొన నిచ్చుట వలన లాభముకలుగుననియు స్పష్టముగఁ జూపింప వలసియున్నది.

**విశేష బుద్ధిప్రాభవ కార్యస్వాతంత్ర్యములలక్షణము.**

నేను మొట్టమొదటఁ జెప్పునదేమనిన, మొదటితరగతివారు రెండవతరగతివారినుండి నేర్చుకొనవలసిన సంగతులుకొన్ని యుండవచ్చును. మానవుల వ్యవహారములలోఁగల్పనాశక్తి ప్రశస్తాంశము కాదనియెవరును జెప్పరు. నూతన సత్యములను గనుఁగొని పూర్వపక్షములైన సంగతులను జూపించుటయేకాక నూతనాచారములను బ్రారంభముచేసియెక్కువజ్ఞానయుక్తమైనప్రవర్తనమునకును, అభిరుచికిని వివేకమునకును బ్రదర్శకులైయుండు మానవులెప్పుడును అగత్యము. ప్రపంచమిది వఱకే సర్వవ్యవహారములయందును సమస్తరీతులను బరిపూర్ణత్వము నొంది

యున్నదని నమ్మెడువాఁడు తప్ప మఱెవ్వఁడును దీనికాక్షేపము చేయఁడు.
ప్రతిమానవుని వలన నీలాభము సమానముగఁ గలుగఁజాలదు. సంస్థాపన
మైయున్న యాచారముకంటెఁబ్రశస్తమని స్వీకరింపఁ దగిన యాచారము
లను సృష్టింపఁగలవారిసంఖ్య మానవజాతి సంఖ్యను బట్టి చూచినప్పుడు బహు
స్వల్పముగ నుండును. అయినను వీరు లోకమునకుఁ బ్రాణము వంటివారు.
వీరులేనిచో మానవులజీవము పల్వలోదకమువలె నసహ్యాకరమగును. వా
రింతకుఁ బూర్వములేనటువంటిమంచిసంగతులను గల్పించుటయేకాక యదివఱ
కుండియున్న వానిప్రాణమును గూడఁగాపాడుచుందురు. క్రొత్తగ నిర్మా
ణము చేయవలసిన సంగతియేదియు లేకపోయినదని కొనినను, మనుష్యుని
బుద్ధి యనగత్యమైపోవునా? ప్రాచీన వ్యవహారమందుండువారు వానినేలయా
చరించు చున్నారో, మఱచిపోయి మనుష్యమాత్రులుగనుండక పశుప్రాయు
లుగ నాచరించుచుండుటకిది హేతువుకానేరదు. శ్రేష్ఠతరములైన నమ్మకము
లును, ఆచారములును గూడభ్రష్టములై యంత్రములకరణి నడచుచుండెడి
ప్రవృత్తి యతి విస్తారముగనుండియున్నది. ఆనమ్మకములయొక్కయుయాచా
రములయొక్కయు హేతువులు కేవల పౌరాణికములు గాకుండఁ గాపాడు
టకుఁ గల్పనాశక్తిగల పురుషులు నిరంతరపారంపర్యముగ లభించిననేకాని,
యిట్లు నిర్జీవమై పోయినసంగతి యేమాత్రము సారవంతమైనసంగతిని గొంచె
మైనను బ్రతిఘటింపఁజాలదు. ఇట్లయినచో బైజాంటియన్ రాష్ట్రమునం
దుఁదటస్థించినట్లే నాగరికత నశించిపోకుండుటకుఁ గారణముండదు. బుద్ధిప్రా
భవముగలిగిన పురుషులు బహుశా యెల్లప్పుడును బహుస్వల్పముగ నుండుట
నిజము. కాని వారులభింపవలెననిన వారియభివృద్ధికిఁదగినరీతి నాప్రదేశమును
జక్కఁగనుంచుట యావశ్యకము. బుద్ధిప్రాభవము స్వాతంత్ర్యభూయిష్ఠమైన
యావరణమందు మాత్రమే ధారాళముగ విహరింపఁజాలును. బుద్ధిప్రా
భవము గలవారియందు విశేష సత్వ ముండుటవలన వారు తక్కినజనుల
కంటె విలక్షణముగ నుందురు. కానఁ బ్రవర్తనమును నిరూపించుకొనుశ్రమలే
కుండ జనులనిమిత్తము సంఘమేర్పాటు చేసిన స్వల్పమైనమాదిరిని వీరను స

రించుటకు సాధ్యముకాదు. అట్లనుసరించుటవలన వారికిఁగలిగెడు సంకోచము హానికరము గాకమానదు. పిల్లకివార్రై యీమాదిములలో దేనియందైన నిమిడియుండుటకు వారొప్పుకొని యొత్తుడు కలుగుటవన వృద్ధిఁజెందుటకు వలనుపడని యంశము నంతను వృద్ధిలేకుండ వదలి వేసినచో సంఘమునకు వారి బుద్ధిప్రాభవమువలన లాభ మేమియుఁగలుగ నేరదు. వారు బలవత్తరమైన సాంఘిక నిర్బంధనములను భేదించుకొనిన యెడల సంఘము వారిని సామాన్యరీతిలో నుంచలేనందునకు వారిని విపరీతమైన భ్రమాశీలత నొందలైన వానికి నివర్తనము గఁజూపించుచుండును. ఈచర్య "నయాగరనది" "డచ్చికాలువ"వలె గట్టులమధ్య సౌమ్యముగఁ బ్రవహించ లేదని విలపించినట్లులుండును. కనుక బుద్ధిప్రాభవముయొక్క ప్రాముఖ్యత నేమి, అదిమనోవిషయమునను, ఆచరణవిషయముననుగూడ ధారాళముగవికసింపనవకాశావశ్యకత నేమి, పృథముగఁ బ్రతిపాదించుచున్నాను.

కల్పనాశక్తియొక్కయావశ్యకత

ఈసంగతిని వాదమందెవ్వఁడును నిరాకరింపఁడనినాకుఁ దెలియును. కాని యథార్థమందు దాదాపుగఁ బ్రతిమనుజుఁడును దానివిషయమై కేవల ముపేక్షితుఁడై యున్నాఁడనికూడ నాకుఁదెలిసినవిషయమే. ఒకహృదయరంజకమైన కావ్యమును రచించుటకును జిత్తరువును లిఖించుటకును బుద్ధిప్రాభవము మంచిదేయని లోకులుతలంచుచుందురు. కాని, యథార్థమున మానసికకాయికములయందుఁ గల్పనాశక్తియద్భుతముకాదని చెప్పకపోయినను దాదాపుగ నందఱు నట్టికల్పనాశక్తి లేకుండఁగనే హాయిగనుండఁగలమని లోలోపలఁ దలంచుచుందురు. ఆదేమి దురదృష్టమోకాని యాభావన బహుసహజముగ నున్నది. లేనిచో నాశ్చర్యజనకముగ నుండకమానదు. కల్పనాశక్తివిహీనులకు దానిప్రయోజనము బొత్తిగఁగానుపింపదు. దానివలననేమి లభింపఁగలదో వారుచూడఁజాలరు. నిజముగ వారికెట్లుచూడనగును? వారుదానిఫలమును జూడఁగలిగినచో నదికల్పనాశక్తియే కాకపోవును. అంధప్రాయులుగ నున్నవారి నేత్రములను విప్పుటయే కల్పనాశ

క్తికిఁ బ్రిథమప్రియోజనము. కన్నులనొకసారి పూర్ణముగ విప్పినపిమ్మట వారుకూడ కల్పనాశక్తియుక్తులగుటకవకాశము చిక్కును. అంతపర్యంతము లోకములో నేదిజరిగియుండినను దానిని బ్రిప్రిథమునవెవఁడో యొక్కపురుషుఁ డాచరించి యుండవలయును గదాయనియు, లోకములోనున్న మంచి సంగతులన్నియుఁ, గల్పనాశక్తిఫలమే యనియు జ్ఞప్తియందుంచుకొని,యాశక్తినిర్వహింపవలసిన విషయమింకను గలదని వినయముతో నమ్మియుండవలెను. కల్పనాశక్తియొక్క యావశ్యకత వారికెంత తక్కువగఁ గనుపించుచుండునో యథార్థముచేత దానియావశ్యకతయంత యెక్కువగనుండునని నిశ్చయముగ నమ్మవలసియుండును.

**వ్యక్తిసర్వశ్రేయము నకునుజన్మభూమి.**

బుద్ధిప్రాభవమునిజమైనను, ఆభాసమైనను, దానికిగౌరవముచూపించుచుందురు. అధమము చూపించెదమని చెప్పనైనఁజెప్పుదురు. కాని, యిల్లింతమట్టుకు జరిగినను యథార్థముచేత మానవకోటిలోసామాన్యులకే యధికారము హెచ్చగుచుండుట లోకప్రవృత్తియై యున్నది. పూర్వచరిత్రములోను, మధ్యకాలములోను గ్రమక్రమముగఁ గొంతతక్కువయైనను, సామంతరాజపద్ధతి మొదలు ప్రిస్తుతకాలము వఱకును జరిగిన గొప్ప మార్పునందు వ్యక్తిశక్తిమంతమైయుండెను. వ్యక్తియధికశక్తిమంతమైనప్పుడును, ఉన్నతపదవి నొందినప్పుడును, గొప్ప యధికారసంపన్నముగనుండియుండెను. ప్రస్తుతకాలమున వ్యక్తులు సమూహ ... నం దంతరించిపోవుచున్నవి. రాజకీయమందు వ్యవహారమంతయు ... కాభిప్రాయమునుబట్టి నడచుచుండునని చెప్పుటనిరర్థకము. ఇప్పుడెన్నికైవచ్చు నధికారమంతయు సామాన్య జనసమూహమునందును, వారికోరికలను బ్రివృత్తులననుసరించి నడచుకొను పరిపాలకులయందును మాత్రమేయుండియున్నది. ఇదిలౌకిక వ్యవహారమునందెట్లో స్వీయమైన నీతిసాంఘిక సంబంధములందు నట్లే జరుగుచున్నది. లోకాభిప్రాయ మనుదానిలో లోకులుమాత్రి మెల్లప్పుడు నొక్కవిధము వారైయుండరు. వా రమెరికాదేశములో శ్వేతము

ఘులై యుందురు, ఇంగ్లాండులో నడిమితరగతి వారై యుందురు. అయినను మొత్తముమీఁద నెప్పుడును నడిమితరగతి జనసమూహమై యుండును. ఇంతకంటె విచిత్రమైన సంగతియేమనఁ, నీసమూహము ప్రస్తుతమున మతాధికారులనుండి గాని, ప్రభువులనుండి గాని, నాయకులుగఁ గాన్పించువారినుండి గాని, లేక గ్రంథములనుండి గాని, యభిప్రాయములను గ్రహించుటలేదు. వారియాలోచనమంతయుఁ జాలమట్టుకు వారితోఁ దుల్యులైన వారివలన నడపింపఁ బడుచున్నది. వీరుపత్రికలమూలమున సమూహమునకు బోధచేయుచు, వారిపేరు పెట్టుకొని తాత్కాలికముగ మాటాడుచుందురు. ఇదియంతయు నాకుఁ గంటకము కాదు. మానవబుద్ధి ప్రస్తుతపుహీనస్థితిలో నున్నంతవఱకు సామాన్యముగ నింతకంటె నెక్కువగ సంగతి కవకాశమున్నదని నేను చెప్పఁ జాలను. కాని నడిమితరగతి జనులుచేయు పరిపాలనము నడిమితరగతి పరిపాలనముగనే యుండకమానదు. ప్రజాస్వామికము నందును, బహుతరమైన యభిజనస్వామికమందును ప్రభుత్వము వహించిన యధికసంఖ్యాకు లుత్తమ యుగములయందుఁ దమకంటె నధికజ్ఞానసామర్థ్యముగలయొకనియొక్క గాని, లేక కొద్దిమంది యొక్క గాని, యుపదేశప్రభావముల చొప్పున నడచుకొను చుండిరి. ఇట్లు చేసినప్పుడు తప్ప రాజకీయ వ్యవహారములందును, అభిప్రాయములందును, గుణములందును, బహుజనస్వామికము చేతఁ బ్రోత్సాహము నొందు మనోవృత్తియందునుగూడ, నిదివఱకెన్నఁడును బ్రభుత్వపద్ధతి మధ్యమస్థితిని మించియుండలేదు. అట్లుండుట సాధ్యమును గాదు. యుక్తమైన లేక ఘనమయిన విషయము లన్నియు వ్యక్తులవలననే ప్రారంభింపఁబడినవి. సాధారణముగ మొట్టమొదట నొక్క వ్యక్తివలననే లభించినవి. వేఱు రీతిని జరుగ నసాధ్యము. సామాన్యజనుఁడట్టి ప్రారంభము ననుసరించి ప్రవర్తింపఁగలుగుటయు, ఘనమయిన లేకయుక్తమైన విషయముల కామోదించి బుద్ధిపూర్వకముగ వానిని స్వీకరింపఁగలుగుటయు ఘనకార్యమనిపించుకొనును. లోక పరిపాలనమును బలవంతముగ వహించి లోకుల యిష్టమునకు విరోధముగఁ దన యాజ్ఞాప్రకారము వారు ప్రవర్తించునట్లుల నిర్బం

ధించునంత బుద్ధిప్రాభవముగల బలవంతుని కొనియాడెడు "వీరార్చనము"ను నేనిచ్చోట నామోదించుటలేదు. ఆ వీరుఁడు మార్గమును జూపించుటకు స్వాతంత్ర్యముకన్న నెక్కువ కోరఁగూడదు. ఇతరుల నామార్గమునఁ బోవుడని బలవంతపఱచుటవలన నితరు లందఱ స్వాతంత్ర్యాభివృద్ధులకు భంగము కలుగుటయేకాక బలవంతుఁడుగూడఁ బాడగును. అయినను కేవలము సామాన్య జనసమూహముయొక్క యభిప్రాయములు సర్వత్ర యధికారమును వహించియున్నప్పుడును, అట్లు వహించుచున్నప్పుడును, విచారణ భాగమున నున్నతపదవిఁ జెందినవారు తమ వ్యక్తిప్రాభవము నంతకంత కెక్కువ స్ఫుటముగఁ గనఁబఱచిననేకాని పూర్వోక్తమయిన ప్రవృత్తి కాటంకము గలిగి దిద్దుబాటు కానేరదు. ఇట్టి సందర్భములలో నసాధారణ ప్రజ్ఞావంతుల కాటంకముఁ జేయక, సమూహముకంటె భిన్నముగఁ బ్రవర్తించుటకుఁ బ్రోత్సాహము చేయవలసియున్నది. ఇతర యుగములందు వారు భిన్నముగఁ బ్రవర్తించుటయేకాక పూర్వముకంటెఁ శ్రేష్ఠమయిన రీతిని బ్రవర్తించునప్పుడు మాత్రము ప్రయోజనముండెను. కాని, ఈ యుగములో భిన్నముగఁ బ్రవర్తించెడు దృష్టాంతమువలన ననఁగా యాచారధిక్కారమాత్రముననే ప్రయోజనము గలదు. అభిప్రాయ దాస్యమువలన ధ్వంసవైలక్షణ్యము నింద్యమయినది. కనుక నాదాస్యమును ధ్వంసముఁజేయుటకుఁ గొందఱు విలక్షణముగ నుండుటకు యత్నింపవలయును. ఎప్పుడెప్పు డెచ్చటెచ్చట మనోదార్ఢ్యము విస్తారముగ నుండెనో యా సందర్భమున నిత్యముగ వైలక్షణ్యముగూడ విస్తారముగ నుండెను. బుద్ధిప్రాభవము, మనోదార్ఢ్యము, ధర్మశూరత, యే సంఘమునం దెక్కువయ్యెనో యచ్చట వైలక్షణ్యముగూడ నెక్కువయ్యెను. ప్రస్తుతమున విలక్షణముగ నుండుటకు సాహసించెడివారు బహు స్వల్పముగ నుండుటయే యీ యుగమునకు గొప్ప విపత్తుగఁ గుర్తింపవలెను.

కాలక్రమమున నేవి యాచారములగుట కర్హములో తేలెడునిమిత్తమసాధారణ విషయములకు సాధ్యమయినంత స్వాతంత్ర్యమును, అవకాశ

*భిన్న జీవితములకు ప్రకృతిభేదములను బట్టి వాదము.*

మును, ముఖ్యముగ నియ్యవలయునని నేను చెప్పియుంటిని. కాని కార్యస్వాతంత్ర్యమును, ఆచారధిక్కారమును, శ్రేష్ఠతములయిన ప్రవర్తనములను, సర్వజనాదరణయోగ్యములయిన యాచారములను గల్పించునిమిత్తము మాత్రమే ప్రోత్సాహార్హములు గావు. యథేచ్ఛముగ జీవయాత్రను గడపు స్వాతంత్ర్యము విస్పష్టమయిన బుద్ధిప్రాభవము గలవారికి మాత్రమే కాదు. మానవుల జీవితపద్ధతి యావత్తు నొక్కటేమాదిరిని బట్టిగాని స్వల్పసంఖ్యగల మాదిరులను బట్టిగాని నిర్మాణము కావలసిన కారణ మెంతమాత్రమును లేదు. సామాన్యమయిన ఇంగితమును అనుభవమును గల వ్యక్తికి యథేచ్ఛమయిన జీవితపద్ధతియే శ్రేష్ఠము. అదిస్వభావసిద్ధముగ శ్రేష్ఠమైనను గాకపోయినను స్వేచ్ఛానుసారమగుటచే దానికి శ్రేష్ఠత్వముగలదు. మానవులు గొఱ్ఱెలవంటివారు కారు. గొఱ్ఱెలుసయిత మవివక్షితమైన యొక్కపోలిక నుండవు. ఒకమానవునకుఁ గావలసిన కంచుకమైనను పాదరక్షలైనను సరిగఁ గుదురునిమిత్తము కొలతప్రకారము కుట్టింపవలెను. లేదా సమృద్ధమయిన పణ్యశాలకుఁబోయి సరిగ నిరూపింపవలెను. ఇదిట్లుండ, మానవునకుఁ గంచుకమును గుదుర్చుటకంటె జీవితపద్ధతిని గుదుర్చుట యెక్కువ సులభమా? లేక పాదముల యాకార విషయముకంటె భౌతికాధ్యాత్మికమైన సర్వమునందును మానవులకెక్కువ సమానాకారముగలదా? ఒక్క యభిరుచియందు మాత్రమే మానవులకు భేదము లున్నను వారినొక్కమాదిరినిబట్టి నిరూపింపఁగూడదనుట కా భేదమే చాలినంత హేతువగును. అయినను వివిధజనుల యాధ్యాత్మికాభివృద్ధికి వివిధపద్ధతులు కావలసియున్నవి. ఒక్కవిధమైన శీతోష్ణస్థితియందును, వాతావరణమందును వివిధవృక్షములు చక్కఁగఁ బెరుఁగుటెంత యసాధ్యమో యొక్కవిధమైన నీతిపద్ధతిని వివిధమానవులు చక్కగవృద్ధిఁజెందుటకూడ నంతయసాధ్యము. ఒకరి యాత్మాభివృద్ధి కనుకూలము లైనసంగతులే మఱియొకరికిఁ బ్రతిబంధకములగును. ఒకనికి మంచియుత్సాహజనకమై వాని కర్మేంద్రియ భోగేం

ద్రియములను జక్కఁగఁ గేతి నంచఁగల జీవితపద్ధతియే యింకొకరికి వ్యాకుల హేతువై, భారమై యాత్మాభివృద్ధి నాటంకముఁ జేసి నాశముగూడఁ జేయుచుండును. మనుజుల సుఖదుఃఖహేతువులందును, వివిధములగు నాధిభౌతికాధ్యాత్మికశక్తులు వారిని బాధించురీతియందును, భేదములుండుటంబట్టి యీభేదములకుఁ దగినట్లు వారిజీవితపద్ధతులుగూడ భేదముగ నుండవలెను. లేనిచో వారికిఁగలుగవలసిన సౌఖ్యముకలుగదు. బుద్ధి నీతి రసజ్ఞతా విషయములలో వారికిఁ గలుగవలసిన యభివృద్ధిని జెందరు. కాఁబట్టి యవలంబకుల సంఖ్య హెచ్చుగనుండుటవలన బలవంతముగ నొప్పఁగొనవలసి వచ్చిన జీవితపద్ధతులకును అభిరుచులకును మాత్రము లోకులు సహించియుండుటకుఁ గారణమేమి? సన్యాసులమతములలోఁ దప్ప యితర చోటులందు రుచిభేదములను బొత్తిగ నంగీకరింపకపోలేదు. ఏపురుషుఁడుగాని పడవత్రోయుట, చుట్టకాల్చుట, సంగీతము, వ్యాయామము, చదరంగము, చీట్లాట, చదువుకొనుట, యీమొదలైనవానిలో దేనినైన నాసించినను అసహ్యించుకొనినను వానికి నిందలేదు. ఎందుకన, వీనిని సహించువారును, అసహ్యించుకొనువారునుగూడ, నణఁచివేయుటకు వీలులేనంత యెక్కువగనున్నారు. కాని, యేపురుషుఁడైనను, అంతకంటె నెక్కువగనే స్త్రీయయినను, అందఱుచేయునది చేయకపోయినను, ఎవ్వరుచేయనిదానిని జేసిన, నది మహాపరాధమొనరించినంత నిందాస్పదమగును. తమగౌరవమునకు భంగములేకుండ నిష్టమువచ్చినట్లు చేయు భోగమును పరిపాటిగానైన ననుభవించుటకు బిరుదులనుగాని, యితరయధికారచిహ్నములనుగాని అధికారుల గౌరవముగాని, ఆశ్రయింపవలసి వచ్చుచున్నది. ఈ భోగము కొంచెముమాత్రమేసుమీ. ఎవరైనదాని నెక్కువగ ననుభవించినయెడల వారగౌరవసంభాషణములకు లోనగుటయేకాక, యింకనధిక యుపద్రవమునకుఁ బాలుపడుదురు. వారిని పిచ్చివారని సభాతీర్మానముచేసి వారియాస్తిని వారికిఁ గాకుండఁ జేసిబంధువులకు నిచ్చివేయునంత కీడుకూడ సంభవింపవచ్చును.*

*ఒకమనుష్యుఁడు తనవ్యవహారనిర్వాహణమున కనర్హుఁడని న్యాయస

ప్రస్తుతము లోకాభిప్రాయము వ్యక్తితా ప్రభావమెంతమాత్రమును బయలుపడకుండ విశేషముగ నసహ్యించుకొనెడి గతివైఖరులు గలిగియున్నది. జనసామాన్య మల్పబుద్ధులుగను, అల్పేచ్ఛాపరులుగ నున్నారు. వారియభిరుచులు గాని కోరికలుగాని బలవంతములు కాకపోవుటవలన నసాధారణమయిన దేనిని జేయుటకుఁ గోరుచుండరు. అట్టికోరికలును, యభిరుచులునుగలవారు వారికి దుర్గ్రాహ్యులుగనుండుటవలన వారి నుద్రేకులుగను, ఉన్మత్తులుగను, ఎంచి యసహ్యించుకొను నలవాటుగలిగియుందురు. ఇట్లుసామాన్యముగ జరుగుచుండును. నీతివిషయమున నభివృద్ధికలిగించు నిమిత్తము బలవత్ప్రయత్నము ప్రారంభమై దీనికి జతపడినయెడల నేమి జరుగునో స్పష్టముగ గ్రహింపవచ్చును. ప్రస్తుతమిటువంటి ప్రయత్న మొకటి ప్రారంభమైయున్నది. పరివర్తనమున నెక్కువ క్రమముగ నుండుటకును, మర్యాదాతిక్రమములను దగ్గించుటకును, జాల కృషి జరిగియున్నది. లోకహితేచ్ఛ ప్రస్తుతమున బహుతరముగ వ్యాపించియున్నది. తోడిమానవుల నీతివివేకము లభివృద్ధిఁజేయుటకంటె నీయిచ్ఛకెక్కువ వినియోగమయిన స్థానములేదు- ఇప్పటి కాలప్రవృత్తినిబట్టి లోకులు పరివర్తనవిషయమై పూర్వముకంటె నెక్కువగ

కార్యస్వాతంత్ర్యమునకు సామాన్యప్రవృత్తి వలనఁబ్రతిబంధకము

---

భయందుఁ దీర్మానమొనరించుటకీమధ్యకాలమునఁ బనికివచ్చుచున్న సాక్ష్యపువైఖరి నీచముగను ఘోరముగను నున్నది. ఇట్టిసాక్ష్యము ననుసరించ వ్యాజ్యపు వ్యయములకుఁజాలినంత యాస్తియున్నయెడల నావ్యయములను దానిమీఁద వేసి వానియాస్తి విషయమయి యతఁడుచేసిన యేర్పాటును వానిమరణానంతరమున నిరాకరింపవచ్చును. వానిదినచర్యలోనుండు నల్పాంశములన్నిఁటిని వెదకివెదకిచూచి, ఏనిలో నేసంగతియైనను పరమనికృష్టులైన వారిగ్రహణశక్తిని వర్ణనశక్తికిని సర్వసాధారణముకంటె విశేషముగఁ గానుపించినదానిని సభ్యులయెదుటఁబెట్టి, యాపురుషుఁడు పిచ్చివాఁడని వాదించుచున్నారు. సభ్యులును సాక్షులకంటె నజ్ఞానావివేకములలోఁ దీసిపోని

విధుల నేర్పఱచి, యట్లంగీకారమైన మాదిరిని బట్టి ప్రతిమనుజుఁడును బోవల యునని యత్నము చేయఁగోరుచున్నారు. ఆమాదిరి యొకప్పుడు ప్రకటన మగుచుండును. ఒకప్పుడు దాఁగియుండును. ఎట్లయినను దానిప్రకారము నడచువారికి నిశ్చయమనునది దృఢముగ నుండఁ గూడదు. విశేషప్రవృత్తి లేకుంటయే యీమాదిరికి ముఖ్యలక్షణము. చీనాదేశపుస్త్రీల పాదముల సంకుచితము చేసి వైకల్యము నొందించినట్లే మానవప్రకృతిలో స్ఫుటమైన యంశము నంతను నొక్కిపెట్టి వ్యక్తివిశేషమునకును సర్వసాధారణమైన మనుజునకును స్ఫుటమైన భేదమేమియుఁ గనిపించకుండఁజేయుట యీమాదిరి యొక్క యుద్దేశమైయున్నది.

**దృష్టాంతము. ప్రస్తుత మింగ్లాండు దేశస్థితి.**

ఆవర్ణములోఁ గావలసినదానియందు సగపాలునకవకాశములేకుండఁజేయుటవలన హీనగతిపట్టును. ప్రస్తుత మామోదితమైన యావర్ణప్రకారము దానియందు లోపించిన రెండవభాగము ననుకరించు హీనస్థితిమాత్రమే సంప్రాప్తమగుచున్నది. బుద్ధిదార్ఢ్యమును బట్టి ప్రవర్తించెడు గొప్పశక్తులను, స్వేచ్ఛమైన చిత్తవృత్తిప్రకారమునడచెడు గాఢములైన మనోభావములును, లభించుటకుమాఱుగ, మనోబల బుద్ధిబలములు లేకుండును. అందువలనలోకపద్ధతికి బాహ్యవేష

---

వారగుటను బట్టియు, మానవప్రకృతిని గురించియు జీవితమునుగురించియు, సాంఘికన్యాయవాదములలో నిరంతర మద్భుతముగఁ గాన్పించుచున్న యపూర్వజ్ఞానము న్యాయకర్తలయందుసంపూర్ణముగ నుంటనుబట్టియు, వారు సభ్యులను బోర పెట్టుదురు. కనుక నీవాదము తఱచుగ జయప్రదమగుచున్నది. ఈ విచారణములవలనబట్టి మానవుల స్వాతంత్ర్యమును గురించి పామరాభిప్రాయప్రవృత్తు లెట్లుండునో వర్ణింప మొదలుపెట్టిన ననేక గ్రంథములునిండును. వ్యక్తి స్వాతంత్ర్యమును విలువగలదిగ నెంచక, యితరులతోసంబంధింపని విషయములోఁ బ్రతివ్యక్తియు తన యిచ్ఛావిషయములకు యుక్తమని తోఁచినరీతిని బ్రవర్తించెడు సత్వమును

మున లోఁబడి ప్రవర్తింపఁగల దుర్భరములైన శక్తులును, మనోభావములును సంప్రాప్తము లగుచున్నవి. ఇదివఱకే విశేష దృఢశీలతగలవారి విషయము పురాణగాథయైపోవుచున్నది. ఈదేశములోనిప్పుడు వ్యాపారము తప్ప శక్తినినియోగమునకు వేఱుమార్గము సామాన్యముగఁ గనిపించుటలేదు. వ్యాపారమందు వ్యయపడు శక్తి బహువిశేషమని యెంచవచ్చును. దానిక్రిందఁబోఁగా మిగిలిన దేదియో యొకయభీష్టక్రియయందు వ్యయపడుచున్నది. ఈయభీష్టము లాభకారియైనను లోకహితమైనను గూడ సామాన్యముగ నల్పవిషయమైయుండును. ప్రస్తుత మింగ్లాండు దేశపు గొప్పతనము సంఘమువలన లభించినది. వ్యక్తులుహీనములైనను సంఘీభావము మన కొకయలవాటుగ నుండుటవలన నేడేని గొప్పసంగతిని నిర్వహింప సమర్థులముగఁ గాన్పించుచున్నాము. మన దేశములో నీతి మతవిషయము లందులోకహితపరులింతటితో సంపూర్ణముగఁ దృప్తి నొంది యున్నారు. కాని యింగ్లాండుదేశమున కిదివఱకు గొప్పతనమిట్టి వారి వలన లభించినదికాదు. దానిని హీనస్థితిలోఁ బడకుండఁ బట్టుటకు వేఱు రకముల పురుషులు కావలసియున్నారు.

**ఆచారమువలన ప్రతిబంధకము.** మానవుల పురోభివృద్ధికి నిరంకుశమైన యాచారబలమే యెల్లచోట్లను నిత్యముగ నడ్డమువచ్చుచున్నది. ఇది, దీని (యాచారము) కంటె నుత్తమమైనదేనిని నపేక్షించినను

---

గౌరవింపక, మీఁదు మిక్కిలి న్యాయకర్తులుసభ్యులును ఇట్టిస్వాతంత్ర్యాపేక్షగలవాని నప్రమత్తుఁడుగ గ్రహింపనైనలేకున్నారు. పూర్వకాలమందు నిరీశ్వరవాదులను దగులఁబెట్ట నుద్దేశించినప్పుడు దయాశీలురైన వారు వారిని వాతులాలయమునఁ(mad- house )బెట్టినబాగుగనుండుననిచెప్పెడివారు. ఇప్పు డీప్రకారముజరిగించి యిట్లుచేయుటలో మతవిషయమై హింసింపక యాదౌర్భాగ్యులనింతదయాసహితముగ క్రైస్తవసాంప్రదాయసిద్ధమైన రీతినాచరించుచున్నాము గదా యని సంతోషించుచుండిన నదియొక యాశ్చర్యముకాదు. ఆనిర్భాగ్యులకుఁ దగినపని జరిగెను గదా యనియుఁ గూడవీరు లోలోపల సంతోషించుచుందురు.

యాయపేక్షికిది యెడతెగక విరోధముగనున్నది. ఈకోరికను సందర్భసరణిని స్వాతంత్ర్యాపేక్షయనిగాని శ్రేయోభిలాషయనిగాని చెప్పవచ్చును. శ్రేయోభిలాషయెల్లప్పుడును స్వాతంత్ర్యాభిలాషతో నేకముగాదు. ఎందుకన, జనుల కిష్టములేకపోయినను బలవంతముగనైన శ్రేయోమార్గమునఁ బెట్టుటకు శ్రేయోభిలాష ప్రోత్సాహము కలిగింపవచ్చును. స్వాతంత్ర్యాభిలాషమని వనో, యిట్టిప్రయత్నములనన్నిటిని బ్రతిరోధించుచుండును. కనుకనంతవఱకు దేశకాలావస్థలనుబట్టి శ్రేయమునకు విరోధమైన పక్షమునవలంబింపవచ్చును. అయినను స్వాతంత్ర్యమే శ్రేయమునకవ్యాహతమై శాశ్వతమైన యాధారముగనున్నది. దానివలన నెన్నివ్యక్తులుగలవో యన్ని శ్రేయోదాయకములైనస్వాతంత్ర్యస్థానము లేర్పడుట కవకాశమున్నది. అభివృద్ధి హేతువు స్వాతంత్ర్యాభిలాష రూపమునను శ్రేయోభిలాష రూపమునను గూడ నాచారదాస్యమునుండి విడిపించును. కనుక దాని యధికారమునకు విరోధముగనుండును. ఈరెంటికిని జరుగు పోరాటము మానవుల చరిత్రలో ముఖ్యముగ నాదరణీయమైయున్నది. ఆచారము యొక్క నిరంకుశాధికారము సంపూర్ణముగ నుండుట వలనఁ బ్రపంచములోఁ జాలభాగమున సరియైన చరిత్రలేదనియే చెప్పవచ్చును. తూర్పుఖండమంతయు నీయవస్థయందున్నది. అచ్చట సర్వ

దృష్టాంతము. ప్రాగ్దేశస్థితి

విషయములందు నాచారము ప్రమాణము. ఆచారానుసరణమే న్యాయమును గ్రమమును అగుచున్నవి. అధికార ప్రమత్త తఁజెందిన ప్రజాపీడకుఁ డెవ్వఁడో తప్ప తక్కినవారికాచారప్రమాణమును బ్రతిరోధింపవలెనను నూహాపుట్టనే పుట్టదు. దీనిఫలము కూడ మనకు గోచరమగుచున్నది. అక్కడి జాతులవారికిఁ బూర్వకాలమునఁ గల్పనాశక్తి గలిగియుండవలెను. వారు హఠాత్తుగా బహుసంఖ్యాకులై, బహుకళావిదులై భూమిలోనుండి పుట్టుకొనిరాలేదు. వారు దీని నంతను గృషిచేసిసాధించి యప్పటికాలమునఁ బ్రపంచములోనెల్ల నధికులును బలవంతులు నయియుండిరి. వారిప్పుడెట్టు లున్నారు? వారిపెద్దలు దివ్యభవనములను, ఉజ్జ్వలాలయములను గట్టిం

చిన కాలములో వనచరులైయుండిన వారిసంతతిలోని జాతులకిప్పుడు లోఁబడి యో, వారినాధారపఱచుకొనియో యున్నారు. ఈజాతుల పూర్వులుకేవల మాచారబద్ధులుగాక స్వాతంత్ర్యేఛ్ఛ వృద్ధినిగూడఁ గలిగియుండిరి. ఏ జాతియైనను గొంతకాల మభివృద్ధిఁజెంది పిమ్మట నాగిపోవచ్చునట్లు కాన్పిం చుచున్నది. ఎప్పుడాఁగిపోవు ననఁగా, నాజాతికి వ్యక్తిత యెప్పుడులేక పోవునో యప్పుడే యాఁగిపోవును. యూరోపువాసులకిట్టి మార్పుతటస్థిం చిన యెడల నది కేవల మీయాపనునె పరిణమింపదు. ఈజాతులవారి కాచారపరిభావమువలనఁగలుగఁబోవు నుపదరివము కేవల మచలత్వము గాదు. మార్పున కవకాశముండునుగాని యందఱొక్కసారి మార్పుఁజెందు నట్లు నిరూపించి, వైలక్షణ్యమును నిషేధించును. మనము మనపూర్వుల యొక్క స్థిరములైన వస్త్రధారణ పద్ధతులను త్యజించితిమిగాని ప్రతిమను జుఁడును నిప్పటికిని దక్కినవారి రీతిని వస్త్రధారణముఁ జేయువలసి యున్నది. ఈపద్ధతికూడ సంవత్సరమున కొకటిరెండుసారులు మాఱిపోవ చ్చును. మార్పుకలిగినప్పు డలంకారమును సదుపాయమును విచారింపక కేవలము మార్పుగనే యవలంబింపవలసి యున్నది. ఎందుచేతిననఁ, బ్రపం చమం దందఱకు నొక్కక్షణమున నొక్కవిధమైన యలంకార సదుపాయ భావముపుట్టి, మఱియొకక్షణమున నందఱును యొక్కసారిదానిని విసర్జిం చుట తటస్థింపదు. మనకుమార్పులెట్లో యభివృద్ధియు నట్లే సహజము. యంత్రవిషయములలోఁ గ్రొత్తవానిని గల్పించి వానిస్థానమున కంతకంటె శ్రేష్ఠమైనవి లభించువఱకు వానినే వాడుకచేయుచున్నాము. రాజనీతి, విద్య, ధర్మమ వీనియందభివృద్ధిని గోరుచున్నాము. కాని, నీతివిషయములలో నభివృద్ధియన్నప్పుడు ప్రోత్సాహముచేతఁగాని బలవంతముచేతఁగాని యితరు లను మనతోఁబాటు మంచివారినిగఁ జేయవలసియున్నదని మనముముఖ్యముగ భావించుచున్నాము. మన మభివృద్ధికి యాక్షేపముఁ జెప్పనుసరిగదామీఁదు మిక్కిలి లోకములో నిదివఱకెన్నఁడును మనవంటి యభివృద్ధిశీలురులేరని సంతోషించుచుందుము. వ్యక్తితయే మనకు విరోధమైనది. మన మందఱ

మొక్క తీరున నున్నయెడల నద్భుతకార్యములను జేయఁగలిగినట్లు తలంచుచున్నాము. సామాన్యముగఁ బరస్పరభేదమును బట్టియే యెవరిమాలోని లోపములను వారు మొట్టమొదటఁ దెలిసికొని, యింకొకదాని శ్రేష్ఠత్వమును గనిపెట్టుటయు, రెంటిలోనుండు లాభములను పోగుచే రెంటికంటె శ్రేష్ఠతరమైన మఱియొకదానిని గల్పించుటయు సాధ్యమగుచున్నదని మఱచుచున్నాము. పైనిఁజెప్పఁబడిన విషయమునకు చీనాదేశము దృష్టాంతముగనున్నది. ఆదేశస్థులు చాలవిద్యావంతులును, గొన్నివిషయములలోవిశేషులును గూడనైయున్నారు. వారి యదృష్టవశమునఁ బ్రాచీనకాలమందే మిక్కిలిమంచి యాచారకాండ లభించినది. ఈ యాచారములను మొట్టమొదట నెవరోకొందఱుపురుషులు నిర్మాణముచేసి యుండవలెను. ఇప్పుడు యూరోపులోమిక్కిలిగొప్పవారగుపండితులుకూడ వారినిగొంతవఱకు జ్ఞానులనియుఁ దత్వవేత్తలనియు నొప్పుకొనక తప్పదు. ఇంతియకాకఁ వారికిఁగలజ్ఞానములో శ్రేష్ఠాంశమును సాధ్యమైనంతవఱకుఁ బ్రతిమనుజుని మనస్సున నాటుకొలుపుటకును, ఆ జ్ఞానమును విశేషముగ గ్రహించిన వారికి నుత్కృష్టాధికారపదవి నొసంగుటకునుగూడ వారికిప్రసిద్ధమైన చక్కని సాధనసామగ్రిగలదు- దీనినంతయు సాధించిన మానవులుమనుష్యజాతియొక్క పురోభివృద్ధిరహస్యమును నిశ్చయముగఁ గనిపెట్టియుండవలెను. మఱియు వారు లోకాభివృద్ధికి నిరంతరపురోవర్తులై యుండవలసినవారు. అయినను వారచలత్వమునొంది యనేకవేల సంవత్సరములాయువస్థలోఁబడి యున్నారు. వారికెప్పటికైన నెక్కువమేలు కలుగవలెననిన నది విదేశీయులవలన లభింపవలసియున్నది. వారు జనులందఱయభిప్రాయములను, బ్రవర్తనమును, ఒక్కవిధముగానుండు శాసనములనుసూత్రములనుబట్టి నడపుచుండుటవలన నందఱు నొక్కపోలిక నొందిరి. ఈస్థితిమాఱుటకిఁక నాశలేదు. దానిఫలము నిదివఱకే చెప్పియుంటిని. ప్రస్తుత మింగ్లాండు దేశములో లోకహితపరులు జనులందఱట్టి నిరాశఁజెందిన సామ్యస్థితిలోనికి దీసికొనిరావలయునని మిక్కిలికష్టపడి ప్రయత్నించుచున్నారు. చీనా

దేశములో నేర్పడిన రాజనీతి విద్యాపద్ధతు లెట్లున్నవో ప్రకృతమున యూరోపులోని లోకాభిప్రాయమహిమ యట్లు యున్నది. కాని, దీనికొక నిర్ణయమైనయాకారము మాత్రములేదు. వ్యక్తిత యీదాస్యము మీఁద జయప్రదముగఁ బ్రతిఘటింపఁ గలిగిననే గాని యూరోపుకూడ చీనాకుఁ బ్రతి కానున్నది. ఇక్కడనున్న ప్రాచీనఘనసాంప్రదాయములును గ్రీస్తుమతవిశ్వాసమును దానిని గాపాడఁజాలవు.

ఈ యవస్థనుండి యూరోపు నింతవఱకు రక్షించినదేది? మానవ జాతిలో యూరోపియనుల నచలత్వమునొందక ప్రవర్ధమానముగఁజేసిన దేది? వారిలో నుండు నుత్కృష్ట శ్రేష్ఠత్వము కాదు.

విద్యాప్రవర్తన భేదములే యూరోపు నీస్థితినుండి రక్షించినవి.

ఈ శ్రేష్ఠత్వమున్నప్పుడుగూడ నది కార్యము గాని కారణము గాదు. వారి విద్యాప్రవర్తనలయందుండు యద్భుత భేదములే సరియయిన కారణము. ఇక్కడ నుండువారు వ్యక్తులును, తరగతులును, జాతులును, అత్యంత పరస్పర భేదముగలిగియుండి నానామార్గములను సఫలముగఁ ద్రొక్కియుండిరి. ప్రతి యుగమందును పెక్కుత్రోవలఁ ద్రొక్కువారు పరస్పరసాహాయ్యము లేక యుండినను, ఒకత్రోవను ద్రొక్కినవారు తక్కినవారందఱును దమ దారికి వచ్చునట్లు నిర్బంధించినయెడల మిక్కిలి చక్కగ నుండునని భావించినను, ఒకరి యభివృద్ధికి మఱియొకరు భంగము చేయ యత్నించినను ఇవి యేవియు స్థిరముగఁ గొనసాగకపోవుటవలన నెల్లవారును దక్కినవారిలోనుండు మంచిని గ్రహించువఱకు నిల్చియుండఁగలిగిరి. ఈ బహుప్రకారత్వమువలననే యూరోపుఖండము సతతప్రవర్ధమానమై నానాప్రకారమైన యభివృద్ధిని జెందినదని నా యభిప్రాయము. అయిన నీ లాభ మిదివఱకే

ప్రస్తుతోపద్రవము.

చాలమట్టుకు క్షీణింప మొదలు పెట్టిచీనావారిపద్ధతి గా ; సర్వజనుల నేకరీతిగ నుంచుగతి నిశ్చయముగఁ బట్టియున్నది.

ఎమ్. డీ. టోకువిల్లు రచించిన ముఖ్యగ్రంథములలోఁ

జీవరదానియందు వెనుకటితరమునకంటె నీ తరమున ప్రేమించివారెంత యెక్కువగఁ బరస్పరానురూపులై యున్నారో చెప్పియున్నాఁడు. ఈ సంగతి యాంగ్లేయులవిషయమున మిక్కిలి యెక్కువగ వర్తించుచున్నది. విలెహంవాన్ హోంబోల్టునుండి యిదివఱకు నే నుదాహరించిన గ్రంథభావమునందిట్లు నుడివియున్నాఁడు. స్వాతంత్ర్యమువలనను, సందర్భభేదము వలనను పరివర్తనభేదము లవశ్యము కలుగుచుండును. కనుక నవి రెండును మానవుల యభివృద్ధి కవశ్యములైన నిబంధనలుగ వర్ణించియున్నాఁడు. వీనిలో రెండవ దీదేశమున యనుదినమును క్షీణించుచున్నది. వివిధవ్యక్తులను, తరగతులను, పరివేష్టించి వారి ప్రవర్తనములను నిరూపించు వృత్తాంతములు దినక్రమమున నేకరూపము నొందుచున్నవి. వివిధములగు తరగతులును, వాడకట్టులును, వృత్తులును, వ్యాపారములును బూర్వమున భిన్నప్రపంచములందుండెననియుఁ బ్రస్తుతమునఁ జాలవఱ కేకప్రపంచమున నుండెననియుఁ జెప్పఁదగియున్నది. వారిప్పు డొక్కదానిని జదివి, యొక్కదానిని విని, యొక్కదానిని జూచి, యొక్కప్రదేశము నాశ్రయించి, యొక్కవస్తువు నాకాంక్షించి, యొక్క విధమైన భయముఁగలిగి, యొక్కతరగతి స్వత్వస్వాతంత్ర్యములఁ జెందియుండి, వానిని సాధించుట కొక్కటేవిధముగా సాధనములనుగలిగియున్నారని పోల్చి చెప్పవచ్చును. అవస్థాభేదములింకను చాలవఱకు మిగిలియున్నను, నశించినవానితోఁ బోల్చినపు డవి లేనట్లే చెప్పవచ్చును. ఈ సమీకరణమింకను వృద్ధిలోనున్నది. ఈయుగమున

ఉపద్రవ ప్రోత్సాహక హేతువులు.

క్షీణదశయందున్న వారిని లేవనెత్తి ఉచ్చదశయందున్న వారిని గ్రిందికి లాగుటవలన రాజకీయములయిన మార్పులన్నియును జనులను సమానప్రభావాధీనులనుజేసి, వారిని సామాన్యాభిప్రాయసంగతి సంపన్నులను జేయుటవలన విద్యాభివృద్ధియు, వివిధదేశవాసులకు సమావేశముఁ గలిగించి, వాసస్థానముల మార్పులకుఁ బ్రవాహతుల్యమయిన నిరంతరవేగమును గల్పించుటవలన సమాగమసాధనాభివృద్ధియు, సదుపాయ లాభముల నెక్కువ విరివిగ

వ్యాపింపఁజేసి, వాంఛితవస్తువులలో నుత్కృష్టములయిన వానిని సయితము
సర్వజనులును గోరి యత్నించుటకు సాధ్యముచేసి, యొకతరగతివారు
మాత్రముకాక యన్నితరగతులవారును ఉచ్చస్థితిని జెందవలెనను కోరికను
బుట్టించుటవలన నిర్మాణవస్త్వభివృద్ధియుఁ బైనిఁజెప్పిన సమీకరణమునకుఁ
దోడ్పడుచున్నది. మానవులలో సమీకరణమును బుట్టించుటకు వీనినన్నిటి
కంటె బలవత్తరమయిన హేతు వింకొకటి గలదు. ఈ దేశములోను, దీని
వంటి స్వాతంత్ర్యముగల యితరదేశములలోను, రాష్ట్ర వ్యవహారమందు
జనాభిప్రాయబల మీ హేతువైయున్నది. సంఘములో నున్నత పదవుల
నాక్రమించినవారికి జనాభిప్రాయ ధిక్కారముచేయు సామర్థ్యమును గలి
గించిన పదవులు క్రమముగ నేలపాలయినకొలఁదిని, జనాభిప్రాయమొకటి
యున్నదని నిశ్చయముగఁ దెలిసినప్పుడు దానిని బ్రతిఘటింపవలె ననెడు
భావ మధికార పురుషుల మనస్సులలో నంతరించినకొలఁదిని భిన్నత్వమునకు
సాంఘికమయిన యాధారమంతరించుచున్నది. బహుసంఖ్యాకుల యధికా
రమును బ్రతిఘటించి, జనాభిప్రాయ విరుద్ధములయిన యభిప్రాయప్రవృత్తుల
నాచరింపఁ గుతూహలముఁగల సారవంతమయిన శక్తి యేదియు సంఘమునందు
లేకుండ నశించుచున్నది

ఈ కారణములన్నియుఁగూడి వ్యక్తితకు విరోధమయిన మహాత్వ
ముగల పెద్ద మొత్తముగ నేర్పడుటంబట్టి వ్యక్తిత యెట్లు నిలువఁబడగలదో

తరుణోపాయము

సులభముగఁ గానరాకున్నది ఈ కష్ట మింకను యెక్కు
వగుచుండును. కానఁ బ్రజలలోఁ దెలివిగలవారికి
వ్యక్తితయొక్క విలువను దెలియఁబఱచి భేదములు
శ్రేయస్కరములుగాకున్నను వారికొకవేళ కొన్ని నష్టములుగఁ గాన్పించినను
భేదములుండుట మంచిదని వారికిఁ జూపవలసియున్నది. అప్పటి కింకను
సమీకరణము బలవంతముగఁ బూర్తికాకుండుటంబట్టి వ్యకితయొక్క స్వత్వ
ములను బ్రతిపాదించుట కిదియ సమయము. ప్రథమావస్థయందు మాత్రమే

యీ యన్యాయాక్రమణమువిూఁది ప్రతిఘటనము జయప్రదముగఁ బాదుకొనఁ గలదు. మనవలెనే యితరజనులుకూడ నుండవలెనను కోరిక సఫలమయిన కొలఁదిని హెచ్చగుచుండును. జీవితములు దాదాపుగ నొక్క సామాన్య వైఖరిలో దిగెడు పర్యంతము ప్రతిఘటింపక యూరకుండినయెడల నావైఖరిని దప్పిన మార్గములన్నియు యధమముగను, అవినీతిగను, విపరీతముగను, అసహజముగనుగూడ నెంచఁబడును. మానవులకు భిన్నత్వము కొంతకాల మగపడకుండఁ బోయినయెడల వారికి భిన్నత్వము శీఘ్రకాలములోనే దుర్గ్రాహ్యమయి పోవును



# అధ్యాయము IV.

## వ్యక్తి వ్యాపారములో సాంఘికాధికార పరిమితి విషయము.

**వ్యక్తిస్వాతంత్ర్యపరిమితి.** ఇఁక వ్యక్తిస్వాతంత్ర్యమునకుఁ గ్రమమైన మితియేది? సాంఘికాధికారమునకుఁ బ్రారంభ మెక్కడ? మానవజీవితములో వ్యక్తిభాగ మెంత? సాంఘికభాగ మెంత?

దేని కధికముగ సంబంధించిన విషయములో దానిని జక్కఁగ నిరూపింపవచ్చును. వ్యక్తికిముఖ్యముగ నభినివేశముగలయంశము వ్యక్తిభాగముగను, సంఘమునకు నెక్కువఁగ నభినివేశముగలభాగము సాంఘికభాగముగ నుండవలయును.

సంఘ మొకసమయమును బట్టి నిర్మాణమైనది కాదు. ఇప్పుడొకసమయమును గల్పించి తన్మూలమున సాంఘిక విధుల నన్నిటిని నిర్ణయించుట వలన లాభమేమియు లేదు. అయినను బ్రతి మనుజుఁడును సంఘ సంరక్షణము పొందుచున్నాఁడు. కనుక నాలాభమునకుఁ బ్రతిఫలముగఁ దానున్న సంఘములో నితరులయెడ నొక విధముగఁ బ్రవర్తింపవలసిన బాధ్యతఁ గలిగియున్నాఁడు. ఈ ప్రవర్తనములో మొదటి యంశము; ఒకరి లాభమున కొకడు నష్టము చేయఁ గూడదు. అనగాఁ జట్టముల వలన స్పష్టమైనను, లేక అస్పష్టముగ నిర్ణయమైనను, ఆలాభము నంత నీవిషయమున వారి స్వత్వమని యెంచ వలెను. రెండవయంశము; సంఘసంరక్షణార్థము గాని లేక సంఘములోని వారికిఁ దొందరలును, విపత్తులును, సంభవింపకుండఁ గాపాడుటకు గాని జరిగెడు కష్టనిష్ఠురములలోఁ బ్రతి మనుష్యుఁ డెంత భరించుట న్యాయమో యంత వఱకు భరింప వలెను. దీనిని జేయుమని సంఘము నిర్బం

ధింప వచ్చును. చేయని వారిని నిర్బంధించుట వలన నెంత కష్టము కలిగినను సమర్థింప వచ్చును. సంఘము చేయఁదగిన దింతియ కాదు. ఎవఁడు గాని తాను చేయు పనుల వలన నితరుల స్వత్వమునకు భంగము చేయు నంతవఱకు పోకపోయినను వారికి హానికరముగను వారి మేలును సరిగ విచారింపకుండఁగను ప్రవర్తింపవచ్చును. ఇట్టి సందర్భమునఁ జట్టముల మూలముగఁ గాకపోయిన నభిప్రాయ బలము వలన వానిని దండించుట న్యాయము. ఇతరుల లాభమునకు నెవరి ప్రవర్తన లేశము వలన నైనను నష్టము సంభవించి నపుడు సంఘము జోక్యము కలుగ జేసికొన వచ్చును. అట్లు జోక్యము కలుగఁ జేసికొనుట వలన మొత్తము మీఁద సుఖము హెచ్చునా తగ్గునా యను సంగతి చర్చావిషయము కాఁదగును. కాని యెవని ప్రవర్తన మైనను వాని లాభమునకుఁ దప్ప యితరుల లాభమునకు బాధకరము గానప్పుడును ఈ చర్చ కవకాశము లేదు. మఱియు యుక్తవయస్సువచ్చి సామాన్యమైన వివేకము గలిగిన యితరులు బుద్ధిపూర్వకముగాఁ బాల్పడినపుడు మాత్రము వారికి బాధకలిగిన నీచర్చ కవకాశముండదు. ఇటువంటి విషయము లన్నిటిలోఁ బ్రతిమనుజుఁడును జేయ దలఁచినఁ పనిని జేసిదాని ఫలము ననుభవించుటకు రాజకీయ సాంఘిక రీతులనుబట్టి సర్వస్వాతంత్ర్య ముండ వలెను.

తనకులాభము కలుగనియెడల నితరుల శ్రేయస్సును గాని సత్ప్రవర్తనమును గాని తలపెట్టక యొకరితో నొకరికిసంబంధము లేకుండ బద్ధకించి

వ్యాఖ్యానము.

తన మేలును మాత్రము చూచుకొమ్మని యీ సిద్ధాంతము యొక్క తాత్పర్యము గాదు. అట్లెంచుట గొప్పపొరపాటు. ఇతరుల మేలును వృద్ధిపఱచుటలోఁ గృషి నెంతమాత్రము తగ్గించుటకు మాఱుగ నెక్కువ స్వార్థపరిత్యాగముతోఁ గృషివిస్తారముగఁ జేయవలసిన యావశ్యకమున్నది. అయినను స్వార్థపరత్వము గాని పరశ్రేయోపేక్ష చేత నితరులకుఁ బ్రోత్సాహము కలిగించుటలోఁ గఱ్ఱదెబ్బలు కొరడా దెబ్బలు వంటిసాధనములు గాక యితరసాధనములను గనిపెట్టి వారికి మేళ్లు కలిగింపవచ్చును. స్వప్రయోజనకరమైన గుణదూషణము నేనెన్నఁటికిని

చేయును. అయిననవి పరప్రయోజనకరములైన గుణములకుఁ దరువాతవి గాని మొదటివి గావు. రెండువిధములైనగుణములను సమానముగ వృద్ధిఁజేయుటయే విద్యయొక్క యుద్దేశము. విద్యకఅప్రుటిలో బలవంత మెట్టులనో బోధయును, ఆత్మనిశ్చయమును అట్లే యావశ్యకములు. విద్యార్థ్యవస్థదాఁటినతోడనే స్వప్రయోజనపరములైన గుణములను బోధనమువలననే యుపదేశింపవలసి యుండును. మంచిచెడ్డలను విభజించి, మంచి నవలంబించి, చెడుగును త్యజించుటలో మనుజు లొకరికొకరు సాహాయ్యము చేయవలసిన విధియున్నది. ఉత్కృష్టగుణములకుఁ గృషిని గల్పించి మనోభావములును, ఉద్దేశములును, పిచ్చితోవలఁ దిరుగక మంచిదారిని బోవునట్లులను, నికృష్టపదార్థములను నాలోచనల నాశ్రయింపక, యుత్కృష్టమార్గమును బట్టునట్లులను మనుజు లొకరికొకరు ప్రోత్సాహమును 'గలిగించుకొనుచుండవలయును. అయినను యుక్తవయస్సు వచ్చినవానికి మేలని తోఁచినరీతిని బ్రతుకకుండ మఱియొక మనుజుఁడుగాని జనసంఘముగాని బలవంతపెట్టుట కధికారములేదు. అతనిమేలునుగుఱించి యాతనికిశ్రద్ధ యధికము. అతనితో దృఢసంబంధముఁ గలవారికిఁ దప్ప యితరులకున్నశ్రద్ధ యతనిశ్రద్ధకంటె నల్పమైయుండును. ఇతరులతో సంబంధంపని పరివర్తనవిషయములో నతనియందు సంఘమున కుండుశ్రద్ధ అత్యల్పమును పరోక్షమునై యుండును. సామాన్యముగఁ బ్రతిపురుషుఁడును స్త్రీయును ఎవరిభావనా సందర్భముల ప్రకారము వారి స్వవిషయము నితరులకంటె ననేక రెట్లెక్కువ బాగుగఁ దెలిసికొనుటకు సదుపాయము లున్నవి. ఒకరి విషయములోనాతనినిశ్చయమును, ఉద్దేశములను, మార్చుటకుసంఘమునకుసర్వసాధారణమైన యనుమానముకంటె నతిశయములైన యాధారములు లేవు. ఇవి కేవలము తప్పు కావచ్చును. ఒకవేళసరియైనను వాని నుపయోగించుటలోఁ గేవలము బయటకుఁగాన్పించుసంగతులను బట్టి పోవునప్పుడు సంభవించు భ్రమప్రమాదముల కవకాశమున్నది. కనుకమానవజీవితములోనిట్టియంశమందు వ్యక్తివ్యాపారము యోగ్యముగనుండును. మానవుల పరివర్తనములోఁబర

స్వరమేమి యాకాంక్షింపవచ్చునో తెలియునిమిత్త మందఱును గొన్ని సామాన్యవిధులకు లోఁబడివర్తింపవలయును. కాని, ప్రత్యేకము వ్యక్తికి సంబంధించిన విషయములలో వ్యక్తిస్వాతంత్ర్యముగ వ్యవహరించుకొనుట న్యాయము. అతని విచారణమునకుఁదోడ్పాటుగ నితరు లాలోచనము చెప్పి యతనిమనోదార్ఢ్యమునకుఁ బ్రోత్సాహముకలిగించుటయే కాక యిట్టియాలోచనములను బ్రోత్సాహముల నతఁడక్కఱలేదన్నను జూపించుటకు యత్నింపవచ్చును. కాని పర్యవసానము కేవలమతని యధీనమైయుండవలెను. ఇతరుల యుపదేశములను హెచ్చరికలను లక్ష్యముచేయక యతఁడొనరించెడు దోషముకంటె నితరులకు మేలనితోఁచెడు మార్గమునఁ బొమ్మని యాతనిని బలవంతముచేయనిచ్చుట వలనఁ బుట్టెడు కీడనేకరెట్లధికమగును.

క్రిమములైన సాంఘిక బాధలు.

ఒకమనుజుని స్వలాభమును గుఱించిన గుణదోషములకును, నాతనిని గుఱించి యితరుల కుండుమనోభావములకును సంబంధములేదని నా తాత్పర్యము గాదు. అట్లుండుట సాధ్యమును, అపేక్షణీయమునుగూడఁ గాదు. ఎవ్వఁడైనను దనకు శ్రేయోదాయములైనగుణములలో దేనిచేతనైనను బ్రముఖుఁడైనచో నాతఁడు మానవులు చెందఁదగినపరమావధికిఁ గొంత సమీపించును గనుక నంతవఱకు శ్లాఘనీయుఁడగును. ఆగుణములలో దేనియందైన, విశేషలోపము గాన్పించినయెడల దూష్యుఁడగును. అతనియవివేకమును, దుష్టశీలమును గొంత పరిమితిని దాఁటినతోడనే యాపురుషునిహింసించుట న్యాయముకాకపోయినను వానివిూఁదఁదప్పక చీదఱపుట్టుట న్యాయము. ఈలోపములు మిక్కిలి బాధకమయినతావులందు నవజ్ఞకూడఁ గలుగకమానదు. వీనికి వ్యతిరేకములయినమంచిగుణములుగలపురుషునియందు వానికనురూపములయినమనోభావములుపుట్టకమానవు. ఒకపురుషుఁడితరులకు హానిచేయకపోయినను మన మాతనినిదప్పక పరిశీలించిబుద్ధిహీనుఁడని గాని నికృష్టుఁడనిగాని యెంచవలసివచ్చెడురీతిని బ్రవర్తింపవచ్చును. ఇట్టిపరిశీలనమునకు మనోభావనకును, లోనగుట యాతనికిష్టముండదు. కనుక నీసంగతిని దక్కిన యనిష్టములయిన సంగతుల వలెనే యాతనికి

ముందుగఁ దెలియపఱచినయెడలనుపకారము చేసినవారమగుదుము. సామాన్యముగఁ బ్రస్తుత మర్యాదకు భంగము రాకుండ నీయుపకారము నెక్కువ ధారాళముగఁ జేసినయెడల నెక్కువమేలుగనుండును. మర్యాదహీనుఁడని పాపాసుఁడని, అనిపించుకొనకుండ నొకరితప్పునుమఱియొకరు నిష్కపటముగ జూపింపఁగలిగినచోఁ జాలమేలుకలుగఁగలదు. ఇంతియకాక యెవరియందైనను మన కనాదరణముగలిగిన యెడల నాతనివ్యక్తితకు బాధఁగలిగింపఁ గూడదు. కాని మన వ్యక్తితావ్యాపారమున కవకాశము చేసికొనవచ్చును. దీనికి దృష్టాంతము మనకెవరిసంసర్గ ముండ వచ్చునో మనము నిర్ణయించుకొనుట క్రమముగనుక నాతని సంసర్గమును గోరవలసిన విధిలేదు. ఆసంసర్గమును విసర్జించుట న్యాయమేకాని, ఆవిసర్జనమును బ్రిగల్భముతో బయలువెట్టుట న్యాయముగాదు. ఇతరుల కతని దృష్టాంత సంభావణరూపమయిన సంపర్గముచేతహానికలుగఁబోవుచున్నప్పుడు వారి నాసంసర్గము వదలుకొనుఁడని హెచ్చరించుటకూడ న్యాయమే కాక యొకప్పుడు విధికూడఁ గావచ్చును. అతనినిదిద్దుటకుఁ గావలసిన విషయములలోఁ దప్ప తక్కిన యుపకార విషయములం దితరులనతనికంటె నెక్కువగ్గనాదరింపవచ్చును.తనకుమాత్రమే 'సాక్షాత్తుగా సంబధించిన విషయములలో సంభవించెడు ప్రమాదములకై యేమనుష్యుఁడైన నితరులవలన నన్నివిధములుగఁ గఠినదండనమును బొందుటకు వీలున్నది. కాని యీదండన మతని దోషములకు స్వభావసిద్ధమైనఫలితముగాని యుద్దేశపూర్వకముగ విధింపఁబడిన దండనముకాదు. ఎవ్వఁడైనను నవివేకియు మూర్ఖుఁడును, గర్వియునై మితమైన యాదాయముతో జీవనముచేయక హానికరములైన భోగములను విడువఁ జాలక బుద్ధిని మనస్సును బాడుచేసికొని విషయసుఖాసక్తుఁడైనచో, వానియం దితరులకు గౌరవమును, ఆదరణమును తగ్గునని తెలిసికొనవలయును. సాంఘికప్రాశస్త్య విశేషము వలన సంఘముయొక్కయాదరణమునకు బాత్రుఁడయినప్పుడుతప్పతక్కినయెడవార నాదరణము చేసినందునకు నాతఁడు విలపింపవలసిన నిమిత్తములేదు. ఇట్టిసందర్భములలో

నాయాదరమునకు వాని స్వవిషయ దోషములతో సంబంధముండదు.

సాంఘిక బాధలకు మితి.

నేను చేయువాద మేమనఁగా, ఎవ్వని ప్రవర్తనశీలము లైనను వానితో సంబంధించినవారి మేలునకు నష్టమును గలిగింపక వాని మేలును మాత్రమే బాధించినప్పు డతఁడు ప్రతిష్ఠానాదరణముల పాలగుటకంటె నెక్కుడిబ్బందులు కలుగఁగూడదు. ఇంతకంటె నధికమగు నిబ్బందిని గలుగఁజేయఁగూడదు. ఇతరులకు హానికరము లైన చర్యలలో నింతకంటెఁ గేవలము భిన్న మైనరీతిని దండింపవలసియుండును. ఇతరుల స్వత్వమునకు భంగముఁ గలిగించినను, దనకు స్వత్వము లేని విషయములో వారికిఁ జెఱుపు కాని నష్టమునుగాని కావించిన నితరులతో వ్యవహరించినపు డసత్యమును, మోసమును జరిగించినను వారి కన్యాయమును, అపకారమును కలుగునట్లు తనయుపపత్తులను వినియోగపఱచినను, స్వార్థపరుఁడై వారికిఁ గీడుమూడకుండ నివారింపక యూరకుండినను గూడ వానిని నీతిబాహ్యునిగ నెంచవచ్చును. మిక్కిలి యుద్ధృతము లైన విషయములలో నీతిశాస్త్రమును బట్టి నిందను, ధర్మశాస్త్రమును బట్టి దండనమును గూడ విధింపవచ్చును. ఇట్టి చర్యలు మాత్రమే కాక వాని కంకురము లైన మనోవృత్తులు గూడ దుర్వృత్తులు గనుక వాని ననాదరణము చేసి యసహ్యించుకొనవచ్చును. స్వవిషయ దోషము లెంత యధికముగఁ బ్రకోపించినను నవి దుర్వృత్తులును, దుష్టచర్యలును గా నేరవు. కాని, క్రూరప్రవృత్తియు, నీర్ష్యాదుస్స్వభావములును, పరస్పర సంసర్గమునం దన్నిటికంటె గర్హ్యమయిన యసూయయనునదియును, మోసమును, గాపట్యమును, దగినంత కారణము లేని యాగ్రహమును, ఆగ్రహకారణమును మించిన క్రోధమును, ఇతరుల నణఁచిపెట్టవలెనను నపేక్షయుఁ, గ్రమమయిన దానికంటె నధిక లాభములు కావలెనను గోరికయు, నితరులకు మానభంగము చేసి సంతోషించు గర్వప్రవృత్తియుఁ దక్కినయన్నిటికంటె నహమ్మమాదుల నెక్కువ ప్రాముఖ్యముగఁ జూచుకొని సందిగ్ధము లైనను సర్వ విషయములను దన కనుకూలముగఁ బరిష్కరించుకొను మమకారమును, ఇవి యన్నియును దుష్టగుణములు. ఇట్టి శీలము దుష్టమును గర్హ్యము నైయున్నది.

స్వవిషయదోషములవలన నవివేకమును, ఆత్మ గౌరవ, ఆత్మసన్మానాభావమును, ఎంతవఱకు బయటపడినను బడవచ్చును. కాని, ఆపురుషుఁడు ఆత్మరక్షణముచేసి కొనకపోవుటవలనఁ బరతో సంబంధించిన వారియెడఁ దనవిధాయక కృత్యములకు భంగమొనరించి నప్పుడు మాత్రమే నిందార్హుఁడగును. స్వవిషయ విధులు సందర్భమునుబట్టి పరవిషయమునఁ గూడ విధాయకము కానిచో సాంఘికరీతిని నిర్బంధములుగావు. స్వవిషయమయిన విధియన్నప్పుడు వివేకమని యర్థము. ఒకవేళ నాత్మసన్మానమని కాని, ఆత్మాభివృద్ధియని కాని విశేషార్థము చెప్పవచ్చును, ఎట్లయినను వీనిలో దేనికి నేపురుషునినైనను సంఘమునకు బాధ్యుని జేయుటవలన సంఘమునకు మేలుకలుగదు. కనుక వానినట్టి బాధ్యతనుండి తొలగింపవలసియున్నది.

స్వవిషయ పరవిషయభేదము.

ఆత్మగౌరవము, లేక స్వవిషయమైన వివేకము, వీని యందు లోపము చేత నెవరికిఁగాని కలిగెడు నప్రతిష్ఠకును, ఇతరుల స్వత్వమునకుభంగము చేయుటవలన సంభవించెడు నిందకును గలభేదము నామమాత్రము గాదు. అతనిమీఁద మన కధికారమున్న విషయములలోఁ గలిగెడు ననాదరణమునకును అధికారములేనివిషయములలో గలిగెడు ననాదరణమునకును జాలవ్యత్యాసము గలదు. అతనియందు మనకనాదరణముకలిగినప్పుడు దానిని గనఁబఱచుటకై యతనిని వర్జింపవచ్చును. కాని, యతనిజీవయాత్రను దుర్ఘటముగఁ జేయుట మనకు విధాయకము కాదు. అతఁడవివేకముచేతఁ దనజీవితమును బాడుచేసి కొనిన యెడల నాదోషమునకుఁ దగిన యావత్తుఫలము నిదివఱకే యనుభవించి యుండును. లేదా యిఁకముందనుభవింపఁగలఁడు. అంతియకాని యీ కారణమునుబట్టి యతని జీవితమును మఱింతపాడుచేయ నిశ్చయింపఁగూడదు. అతనకి దండనమువిధింపవలెనని కోరుటకంటె నాతనిప్రవర్తనమువలన ప్రాప్తించినవిపత్తులను దప్పించుటకుఁగాని, తగ్గించుటకుఁగాని మార్గములనుగనఁబఱచి యాతనిదోషఫలమునుగొంతనివారించుటకు యత్నింపవలయును. అతఁడుమన కరుణకుఁబాత్రుఁడుగావచ్చును లేకయతనికి మనము విముఖులముకావచ్చును.

కాని, యాగ్రహమున గ్రోధమును జూపింపఁగూడదు. అతనిని సంఘమునకు శత్రునిగఁ జూడఁగూడదు. అతనివ్యవహారములో జోక్యమును గలుగఁజేసి కొని వానియందు దయను, అభిమానమును, అనుతాపమును గనఁబఱచక వర్జించుటకంటె నధికముగా బాధించుట న్యాయము కాదు. అయినను బ్రత్యేకముగఁ గాని, సమూహముమీఁదఁగాని, యాతనితోడి మానవుల సంరక్షణార్థమయిన కట్టుబాటులకు భంగము కలిగించినప్పుడు వ్యవహారరీతి వేఱుమార్గముగ నుండును. అతనిచర్యలవలనఁ గలిగెడు దుష్ఫల మాతనిని మాత్రముగాక యితరులను గూడ బాధించును. సంఘములో నుండునందఱను సంఘము రక్షించుకొనవలసియున్నదిగనుక, అతనిని దండించి, స్పష్టముగ దండనార్థము కావలసినంత కఠినమయిన రీతి నతనిని హింసింపవచ్చును. స్వవిషయములో నతనివ్యవహారములను నిర్వహించుకొనుట కతని కెంతస్వాతంత్ర్యము నంగీకరించియుంటిమో మనకు నంతస్వాతంత్ర్యము గలదు. దాని నుపయోగపఱచుకొనుటవలన నవశాత్తుగఁ దటస్థించెడు మట్టుకుఁ దప్ప నంతకంటె నధిక బాధ గలిగింపవలసిన పనిమనకు లేదు. కాని ప్రస్తుతవిషయమున నతఁడు మనయెడల నపరాధి గనుక నతనిని విమర్శించుటయే కాక మనమే దండనమును గూడఁ బ్రయోగింపవలసియున్నది.

పూర్వ పక్షము.

ఒకమనుష్యుని జీవితములో స్వవిషయమునకును బరవిషయమునకు నిచ్చట నిరూపించినభేదము ననేకు లంగీకరింపరు సంఘములోఁ జేరిన యెవని ప్రవర్తనములో నైననేభాగమునకుఁ గాని యితరులతో సంబంధ మెల్లు లేకపోవునని ప్రశ్న చేయుదురు. ఏవాఁడునితరులనంటక కేవలుఁడైయుండడు. ఎవఁడైనను స్వవిషయమునవిస్తారముగగాని, శాశ్వతముగఁగాని హానికరమైనదానిని దేనిని గావించినను దానివలన నధమమతని సన్నిహిత సంబంధులకైనను హానికలుగకమానదు. తఱచుగ నది వారిని మించియెక్కువదూరము కూడ వ్యాపించుచుండును. అతనిసొత్తునకు విపత్తుకలిగినప్పుడు దానివలన సాక్షాత్తుగనైనను పరోక్షముగనైనను వానిపోషణములోని వారికి గీడు సంభవించుటయే కాక సామాన్యముగ సంఘము

యొక్క వచ్చుబడికిఁ గొద్దిగనో గొప్పగనో నష్టముగలుగుచున్నది. అతని శారీరకమానసికశక్తులు క్షీణించినప్పుడాతనినాధారపడుచుకొన్న వారిసౌఖ్యము లోఁగొంతభాగమునకు నష్టముకలుగుటయేకాక మెట్టుమీఁదఁ దనతోడిమానవులయెడ జరిగింపవలసిన కార్యములను జరిగింపకుండ నతఁడనర్హుఁడైపోవుచున్నాఁడు. ఒక వేళ వారి దయాదాక్షిణ్యములకుఁ బాత్రుఁడగుటవలన వారికి భారముగ నేర్పడిన నేర్పడవచ్చును. ఇట్టిచర్య లెఱుచుగఁ దటస్థించినచో సంఘముయొక్క లాభమునకు నష్టము కలిగించుట కింతకంటె నెక్కువ యపరాధమేమున్నది? అతనిదుష్కార్యముల వలనఁగాని యవివేకచర్యలవలనఁగాని యితరులకు సాక్షాత్తుగ హానికలుగకపోయినను, తుదకు నతని విషమదృష్టాంతము వలననైన హానికలుగును. కనుకనతనిని జూచిగాని వినిగాని తప్పుత్రోవను బడిచెడిపోకుండ నితరులను గాపాడునిమిత్తమతనికెక్కువ యాత్మనిగ్రహము విధింపవలసియున్నదని చెప్పుదురు.

పూర్వపక్షశేషము

ఇంతియకాక యెవ్వరి దుష్ప్రవర్తన ఫలమైనను,ఆయవిచారకునిగాని దుష్ప్రవర్తకుని గాని మాత్రమే భాధించినను స్వవిషయ నిర్వాహణమునకు స్పష్టముగ ననర్హులైన వారి నట్లు వదలివేసి సంఘమూరకుండ వచ్చునాయనియు, పిల్లలను యుక్తవయస్సురాని వారిని రక్షింపవలసినబాధ్యతయున్నప్పుడు స్వపరిపాలనమున కనర్హులైన పెద్దవాండ్రను మాత్రము రక్షించుట దానితోసమానమైన బాధ్యతకాదాయనియు, జూదము,మద్యపానము,వ్యభిచారము,నిర్వ్యాపారత్వము, అశుచియు, మున్నగురాజశాసననిషిద్ధములైనబహుకార్యములవలెనే సౌఖ్యమునకు భంగ మొనర్చియు నభివృద్ధి కాటంకము కలిగించుచున్నప్పుడాశాసనము సాధ్యమైనంతవఱకు సాంఘికానుకూలతనుబట్టి వీనినిగూడ నేలయణఁచివేయ యత్నింపఁగూడదనియు, శాసనములందనివార్యములైన లోపము లున్నప్పుడు వానికిఁ బరిహారముగ లోకాభిప్రాయమైనను బలపడి యాపాతకములను నివారించుటకు యత్నించి, తత్కారకులను సాంఘికరీతిని గఠినముగ దండింపవలదాయనియుఁ బ్రశ్నచేయవచ్చును. దీనివలన వ్యక్తిస్వాతంత్ర్యమునకుఁగాని

నూతన జీవిత మార్గకల్పనమునకు గాని యాటంకము కలుగలేదని చెప్పుదురు. లోకము పుట్టినప్పటినుండి యిప్పటివఱకు ననుభవమును బట్టివేసిన గర్వ్యాము లుగనెంచియున్నారో యనుభవముచేత నెవ్వరికిని ఉపయోగమును అనుకూలమును గావని పరిష్కరింపఁబడియున్నవో వానిని మాత్రము నివారింప యత్నము జరుగుచున్నదనియుఁ గొంతకాలము గడచి కొంత యనుభవము కలిగినమీఁదట నీతివిషయమునను లోకవ్యవహారమందును సత్యము ధ్రువపడిన త్రెంచఁదగిన పరిమితి యొకటి యుండవలెననియుఁ,బూర్వులకు నాశహేతువైన విపత్తులోఁ దరతరములవారును బడకుండ నిర్మించుటకుఁగోరుచున్నామనియుఁ జెప్పుదురు.

సమాధానము. ఎవ్వనికైనను హాని సంభవించినపుడు దానివలన నాతని దగ్గఱ వారికతనియందుండు నభిమానమును లాభాపేక్షను బట్టి విశేషనష్టము కలుగుటయే కాక సామాన్యముగ సంఘమునకుఁగూడఁ గొద్దిపాటి నష్టము సంభవింపవచ్చునని నేను పూర్ణముగ నొప్పుకొనుచున్నాను. ఇటువంటిచర్యవలన నెవ్వఁడైన నితరులలో నొకనికిఁగాని యెక్కువమందికిఁ గాని స్పష్టముగ నిర్ణీతమైన విధి నుల్లంఘించినప్పు డాచర్యస్వవిషయము కాదు గనుకఁ గ్రమమైన రీతిని నిందార్హమగును. దీనికి దృష్టాంతము. ఒకమనుష్యుఁ డతిమద్యపానముచేతఁగాని యతివ్యయముచేతఁగాని తానుచేసిన ఋణములను దీర్చలేక పోయినను గుటుంబ భారము మీఁదవైచికొని పూర్వోక్త కారణములచేత వారిని బోషింపలేక పోయినను వారికి విద్యచెప్పింపలేకపోయినను, ఆపురుషుఁడు నిందార్హుఁడును దండార్హుఁడును, కాదగును. అయిన, నిక్కడదోషము ఋణస్థులయెడలను లేకకుటుంబము యెడలను నిర్వర్తింపవలసిన విధ్యుల్లంఘనముగాని యతివ్యయముగాదు. వారి నిమిత్తము వినియోగపడవలసిన ధనమును మిక్కిలియుక్తమైన యభివృద్ధిమార్గమునఁ బెట్టక వేఱుమార్గమునఁ బెట్టిన నతఁడు సమానముగ నిందార్హుఁడగును. జార్జిబార్న్వెల్లు ఉంపుడుకత్తెకు డబ్బునిమిత్తము తనపినతండ్రిని జంపివేసినందున కతని నురిఁదీసిరి, కాని వ్యాపారములోఁబ్రవేశించుట కట్టికార్యము

చేసిన వాతని కరితప్పదు. లోకములో నొక మనుష్యుని దురభ్యాసమువలన వానికుటుంబమునకు దుఃఖము తఱచుగఁ గలుగుచున్నది. ఇట్టిసందర్భములలో వాని నిర్దయత్వమునకును లేక కృతఘ్నత్వమునకును వాఁడు నిందార్హుఁడు. అయినను సహవాసముచేతఁగాని సంబంధబాంధవ్యములచేతఁగాని యతని వలన సౌఖ్యముపొందవలసినవారికి వ్యధగలిగించెడు నభ్యాసములను గలిగించు కొనినయెడలనవిస్వతస్సిద్ధముగ దుష్టములుకాకపోయినను వానికైకూడనతఁడు నిందార్హుఁడగును. మిగులనావశ్యకమైన విధియొక్కబలాత్కారముచేతను, లేక సమర్థనీయమై యంగీకృతమైన స్వలాభాపేక్షచేతను దప్ప యితరముగఁ బరుల మనోభావనలను, అభిలాషలను, సామాన్యముగఁ దగినరీతిని విచారింపనందుల కెవ్వఁడైనను నింద్యుఁడగును. కాని, అట్టిభంగమునకు దాని కారణముతోఁగాని కేవలము స్వవిషయ దోషములతోఁగాని సంబంధము దూరమయినపు డతఁడు నిందార్హుఁడుగాఁడు. ఇట్లే కేవలము స్వలాభాపేక్షచేత సాంఘిక విధినిర్వర్తనమునకుఁ బనికిరాకుండఁజేసికొనిన యెడ నతఁడు సంఘవిషయమయి యపరాధియగును. ఎవ్వనినిగాని కేవలము మద్యపానమునకై శిక్షింపఁగూడదు. కాని విధాయక కార్యకరణమందు యుద్ధభటుఁడైనను, రక్షకభటుఁడైనను, త్రాగియున్నచో వానిని దండింపవలసియున్నది. ఇంతయేల, వ్యక్తికిఁగాని సంఘమునకుఁగాని యేయేవిషయములందు స్పష్టముగ నష్టముకలుగుచున్నదో, యట్లుకలుగునని స్పష్టముగఁ గనఁబడుచున్నదో, యట్టి సర్వవిషయములును వ్యక్తి స్వాతంత్ర్యములోఁజేరినవికావు. అవి నీతిశాస్త్ర ధర్మశాస్త్ర విషయములగుచున్నవి.

వాదసిద్ధాంతము

ఏపురుషుఁడైనను స్పష్టమగుసాంఘికవిధి నుల్లంఘింపకపోయినను, తనకుఁగాక యితరునికి హానినిగలిగించెనని నిర్దేశించుటకు వీలులేక పోయినను, అతని ప్రవర్తనమువలన సంఘమునకుఁ గేవల మాగంతుకముగఁ గొంతకీడుసంభవింపవచ్చును. ఈసంబంధమయిన యిబ్బందిని సంఘముభరించి యింతకంటె నధిక శ్రేయోదాయక

మగు మానవస్వాతంత్ర్యమున కవకాశ మియ్యవలయును. యుక్తవయస్సు వచ్చినవారిని స్వవిషయమునఁ దగినంత జాగ్రత్తలోనుండనందునకు దండింపవలసియే యున్న యెడల వారిమేలునుద్దేశించియే యాదండనముజరిగించుట క్రమము. కాని వారు సంఘమునకేదోకొంత బాధ్యులైనట్లును, ఆ బాధ్యతను నెఱవేర్చుటకు వీలులేకుండ తమశక్తి నిబాడుచేసికొనినట్లును భావించి వారిని దండించుట క్రమము గాదని నాతాత్పర్యము. అయినను సంఘములోనుండు దుర్బలు లవివేక మొనరించు వఱకును జూచుచు నూరకుండి, పిమ్మటవారిని శాసనముల చేతను, వెంగమోటము చేతను దండించి, వారిని సర్వసామాన్యమయిన మంచిత్రోవకుఁ దీసికొనివచ్చుటకు సాధనములు లేనట్లువాదముచేయుట నాకిష్టములేదు. ఇటువంటివారు మంచిత్రోవకు వచ్చునట్లు ప్రయత్నము చేయుటకు వారిబాల్యావస్థయంతయు సాంఘికాధికారమునకుఁ బరిపూర్ణముగలోఁబడియుండెను. ముందురాఁబోవుతరమువారి సంగతులును, విద్యయు, సర్వము నిప్పటితరమువారి చేతిలోనున్నది. మంచితనమును, వివేకమును, వీరికే చాలలోపముగనున్నపుడు వారిని సంపూర్ణవివేకపుణ్యశీలురుగఁ జేయుటకు నిజముగసాధ్యముకాదు. ఈతరమువారు కొంతమందివిషయములోఁ జేయుచున్న ప్రయత్నములెంత మంచివైనను గొన్నివేళల విఫలములైపోవుచుండును. కాని ముందురాఁబోవు తరమువారిని మొత్తముమీఁదఁదనపాటి మంచి వారుగఁగాని యంతకంటెఁ గొంచెమెక్కుడుమంచివారుగఁగాని చేయుటచక్కఁగ సాధ్యము. సంఘములోని చాలమందిని దూరాలోచనను లేనట్టియు, యుక్తాయుక్తముగఁ బ్రవర్తింపఁ జాలనట్టియు, కేవలము పసిబిడ్డలవలెఁ బెరుగ నిచ్చినయెడలఁ బుట్టినఫలము యొక్క దోష మంతయు సంఘము పాలఁబడును. విద్యాబలమంతయు సంఘముచేతిలోనున్నది. స్వతంత్రాలోచన పరులుగానట్టివారి బుద్ధిని స్వాధీనపఱచుకొనఁగల యభిప్రాయబల మంతయు సంఘాధీనమైయున్నది. అవిచారులనెఱిగియున్న వారిమనస్సులో సహజముగను, అనివార్యముగను సంభవించెడి విద్వేష నిరసనరూపములైన బాధలుకూడ సంఘమునకే తోడ్పడుచు

న్నవి. వీనియన్నిఁటికిఁ దోడుగఁ బ్రతిమనుజుని స్వకీయవిషయములను గూడ శాసించి, వానిని వశపఱచుకొనెడియధికారమునుసయితము సంఘమున కిచ్చుట యుక్తముకాదు. ఈవిషయములలో నెవరుఫలము ననుభవించుచున్నారో వారే పరివర్తనవిషయమును నిర్ణయించుకొనుట సర్వవిధముల న్యాయమును నీతియు నయియున్నది. హీనములయిన సాధనములచేతఁ బ్రవర్తనమునుసాధించుటవలననే, యుత్కృష్టసాధనములకన్నిటికంటెనధికాపజయమును అగౌరవమును గలుగుచున్నవి. ఎవరికి బలవంతముగ వివేకముగాని, నియతముగాని కలుపుటకు యత్నించుచున్నారో వారిలో స్వతంత్రేచ్ఛగల బలవంతులున్నయెడల వారట్టి శిక్షకుఁ దప్పక తిరుగఁబడుదురు. ఇతరులకుఁ దనవలన హానికలుగకుండ నిరోధించినట్లే స్వవిషయమందు కూడఁదన్ను నిరోధించుట కితరులకు స్వత్వముగలదని యటువంటివాడెవ్వఁడు నొప్పుకొనఁడు. ఈవిషయములో నక్రమముగ నధికారమును బూనినయెడల నాయధికారమును నొగముమీఁదఁగొట్టి నట్లువిధించుకార్యమునకుఁ గేవలము వ్యతిరేకముగ జరిగించి విఱ్ఱవీగుటయే ధైర్యసాహసచిహ్నమని యందఱును సులభముగ నంగీకరింతురు.

ఇంగ్లాండులో ప్యూరిటనులు నీతివిషయమున నొత్తుడు కలిగించిన పిమ్మట వెంటనే చార్లసు పరిపాలన కాలమం దవినీతియే మర్యాద యగుట దీనికి దృష్టాంతము. అవినీతులును, భోగపరులును, దమ దురాచార దృష్టాంతమువలన సంఘమున కపకారము కలిగింపకుండ దానిని గాపాడవలసిన యావశ్యకమున్నది. ఈవిషయములో ననాచారదృష్టాంతము; దానిలో ముఖ్యముగ నితరుల కపకారముచేసి దండనములేకుండపోయెడువారిదృష్టాంతమువలన నిజముగ హానికలుగుచున్నది. కాని యెవఁడు నితరులకు హానికలిగింపక తనకు మాత్ర మపకారము కలిగించుకొను విషయమునుగూర్చి ప్రస్తుతము విచారించుచున్నాము. ఇట్టి సందర్భములోవాని దుష్ప్రవర్తనమువలనఁ గలిగెడు హానిగాని, యవమానముగాని, బైటపడి యావిపత్తులకుఁ గారణమైన పరివర్తనమును గ్రమమయిన రీతిని దూషించినప్పుడు వాని దృష్టాంతము

వలన మొత్తముమీఁద లాభమే కలుగును గాని నష్టము కలుగదు. ఇంతకంటె భిన్నముగ నూహించుట యెట్లు సాధ్యమో నాకు తోఁచకున్నది.

అయినను కేవలము వ్యక్తితో సంబంధించిన ప్రవర్తన విషయములలో లోకులు జోక్యము కలుగజేసికొనఁ గూడనందునకు బలవత్తరమయిన కారణము నిఁక జెప్పుచున్నాము. లోకులు జోక్యము కలుగజేసికొనినప్పుడు బహుశా వారనుచితములయిన సంగతులలో ననుచితమయిన రీతిని జోక్యము కలిగించుకొనుట తటస్థించును.

సిద్ధాంత వాద శేషము

ఇతరులతో సంబంధించిన విధులను గూర్చియు సాంఘిక నీతి ప్రవర్తనమును గూర్చియు లోకుల యభిప్రాయము అనగా నెక్కువమంది యొక్క యభిప్రాయము తఱచుగఁ బ్రమాద వశమయి యుండును గాని యంతకంటె నెక్కువ తఱచుగ నప్రమాదముగ నుండునని చెప్పవచ్చును. ఎందుచేతననగా, ఇటువంటి విషయములలో లోకులు తమలాభమును గూర్చియు, ఏప్రవర్తన లేశమున కైన నవకాశ మిచ్చినయెడల నది తమ్మునెట్లుభాధించునో దానిని గూర్చియుం, విచారింపవలసియుండును. కాని వ్యక్తికి మాత్రమే సంబంధించిన సంగతులలో నెక్కువమంది యొక్క యభిప్రాయము తక్కువమందిమీఁద విధిగాఁ బడవేసినప్పు డదియొప్పగుటయెంత సాధ్యమో తప్పగుటకూడ నంతే సాధ్యము. ఈసంగతులలో లోకాభిప్రాయమని నప్పుడు, కొంతమందియొక్క మంచిచెడ్డలను గూర్చి మఱికొందఱకున్న యభిప్రాయము మాత్రమేకాని యంతకంటె నెక్కువ కాదు. మిక్కిలితఱచుగ నది యభిప్రాయ మాత్రముకంటెను దక్కువగ నుండును. లోకులు తామెవరిని దూషించుచున్నారో వారి సుఖమును సదుపాయమును మిక్కిలి నిస్పృహతో దాఁటవేసి తమ యనుకూలమును మాత్రమే యాలోచించుచుందురు. తమకు రుచింపని ప్రవర్తనము తమకు హానికరమని యెంచి దానివలనఁ దమ మనస్సునకు భాధ కలిగినదని యాగ్రహము వహించెడి వార లనేకు లున్నారు. ఇతరుల మతాభిమానమునకేల భంగము కలింగిచినావని మతావేశులి యాక్షేపించినపుడు, వారు రహస్యకర

మయిన మతము నవలంబించిగాని యారాధనములను జేసిగాని పట్టువపల కుండుటచేతఁ దనమనస్సునకేల నొప్పికలిగింపవలెనని యతఁడు చేయు ప్రత్యప వాదము దీనికి నిదర్శనముగనున్నది. దొంగయందు ధనమునపహరింపవలెనను గోరికకును, అధనాధిపతియందు దానిని బోకుండఁ బట్టవలెనను గోరికకును, నెంతసంబంధ మున్నదో తన యభిప్రాయవిషయమయిన యభిమానమునకును దానిని వదలనందున కితరునికిఁగలిగెడు వ్యాగ్రహమునకును, అంతేసంబంధ మున్నది. ఎవనియొక్క యభిప్రాయముగాని, ధనముగాని, ఎట్లు స్వవిషయమగుచున్నదో యట్లేవాని యభిరుచియును స్వవిషయమగుచున్నది. సర్వలోకానుభవముచేత దూష్యములని పరిష్కృతములయిన ప్రవర్తనాంశముల నుండి మాత్రము విరమింపుమని యాజ్ఞాపించి సందిగ్ధము లయిన సర్వ విషయములలోను వ్యక్తియొక్క యనుకూలమునకును, స్వాతంత్ర్యమునకును, నొంవరలేకుండ స్వేచ్ఛముగ వదిలివేసి లోకు లూరకుండెడి స్థితిని సులభముగ నూహింపవచ్చును. కాని యెక్కడనయినఁ లోకులు గుణదోష విమర్శనములో నిట్టి పరిమితి నేర్పఱచు కొనియున్నారా? లోకులెప్పుడయిన సర్వలోకానుభవమును గూర్చి తల పెట్టుచున్నారా? వ్యక్తిలోకమునకంటె భిన్నముగ నాలోచించినప్పుడు గాని ప్రవర్తించినప్పుడు గాని దానిని మహాపాతకముగనెంచి జోక్యము కల్పించు కొనుటయే తప్ప యంతకంటె నెక్కువ యాలోచించుటలేదు. ధర్మశాస్త్రజ్ఞులలోను, ఆధ్యాత్మిక గ్రంథ కర్తలలోను బదింటఁ దొమ్మిది పాళ్లీ యాలోచనమునకుఁ గొంచెము వేషము వేసి యిదియే మతముయొక్కయు నాధ్యాత్మిక విద్యయొక్కయు నిశ్చయమయినట్లు మానవుల యెదుటఁ బెట్టి, యేసంగతులయిన నెందుచేత సరియైనవనగా మన కట్లుతోఁచెను గనుక సరియైనవని బోధించుచుందురు. మనవిషయమునను, ఇతరులనుగూర్చియుఁ, బ్రవర్తన విషయిక సూత్రముల నిమిత్తము మన మనస్సులను, హృదయ కోశములను బరీక్షించినఁ జాలునని చెప్పుచుందురు. పాపము, లోకులీ యుపదేశమును బ్రయోగించి తమకుఁదోఁచెడి మంచి చెడ్డల నితరులుకూడ తగినంతమంది యంగీకరించినచో వానిని లోకమంతటికి విధాయకము చేయకుండ నెట్లూరకుండఁగలరు.

పూర్వపక్షదోషమునకు దృష్టాంతములు.

ఇచ్చట నిర్దేశింపఁబడిన విపత్తు కేవలము సిద్ధాంతమాత్రము గాదు. కనుక నొకవేళ నీకాలములో నీదేశము నందు లోకులక్రమమైనరీతిని దమ యిష్టానిష్టములను ధర్మశాసనములుగ విధించినందునకు దృష్టాంతములను గూడ నిర్దేశింపవలసి యుండవచ్చును. ప్రస్తుతము నీతివిషయములోనున్న వికారములను గుఱించి యుపన్యసించుట లేదు. ఆవిషయమును హఠాత్తుగను దృష్టాంతమాత్రముగను, ఎత్తుకొని, విచారించుట యతి భారమైనసంగతి. అయినను నేను ప్రతిపాదించుచున్న సిద్ధాంతము గంభీరమును, ఆచారకాండములో ముఖ్యమునైనది గాని, నేను కేవలమూహచేత విపత్తులను గల్పించి వానిని నివారించుటకు యత్నము చేయుటలేదని చూపించుటకు దృష్టాంతము లావశ్యకములు. ధర్మసంరక్షణమను దాని వ్యాప్తి నధికము చేసి, మిక్కిలి నిశ్చితన్యాయమగు వ్యక్తిస్వాతంత్ర్యమును బాధించెడి ప్రవృత్తి మానవులకు నెల్లచోట్లఁ గలిగియున్నదని యనేక దృష్టాంతముల చేత సులభముగఁ జూపింపవచ్చును.

* ఒకటి, మతవిషయమునందు దమకంటె నభిప్రాయభేదము కలిగి యాచారకాండములోఁ బ్రవృత్తియందును, అంతకంటె ముఖ్యముగ నివృత్తియందును, భేదముగ నుండు కారణమును బట్టి మానవు లొకరి యెడల నొకరు పూనియుండెడి విరోధములను విచారింపుఁడు. క్రైస్తవులు సూకరమాంసభక్షకులను సంగతి యల్పవిషయమైనను దానికంటె వారిమతాచరణములలో నేదియు మహమ్మదీయులకు వారిమీఁద నెక్కువ యసహ్యమును గలిగించునది లేదు. ఈ యాహారవస్తువును గూర్చి మహమ్మదీయులు చెందెడు చీదఱకంటెఁ గ్రైస్తవులును, యూరోపియనులును యథార్థముగ నెక్కువచీదఱఁ జెందెడిసంగతులు మిక్కిలి తక్కువగనున్నవి. అది వారిమతమునకు విరోధము. ఇది మొదటి సంగతి. కాని, వారి యసహ్య

* బొంబాయిలోని పారశీలసంగతి యీవిషయములోఁ జిత్రమైన నిదర్శనముగనున్నది. వీరుకష్టించి వర్తకము చేసి జీవించెడివారు. వీరిపూర్వులగ్ని దే

కూడ నిషేధమే కాని మహమ్మదీయు లందఱును దానిని దప్పుగ నెంచినను దానిని గూర్చి చీదఱఁ జెందుట లేదు. ఏలనని యశుచియనెడి భావ మొక సారిమనస్సులో బాగుగ నాటు కొనినపిమ్మట శుచియైన యభ్యాసములు లేనివారికి సైతము దానివిషయమై తప్పక చీదఱ పుట్టుచుండును. దీనికి హిందువులలో గాఢముగ నాటుకొనియున్న మతవిషయమైన యశుచిని ముఖ్యదృష్టాంతముగఁ జూచుకొనవచ్చును. మహమ్మదీయులకు "అపవిత్రిజంతు" (సూకరము) మాంసభక్షణవిషయమైనయసహ్యా మిక్కిలి విశేషమైన యసహ్యమైయున్నది. అదివారికి స్వభావసిద్ధమైనట్లు లుండును. ఇట్టి సందర్భములో మహమ్మదీయు లెక్కువగనున్న దేశములో నెక్కడను సూకర మాంస భక్షణము చేయఁ గూడదని శాసనమొకటి పుట్టినదనుకొనుఁడు. ఇది మహమ్మదీయదేశములలో నొక క్రొత్తసంగతిగ గాన్పింపదు. కాని యీసంగతిలో లోకాభిప్రాయబలము క్రిమమైన రీతిని బ్రివర్తించెనా? లేని యెడల దానికిఁ గారణమేమి? ఈయాచారము నిజముగ నాదేశప్రజనులకు సంకటమైనదే. వారిది యీశ్వరునిదృష్టికి నిషేధమును అసహ్యమును అయియున్న దనికూడనిష్కపటముగ భావించుచుండురు. ఈనిషేధమును మతవిషయిక

---

వునిబూజించెడివారు. వీరుకిలీఫులయెదుట నిలువఁజాలక స్వదేశమునువిడిచి పశ్చిమహిందూస్థానమునకుఁ బాఱిపోయిరి. ఇచ్చటి హిందూరాజులు వారిని గోమాంసభక్షణము చేయకుండెడి పద్ధతిమీఁద నంగీకరించిరి. పిమ్మట నారాష్ట్రములు మహమ్మదీయులచేతిలోఁబడినప్పుడు సూకరమాంసభక్షణముచేయకుండు పద్ధతిమీఁద పారశీకులిచ్చట నుండుటకు సెలవుపొందిరి. ఇట్లుమొట్టమొదటనధికారవిహితములైన యాచారములు కొంతకాలమునకు స్వభావసిద్ధములైనందునఁ బారశీ లీదినమువఱకును గోమాంసభక్షణమును సూకరమాంసభక్షణమును నిషేధించియున్నారు. ఈపదార్థద్వయవిసర్జనము వారిమతములో మొట్టమొదట లేకపోయినను ఆచారముక్రింద నంకురించి వృద్ధిఁజెందినది. తూర్పుదేశములో నాచారమే మతము.

హింసయని నిందించుటకు వీలులేదు. ప్రారంభములోనది మతవిషయమైయుండ వచ్చును. కాని యెవనిమతమును సూకరమాంసభక్షణమును విధింపదుగనుక తన్నిషేధమును మతవిషయికహింసగా నెంచుటకు వీలులేదు. కనుక నాని షేధమును దూషించునప్పుడు వ్యక్తిసంబంధమైన యభిరుచికిని స్వవిషయము నకును భంగకరముగ లోకులు జోక్యము కలుగఁజేసికొని నారని చెప్పుటయే సమర్థనీయమైనహేతువు.

2. ఇంతట దీనిని వదలి దీనికంటె నెక్కువదగ్గిఱదృష్టాంతము నెత్తుకొనెదము. స్పెయినుదేశస్థులలోఁ జాలమంది రోమనుకాతోలిక్కుపద్ధతి ప్రకారముగఁదప్ప వేఱువిధముగ దైవారాధనము చేయుట దేవుని దృష్టికిమిగుల నసహ్యమైన మహాపాతకమని భావించుచుండుటనుబట్టి యాదేశములో మఱియొకవిధమైన యారాధనమునకు న్యాయమైనయవకాశము లేదు. దక్షిణ యూరోపు ఖండవాసులు పురోహితులు వివాహము చేసికొనుటను అధర్మముగనేకాక యసహ్యముగను అశ్లీలముగను అమర్యాదగను వ్యభిచారముగను, ఎంచుచుందురు. ఈ మనోభావనలు నిష్కాపట్యములు. వీనిప్రకారము రోమను కాతోలిక్కులు కానివారందఱను నిర్బంధించుటకు యత్నము జరిగినప్పుడు వానినిగూర్చి ప్రొటెస్టెంటు లేమి తలంచుచుందురు? అయినను మనుష్యు లొకరి యభీప్సితముతో నొకరికి సంబంధము లేని విషయములలో జోక్యము కలుగఁజేసికొనుట సమర్థనీయమే యైనయెడల పూర్వోక్తములైన విషయములలో నెట్టట్టి జోక్యము కలుగఁజేసికొనకుండ నిషేధింప సాధ్యమగును? లేక దేవుని దృష్టికిని మనుష్యుని దృష్టికిని గూడ నసహ్యకరమని తోఁచెడి సంగతి నణఁగఁ ద్రొక్కవలయునని కోరినందునకు వారి నెట్లు నిందింపనగును? ఈ యాచారముల నధర్మములని యెంచెడివారిదృష్టి ప్రకారము వాని నణఁచివేయుటకుఁ గల కారణములకంటె వ్యక్తివిషయమయినయేయవినీతినణఁగఁ ద్రొక్కుటకును గూడ నెక్కువ బలములైనయుపపత్తులు లేవు. హింసకులయొక్క తర్కశయ్యను మనముకూడ నవలంబించి

మేము సరియైన త్రోవ నున్నాముగనుక నితరులను హింసింపవచ్చుననియు వారు తప్పుత్రోవ నున్నారుగనుక మనలను హింసింపఁగూడదనియు వాదింప మొదలుపెట్టినచో విపరీతన్యాయమొకటి సంప్రాప్తమగును. దానిని మన మీఁదఁ బ్రయోగించినయెడల మనకు మిక్కిలి ఘోరమైన యన్యాయము జరిగినదని యాగ్రహము పుట్టక మానదు. కనుక నట్టి యన్యాయమునకు మన మవకాశ మియ్యకుండ బహు జాగరూకులమయి యుండవలయును.

ఆక్షేపము.

ఎవరిమత ప్రకారముగాని. యిష్టప్రకారము గాని వారు వివాహము చేసికొనినందునకును, లేక మానినందునకును, దైవారాధనము చేసినందునకును జోక్యము కలుగఁజేసికొనిగాని లేక యాహార పదార్థములను వ్యజింపుమని బలవంతము చేసికాని యీ దేశములో జనాభిప్రాయము బహుశా వెలువడదుగనుక పైఁజెప్పిన దృష్టాంతములు మనకు సంభవముకాని సందర్భములను గూర్చినవని యాక్షేపము రావచ్చును. ఇది సరియైన యాక్షేపము కాకపోయినను మనస్వాతంత్ర్యమునకు భంగము కలిగించునని యింకను జడియఁదగిన మఱియొక దృష్టాంతము నెత్తికొనెదము.

దృష్టాంతము.

న్యూ ఇంగ్లాండులో కామను వెల్తు కాలములో గ్రేటుబ్రిటనులోను జరిగినట్లెచ్చటెచ్చట ప్యూరిటనులు చాలినంత బలవంతులయిరో యచ్చటచ్చటఁ బ్రకటనములయిన వినోదముల నన్నిఁటిని, బ్రకటనముగాని వినోదములలోఁ జాలవఱకు, నణఁచివేయుటకు యత్నించిరి. ఈయత్నము చాలవఱకుఁ గొనసాగినది. ముఖ్యముగ సంగీతము, నాట్యము, బహిరంగములైన యాటలును, ఇతరమైనవినోదపు సమ్మేళములును, నాటకములును, నీతరగతిలోఁ జేరియుండెను. ఈవినోదములు నీతిప్రకారమును, మతప్రకారమును నిషేధములని భావించెడి పెద్ద పెద్ద జనసంఘములింక నీదేశములో నుండియున్నవి. ఈరాష్ట్రములో రాజకసాంఘికమైన యధికారము ప్రస్తుతము నడిమి తరగతి వారియాధీనమైయున్నది. వారిలో నీయభిప్రాయములు గలవారొకప్పుడు కాకపోయిన మఱియొకప్పుడు పార్లమెంటులో నెక్కువమందిని దమపట్టునఁ ద్రిప్పుకొనుట యొంతమాత్ర

మసాధ్యముగాదు. కాల్వనిష్టు, మెథడిస్టులలో నధిక శ్రోత్రియులయినవారి నీతి మతాభిప్రాయముల ప్రకారము వినోదముల నంగీకరింపఁ బ్రారంభించినచో, సంఘములోని యితరజనుల కదియెట్లు రుచించునో? వారి శ్రోత్రియుల నిట్టియధిక ప్రసంగమునకు రాకవారిపని యేమో చూచుకొండని యత్యాతురమైనకోరికను వెంటనే కనఁబఱతురు. ఏరాజ్యములో నే ప్రజలైనను దమకుఁ దప్పనితోఁచిన వినోదముల ననుభవింపకుండ నేపురుషుని నైన నాటంకపఱచుట కధికారమున్నదని చెప్పినయెడల, వారికి సరిగానిదియే యాక్షేపమువచ్చును. అయిన నీయధికారమున కాధారభూతమైన సిద్ధాంతము నంగీకరించినయెడల, దానినిబట్టి దేశములోనుండు ప్రజలలో నెక్కువ మందిగాని, బలవంతమైన శాఖవారుగాని ప్రవర్తించినందుల కెవ్వఁడునాక్షేపించుటయుక్తియుక్తముగాదు. కనుకన్యాఇంగ్లాండులో క్షీణించిన క్రైస్తవమతము క్షీణదశనొందిన తక్కినమతములవలెనే తిరిగి యెప్పటికైనఁ దలయెత్తినచో, నాదేశములో మొదటఁ బ్రవేశించిన క్రైస్తవుల యభిప్రాయ ప్రకారము క్రైస్తవ మతసమ్మతమైన రాజ్యపద్ధతి కందఱు నొప్పుకొనుటకు సంసిద్ధులై యుండవలయును.

దృష్టాంతము.

మన కనుభవమునకు వచ్చుట కింతకంటె నెక్కువ యవకాశము గలిగిన మఱియొక సందర్భము ను విచారింతము. ప్రస్తుతయుగములో రాజకీయవిషయమందు ప్రజాస్వామిక ప్రతిష్ఠాపనలు గుదిరినను గుదరకపోయినను సాంఘికమందెల్లయెడల సమానమైన ప్రజాధికార మేర్పడెడు ప్రవృత్తి బలమైనదని యందఱు నొప్పుకొనవలసియున్నది. అమెరికాదేశపు సంయుక్తరాష్ట్రములలో నీ ప్రవృత్తి మిక్కిలి యనుభవములోనికి వచ్చుచు సంఘమునందును రాచరికమునందును బ్రజాధికారమెక్కువ యగుచున్నది. అచ్చట నెవరి జీవితపద్ధతి వ్యయముతోఁగూడి డాంబికముగనుండుటచేత నెక్కువమందికి నందుబాటులో నుండక యసహ్యాకర మగునో యట్టివారి డాంబికత్వము బహుజనాభిప్రాయ బలముయొక్క యొత్తుడుచేత నడుగంటుచున్నది. ఈ రాష్ట్రములలో విస్తారము రాఁబడిగల

వాఁడు ప్రజల కనవసరము కానిరీతిని దన ధనమును వినియోగపఱచుటకు మార్గములను గానక కష్టపడుచున్నాఁడు. ఇటువంటి వాక్యములు యథాస్థితిని దెలియఁజేయవి యతిశయోక్తులగుటసత్యమే కాని, వీనివలన గ్రహింపవలసిన స్థితిమాత్ర మసంభవమును దుర్గ్రాహ్యమును గాదు. ప్రజాధికారమెక్కువై, వివిధవ్యక్తులయొక్క ధనవ్యయమార్గములను నిషేధించుటకు వారి కధికారమున్నదను నభిప్రాయము దీనికిఁదోడ్పడినప్పుడు, బహుశా యిట్టి స్థితిలభింపవచ్చును. సమాజమందు జనులయొక్క యక్కఱనుబట్టి ధనవిభాగము కావలెనను నభిప్రాయములు హెచ్చుగ వ్యాపించినయెడలఁ గాయకష్టముచేత సంపాదింపనిరాబడిని గాని, కొద్దిపాటియాస్తికంటె నెక్కువయాస్తిని గాని, కలిగియుండుట బహుజనముల దృష్టికి గర్హ్యముగఁ గాన్పింపవచ్చును. ఇటువంటి యభిప్రాయములు శిల్పకారులలో నిదివఱకే విస్తారముగవ్యాపించి, వారిమనోభావమునకు వశులైనవారినందఱను, అనఁగా, వారిశాఖలో వారిని మిక్కిలి బాధించుచున్నవి. పనివాండ్రలో బాగుగఁబనిఁజేయలేనివారే విస్తారముగనున్నారు, వారుమంచివారితోఁ బాటుకూలి కావలెనని తప్పకకోరుచుందురు. అధికనైపుణ్యముచేతఁగాని, కష్టముచేతఁగాని కొద్దిపనిఁజేసినయెడలను, ఇంక వేఱువిధముగనైనను ఇతరులకంటెనధికముగ సంపాదించుట కెవ్వరికి నధికారములేదని వీరుభావించుచుందురు, నిపుణులగు పనివాండ్రు విశేషోపయోగమగుపనిఁజేసి యెక్కువకూలిసంపాదింపకుండఁగను వారియజమానులెక్కువకూలినివ్వకుండఁగ నొత్తుడుచేయుచుందురు. ఒకప్పుడు శరీరనిరోధరూపమునఁ బరిణమించుచుండును. వ్యక్తివ్యవహారములలో లోకులకు జోక్యముకలుగఁజేసికొనుట కధికారమేయున్నయెడల, వీరియందు నాకుదోషము గాన్పించుటలేదు. జనులుసామాన్యముగ నితరజనుల మీఁద నధికారమును వహించునట్టులనే, వ్యక్తిప్రవర్తనమందుఁగూడ నావ్యక్తితోఁజేరిన జను లతనిప్రవర్తనము బాధించి నప్పుడు వారిని నిందింపవలసిన పని కనఁబడదు.

కాని యిట్టివిషయములను గేవల మూహింపవలసినపనిలేదు. ఈ కాలములో వ్యక్తిస్వాతంత్ర్యమునకు సాక్షాత్తుగ నక్రమమైన నిరోధము ఘోరముగ జరుగుచున్నది. ఇంతకంటె నెక్కువ ఘోరములైన యాటంకములు జయప్రదముగఁగలుగ వచ్చునని భయముకలుగుచున్నది. లోకులకుఁదప్పనితోఁచిన వానిని నిషేధించు శాసనములను జేయుటయేకాక, యీదోషములను బట్టుకొను నిమిత్తము నిర్దోషములైన యంశములను గూడ నిషేధించెడు శాసనములను జేయనధికారము వారి కపరిమితముగ నున్నదనిప్రతిపాదించుచుఁ గొన్ని యభిప్రాయములు విచ్చలవిడిగనున్నవి.

మఱికొన్ని దృష్టాంతములు.

సురాపాన మమితము కాకుండ నాటంక పఱచెదమని పేరు పెట్టి, ఇంగ్లీషు వారధివాసములోని జనులును, సంయుక్తరాష్ట్రములలో దాదాపుగ సగముమందియు, వైద్యము నిమిత్తము తప్ప మత్తునిచ్చుపానములన్నిఁటిని నిషేధించు శాసనములఁజేసిరి. ఎందుచేతననఁగా విక్రయమును నిషేధించుట వలన నుపయోగమునకు నాటంకము కలుగుచున్నది. నిజముగ నాశాసనము యొక్క యుద్దేశము కూడ నట్లే యున్నది. ఇట్టి శాసనమును వ్యవహారములోఁబెట్టుట యసాధ్యముగఁ గన్పించి నందున, దానిని మొట్టమొదటఁగల్పించి నామకరణముఁజేసిన రాష్ట్రము నందును, నింక జాల నితరరాష్ట్రములందును గూడ దాని కుచ్ఛేదనము గలిగెను. అయిన నీదేశములో లోకహితపరులమని పేరుపెట్టుకొనిన వారిలోఁ జాలమంది యిటువంటి శాసన మిక్కడఁగూడఁ గల్పించ వలెనని కృషి మొదలుపెట్టి గొప్పపట్టుదలతోఁ బనిఁజేయుచున్నారు. ఇందు నిమిత్త మేర్పడిన సభవారు, వారికార్యదర్శికిని, ఆంగ్లేయులలో బ్రసిద్ధుఁడైన యొక ప్రముఖునికిని జరిగినయుత్తరప్రత్యుత్తరములను బ్రచురము చేయుటవలనఁ గొంతప్రసిద్ధిని సంపాదించిరి. ఈయన రాజకార్యస్థుల యభిప్రాయములు కొన్ని ధర్మసూక్ష్మముల ననుసరించి యుండవలయునని తలంచుచుండును. ఇట్లుతలంచువారు మిక్కిలికొద్దిమందిగలరు. ఈయనపేరు లార్డుస్టాన్లీ.

దృష్టాంతము.

ఈయన కీయుత్తర ప్రత్యుత్తరములలోఁ గలసంబంధమునుబట్టి యీయన మీఁద నింతవఱకుంచినయాశలిప్పు డెక్కువవృథపడఁగలవు. రాజకీయవిషయములందు జోక్యముకలుగఁజేసికొనినవారిలో సాధారణముగఁగనఁబడనిగుణము లీయన యందుఁగలవు. తక్కినవారి కీగుణములు లేకపోవుటెంతయు దురదృష్టము. పైనిఁజెప్పిన సభవారిపత్రిక యిట్లనుచున్నది. "ఈసభవారికి మతావేశమున, మతసంబంధమైన హింసనుసమర్థించుట కక్కఱకు వచ్చునే న్యాయము నంగీకరించుట మిక్కిలిశోచనీయముగఁ గాన్పించుచున్నది. అయిన నిట్టిన్యాయములకును, ఈసభవారి సిద్ధాంతములకును, జాలదూరము గలదు". "ఈభేద మలంఘనీయ"మని వారిపత్రిక పలుకుచున్నది. ఇక స్ట్రాక్లీగారు చెప్పునదేమనఁగా "ఆలోచనము, అభిప్రాయము, సదసద్విచారణ విషయములు, రాచరికపుశిక్షకు లోఁబడినవి కావు. కాని సాంఘికములైన చర్యలు, అభ్యాసములు, సంబంధములు, నాశిక్షకులోనైనవి. వీనివిషయములో నుచితానుచితవిచారణము రాచరికపువారిదే కానివ్యక్త్యధీనము కాదు." ఈయన యీరెండు తరగతులలోఁ జేఱనిమఱియొక తరగతి నెత్తుకొనుటయే లేదు. సాంఘికములు కాక వ్యక్తిసంబంధములైన చర్యలును, అభ్యాసములును, ఈతరగతిలోనివి. మత్తుకలుగఁజేయు పదార్థములు గూడ నిశ్చయముగ నీతరగతిలోనివే. అయినను, వాని విక్రయము వర్తకము గనుక సాంఘికచర్యయనిపించుకొనును. కాని మధుపానము చేయు వానికాపదార్థముఁ దొరకకుండఁ జేయుటవలన వానిని మధు పానమునుండి రాచరికపు వారాటంకపఱచుటయే యగును. కనుక వ్యక్తిస్వాతంత్ర్యమునకు ననఁగా నాపదార్థములను గొనియనుభవించెడు స్వాతంత్ర్యమునకు భంగము కలుగుచున్నది. ఇదియే మాయాక్షేపణము. విక్రయించువారి స్వాతంత్ర్యమునకు భంగము కలిగెనని మేము విచారించుటలేదు. పైనిజెప్పినకార్యదర్శిగారు తాను పౌరుఁడుగనుక తనసాంఘికస్వత్వములకితరుని సాంఘికచర్యలవలన భంగము కలిగినప్పుడు తాను రాజకీయములైన దండనములను విధించుట కధికారము గలదని వాదించుచున్నారు. కాన నిఁక నీసాంఘిక స్వత్వముల నెట్లు నిర్వచించుచున్నారో చూతము. తనసాంఘిక

స్వత్వములకు భంగకరముగునదే మైననున్న యెడల నిశ్చయముగ నది మధుపాన వికి్రియ యమేనఁట. ఈవికి్రియను తనకునిరంతరము సాంఘికమైన తొందరను గల్పించి, దానికిఁ బో్రిత్సాహమును గలుగఁజేయుటవలన, ( దనకుపా్రియశా ఉండవలసిన క్షేమమునకు భంగము గలిగించుచున్నదఁట, ఈవికి్రియమువలన లాభముకలుగవలెననిఁ గొందఱు దుఃఖభాజనులు కావలసియున్నారు. వీరి దుఃఖమును దీర్చుటకుఁ దనమీఁదఁబన్నులు పడుచున్నవిగనుక, నీవికి్రియము తన్ను సంఘములోఁ దక్కినవారితో సమానముగ నుండకుండ బాధించుచున్న దఁట. సంఘములో నొకరితో నొకరు సంసర్గముగలిగి, యొకరివలన నొకరు సాహాయ్యముఁ బొందుటకు స్వత్వముగలదు. అయినను మత్తుకలుగఁజేయు పానీయముయొక్క విక్రయమువలన సంఘము దుర్బలమై భ్రిష్టమగుచుండును గనుక తనసుఖజీవనమును విపత్తులపాలుచేయును దీనివలనఁదాను,నీతియందు, బుద్ధివిషయమునను నిరాటంకమైన వృద్ధిఁజెందకుండ నడ్డముగలిగి తనస్వత్వ మును భంగపఱచుచున్నదఁట. సాంఘికస్వత్వములను గుఱించి యిట్టిసిద్ధాం తమును బహుశా యిదివఱకెన్నడుఁ నింతస్పష్టములైన మాటలతో నెవ్వరును జెప్పియుండరు, ఈసిద్ధాంతప్రికారము ప్రతివ్యక్తియుఁ ప్రితివిషయమునను గేవలము యథావిధిగ నడచుకొనునట్లు చేయుటకుఁ బ్రితియితర వ్యక్తికిని సంపూర్ణమైన సాంఘిక స్వత్వము గలదని యు, నెవరయిన నెంత స్వల్పాంశమునయిన నట్లుజరిగింపక పోయినచో నితరునియొక్క సాంఘికస్వత్వమునకు భంగముచేసినవారగుదురు గనుక రాచ రికపురీతి నాపీడను దొలగించుట కితరునికి హక్కుగలదనియుఁ దేలుచున్నది. స్వాతంత్ర్యిమునకుఁగలిగెడిభంగములన్నిటికంటె నీవిపరీతసిద్ధాంత మెక్కుడు నుపద్రివకరముయినది. దీని ప్రికారము సమర్థనీయముగాని భంగ మేదియు లేదు. ఎన్నఁడును బయలుపెట్టకుండ రహస్యముగ నభిప్రాయములను గలి గియుండుటకుఁదప్ప వేఱువిధమయిన స్వాతంత్ర్యిమున కెంతమాత్రమును స్వ త్వమున్నట్లు ఈసిద్ధాంత మొప్పుకొనదు. ఎందుకనఁగా నాకు దుష్ట మని తోచెడి యభిప్రాయ మెవని పెదవియయిన దాఁటి బయటపడిన తక్ష

ణమే పైనఁ జెప్పిన సభవారు నాయందారోపణముచేసెడి సాంఘికమైన స్వత్వములన్నిఁటికిని భంగము కలుగుచున్నది. ఈసిద్ధాంతము మానవజాతిలో నొకరియొక్క నీతి, బుద్ధి, శరీర సంబంధమయిన సంపూర్ణాభివృద్ధియందు మఱియొకరికి స్వప్రయోజనపరమైన యభిమానమును గల్పించి, దానిని బ్రతి మనుజుఁడును తన పరిమాణప్రకారము నిరూపణముచేయుట కధికారము నొసంగుచున్నది.

దృష్టాంతములు.

వ్యక్తిస్వాతంత్ర్యమున కక్రమముగ భంగము గలుగునని భయమును బుట్టించుట యేకాక యిదివఱకుఁజాలకాలము క్రిందనే సాక్షాత్తుగ సంప్రాప్తమైన యుపద్రవమునకు నిదర్శనముగ విశ్రాంతి దినసంబంధమైన (ఆదివారము నాఁడు పనిచేయఁగూడదను) శాసనమును జూపింప వచ్చును. జీవయాత్రలో వీలున్నంత వఱకు వారమున కొకనాఁడు నిత్యకృత్యముల నుండి విరామము నొందుట నిశ్చయముగ లాభకరమైన యాచారమేకాని, యిది యూదుల విషయమునఁ దప్ప తక్కిన వారికి మతరీతిని బట్టి విధాయకమైనది గాదు. మఱియుఁ గష్టపడి పనిఁజేయు వారందఱు నీవిరామమునకు సామాన్యముగ నొప్పుకొనని యెడల, నీయాచారమును నడపుటకు వీలుండదు గనుకను, కొందఱుపనిఁజేయుట వలనఁ దక్కినవారికిఁగూడఁ బనిఁజేయ నావశ్యకము గనుకను, నొకదినమున నెక్కువకష్టముగల కార్యములనన్నిఁటివిరమింపఁజేసి, ప్రతిమనుష్యునికి నీయాచారమును నడపుట సాధ్యమగు నట్లందఱను బలవంతము చేసెడి శాసనము సమర్థనీయమును, క్రమమును గూడ నగును. ఈ యాచారమును బ్రతిమనుజుఁడును నడపుట వలన నితరులకు సాక్షాత్తుగ లాభము కలిగి నంతమట్టుకు మాత్రమే శాసించుటసమర్థనీయము గనుక నెవఁడుగాని తనతీఱికను దనకిష్టము వచ్చిన చొప్పునను, దనకుఁ గ్రమమని తోఁచినరీతిని వినియోగపఱచు కొను విషయమున నీశాసనము వర్తింపదు. ఇంతియకాక, విలాసార్థములైన క్రియలను శాసనములమూలమున నిషేధించుటకీకారణము లేశమాత్రమును జాలదు. ఒకరి విలాసము నిమిత్తము మఱి యొకరు

నిశ్చయముగఁ బనిఁజేయవలసియుండును. కాని, యీవిలాసమే విశ్రాంతిగఁ గూడ నుపయోగపడును. ఎట్లైనను జాలమంది కిదిలభించునిమిత్తము కొద్దిమందికష్టపడుటమంచిది, అయిననీకష్టమును వారు స్వబుద్ధిని స్వీకరించి స్వబుద్ధిని నిరాకరించుట కవకాశముండవలయును. ఆదివారమునాఁడందఱను బనిఁజేసినయెడల నాఱుదినములకూలికి నేఁడుదినములు పనిఁజేయవలసియుండునని పనివాండ్రుతలంచుట మిక్కిలిన్యాయము. కాని, యాదినమునఁ జాలపనులకు విరామముగలిగియుండునుగనుకఁ గొద్దిమందిమాత్రము తక్కినవారివిలాసమునకై పనిఁజేసిదానికిఁదగినట్లెక్కువకూలిసంపాదింతురు. ఇంతియ కాక కూలిని సంపాదించుటకుబదులుగఁ దీఱికఁగనుండుటవారికెక్కువ యిష్టమైనచో వారాపనులను జేయవలసినదని నిర్బంధములేదు. ఇంకనింతకంటె నెక్కువపరిహారముకావలెనన్నయెడలఁ బ్రత్యేకమీతరగతిజనుల నిమిత్తము వారములో మఱియొకదినమును విశ్రాంతిదినముగనుంచు నాచారము నేర్పాటుచేయవచ్చును. కాఁబట్టి యాదివారమునాఁడు వినోదముల నిషేధించుటకవిమతమునుబట్టిమాన్యములని కారణముచెప్పిసమర్థింపవలసియుండును. శాసనముఁజేయు విషయములో నీకారణము పనికిరాదని యెంతపట్టుదలతో ఖండించినను తనివితీరదు. ఈశ్వరద్రోహమునకుదండన మీశ్వరునివలననే కలుగవలయునుగనుక సంఘముగాని, సంఘములోని యుద్యోగులుగాని మానవజాతికి హానికరమగుదాని నిమిత్తమే కాక, సర్వేశ్వరునియెడల నపరాధాభాసములనిమిత్తము కూడనెవరినైనఁ దండింపకపూర్వము వారు పరమేశ్వరునుండి యధికారముబొందినట్లు ధ్రువపడవలసియున్నది. ఒకమనుష్యుఁడు మఱియొకని ధర్మమార్గమున నుంచుట తనవిధియనుభావనయే యిదివఱకు జరిగిన మతవిషయిక హింసలన్నిఁటకిని హేతుభూతమైయున్నది. ఈహేతువు నంగీకరించినయెడల నాహింసలన్నిఁటిని సమర్థింపవచ్చును. ఆదివారమునాఁడురెయిలు ప్రయాణమునకును, చిత్రశాలలను దెఱచుటకును, ఇంకనట్టియితరకార్యములకు నాటంకముగలిగించుటకుజరిగెడి యత్నరూపమున బలుమాఱు వెలుపడుచుండు మనోవృత్తి పూర్వకాలపు

హింసకులమనోవృత్తి యంత క్రూరము కాకపోయినను, నవిరెండును సహజముగ నొక్కజాతిలోనివే. హింసకుని మతప్రకార మంగీకారముగానప్పుడు, ఇతరులమతప్రకార మంగీకారములైనను, ఆకార్యములను సహింపఁగూడదను నిర్ధారణమే దానికిలక్షణము. నాస్తికులకార్యములను బరమేశ్వరుఁడసహ్యించుకొనుటయే కాక వారికి నొత్తుడు కలిగింపక యూరకపోనిచ్చిన వారిని గూడ నపరాధులనుగఁ జూచునెడు నమ్మక మీమనోవృత్తికి నాధారమై యున్నది.

దృష్టాంతము.

''మార్మనిజము'' (బహుభార్యత్వము) అను విచిత్రచర్యనుగుఱించి ప్రసంగించ వలసివచ్చినప్పుడెల్ల నీదేశములోఁ బత్రికాముఖముననేవలము క్రూరదుర్భాషణము వెలువడుచుండును. దీని వలనమానవుల స్వాతంత్ర్యమును సామాన్యముగ నెంతలెక్క చేయకుందురో నిదర్శన మగుచున్నది గనుక దాని నిదివఱకుఁ జెప్పిన నిదర్శనములతోఁ బాటుగ నెత్తుకొనక తప్పదు. క్రొత్తగ భగవ దాదేశమువచ్చెనని చెప్పి, దానియాధారమున నొకనూతన మతమును స్థాపించిరి. ఇదివట్టిమోసము. దీనికిఁ గారకుఁడగువానియందు విశేషగుణప్రతిష్ఠాగౌరవముగూడఁగాన్పింపదు. అయిననీమతమును లక్షలకొలఁది జనులునమ్మి యొకసమాజముగ నేర్పడిరి. పత్రికలు' ధూమశకటములు, తంత్రీవార్తలు, కలిగియున్న యీకాలములో హఠాత్తుగ సంభవించిన యీసంగతి మిక్కిలిబోధావహము. దీనిని గుఱించి యెంతచెప్పినను జెప్పవచ్చును. ఇక్కడ విచారింపవలసిన సంగతులేవనఁగా, దీనికంటె శ్రేష్ఠములైనయితరమతములనిమిత్త మెట్లో, దీనినిమిత్తము నట్లే ప్రాణమును ధారపోసిన వారుగలరు. ఈమతమును స్థాపించిన యాచార్యుని దానినిబోధించి నందునకు ప్రాకృతజనులు పట్టుకొనిచంపిరి. ఆమతము నవలంబించిన వారిలో కొందఱు గూడ నట్టులనే దురితమైన ఘాతుక మరణముచేఁబ్రాణములఁ గోల్పోయిరి. వారుద్భవించినదేశమునుండి యొక్కపెట్టున బలవంతముగ వెడలఁగొట్టఁబడిరి. ఇప్పుడువారుతఱిమివేయఁబడి యరణ్యమధ్యమున నేకాంతముగ వాసముచేయుచున్నను, నీదేశములోని చాలమంది

వారిమీఁదికిదండయాత్రను నడపించి, యితరజనుల యభిప్రాయమున కనుగుణముగ నుండుఁడని వారికిఁ దొందరకలుగఁజేసి, బలవంతపెట్టుట న్యాయమని బహిరంగముగ వాదించుచున్నారు. ఈకార్యమునకు వీలుమాత్రము లేకయున్నది. మార్మనులు బహుభార్యత్వమునంగీకరించుటయే సామాన్యములైనమతసహన నియమముల నతిక్రమించి, యీవిధముగ వెలువడుచుండెడియాగ్రహమునకు ముఖ్యకారణమైయున్నది. బహుభార్యత్వము హిందూమహమ్మదీయుల విషయమునను చీనాదేశస్థుల విషయమునను అంగీకారమైనను, ఆంగ్లేయభాషను మాటాడుచు నొకవిధముగాఁ గ్రైస్తవులనిపించుకొనువారా యాచారము నవలంబించినపు డుపశమింపరాని యాగ్రహము కలుగుచున్నది. ఈమార్మనులయాచారమును నాకంటె నెక్కువ నసహ్యించుకొనువారు లేరు. ఈఅసహ్యమునకుఁ జాలకారణములు గలవు. స్వాతంత్ర్యమను ధర్మమునకీయాచార మనుకూలముకాక పోఁగా నాధర్మమును సాక్షాత్తుగ భంగపఱచుచుండుట విశేషకారణము. దీనివలన సంఘములోని సగముమందికిఁ గేవలబంధనములును, దక్కినసగముమందికివీరియెడ బాధ్యతయేమియు లేకుండ స్వేచ్ఛయును,సంప్రాప్తమగుచున్నది. అయిన నీవివాహ పద్ధతిలోఁ జేరి, దీనివలన బాధనొందుచున్న స్త్రీలితర వివాహ పద్ధతులలోవలెనే దీనికిని స్వబుద్ధి నొప్పుకొనుచున్నారు. ఇదియెంత యాశ్చర్యకరముగఁ గాన్పించినను దీనికిఁగారణము లేకపోలేదు. లోకములో సామాన్యముగ స్త్రీలకువివాహమొక్కటియే యత్యావశ్యకమని భావించుచు, దానికిఁదగిన యాచారములేర్పడియున్నవి. కనుక చాలమంది స్త్రీలు కేవలము వివాహము లేకుండుటకంటె బహుభార్యలలో నొకరుగ నుండుటకైన నెందుకిష్టపడుదురో మనకు బోధపడఁగలదు. మార్మనుల సిద్ధాంతములనుబట్టి వారితరదేశములవారినీవివాహపద్ధతుల కొప్పుకొనుఁడనిగాని, వారిలోఁగొంతమందినైన వారినియమములనుండి తొలఁగింపుఁడనిగాని కోరుటలేదు. ఇంతియకాక నూతనశాఖవారైనమార్మనులు, వారికివిరోధముగనుండు మనోవృత్తులను న్యాయముగ మన్నింపవలసిన దానికంటెనధికముగ మన్నించియున్నారు. వారిసిద్ధాంతము

అంగీకారముకాని దేశములనుండి లేచిపోయి, లోకములో నెక్కడనో యొక మూలఁజేరి, దానిని వాసయోగ్యముగఁ జేసికొనిరి. వారితరజాతులవారిమీఁదికిఁ బోక, తమపద్ధతుల వలనఁ దృప్తి లేనివారు వెడలిపోవుట కొంతమాత్రమును నష్టము రాకుండునట్లు వారియిష్టమువచ్చిన పద్ధతుల ప్రకారము వారినుండనుండ నాటంకము చేయుట కేమిన్యాయముగలదో నూహింపఁ గష్టముగనున్నది. ఇట్లు చేయుట దౌష్ట్యముగఁ దోఁచెడిని. కొన్ని విషయములలో విశేషప్రజ్ఞావంతుఁడైనయొక నవీనగ్రంథకర్త, యీబహుభార్యాత్వమునంగీకరించిన సమాజముమీఁద మతము పేరిటఁగాకపోయినను నాగరికత పేరిటయుద్ధము చేసి, ఇట్లు వెనుకంజ వేసినందునకు వారిని నాశము చేయవలసినదని చెప్పుచున్నాఁడు. నాకును వారిచర్య వెనుకంజగనే తోఁచుచున్నది. కాని యొకసమాజము మఱియొకసమాజమును నాగరికముగనుండు మని బలవంతపెట్టుట కేమిస్వాతంత్ర్యముగలదో నాకుఁదోఁచకున్నది. ఏపద్ధతితోఁగాని సాక్షాత్తుగ సంబంధముగలవారావిషయమున నాదుర్నయమువలన బాధపడువారితర సమాజముల సాహాయ్యముఁ గోరనంతదనుక తృప్తిఁ జెందియుండఁగా వారితో నెంతమాత్రమును సంబంధములేనివారు దానిలోఁ బ్రవేశించి, వేలకొలఁది యోజనముల దూరముననున్న తమకు దానివలన నగౌరవము కలిగినదను కారణముచేత నాపద్ధతిని నాశము చేయఁ బూనుకొనుటకు నే నెంతమాత్రము నొప్పుకొనను. ఇష్టమున్న యెడల దానిని ఖండించి బోధించుటకు బోధకులను బంపవచ్చును. తమలోనట్టిసిద్ధాంతములు వ్యాపింపకుండ నడ్డగించుట కేన్యాయమైనసాధనములను గాని నుపయోగించుకొనవచ్చును. కాని, యాసిద్ధాంతములబోధించువారి నణఁచివేయుట న్యాయముకాదు. ప్రపంచమనాగరికతలో మునిఁగి యున్నప్పుడు నాగరికత దానిని జయించియుండఁగా, నధఃపాతమైనయనాగరికత తిరిగితలయెత్తి నాగరికతను జయించునను భయమతిశయోక్తిగఁ గాన్పించుచున్నది. నాగరికత చాలభ్రష్టతఁ జెందినఁ గాని తనవలన నిర్మూలమైన శత్రువునకుఁ దానిట్లులొంగిపోవుట తటస్థింపదు. ముందుగనిది తటస్థించుటచేతనే నాగరికతనిమిత్తమేర్పడినయాచార్యులకును

బోధకులకును, ఇతరులకును గూడ, శక్తిహీనమై దానియందభిమానమును; శ్రద్ధయును దగ్గిపోవును. నాగరికత కీగతిపట్టినపుడు దానినెంతత్వరలో వదలిపొమ్మని చెప్పిననంత శ్రేయస్కరము. లేనిచో నదియంతకంతకుఁ జెడిపోవును. కనుక యూరోపులోపశ్చిమ రాజ్యములందు జరిగినట్లే యది యనాగరికుల వలన నాశముఁజెంది యెక్కువ ప్రశస్తమైనరీతిని బునర్నిర్మాణము కావలసియుండును.

:0:

# పంచమాధ్యాయము.

## ప్రయోజనములు.

ప్రయోజన నియమము

ఈ విషయమును సవిస్తరముగ విచారించుట కాధారముగ నీగ్రంథములో నింతవఱకుఁ బ్రతిపాదించిన న్యాయముల నెక్కువ విపులముగ నంగీకరింప వలసియున్నది అట్లు జరుగకపూర్వమా న్యాయములను వివిధములైన రాజ్యాంగ, నీతిశాస్త్రాంగములలో నవిరుద్ధముగఁ బ్రయోగింప యత్నించుటవలన లాభము కలుగఁబోదు. నేనిపుడు చెప్పఁబోవు సంగతులవలన నా న్యాయములు దృష్టాంతపడునేకాని వానిపర్యవసానము పూర్ణముగఁ దేలఁజాలదు, నేనిప్పుడు ప్రయోజనములను జూపింపఁ బూనుకొనలేదు. ప్రయోజనములలోఁ గొన్ని దృష్టాంతములను మాత్రము చూపించెదను. వీనివలననీయావదుపన్యాససారములైన రెండుసూత్రముల పరిమితియు, వ్యాప్తియు, నెక్కువస్పష్టపడఁగలవు. మఱియు వీనివలన నా రెండు సూత్రములలో నేది ప్రయోగార్హమగునో తెలియని సందిగ్ధాంశములలో రెంటిని సమానగౌరవముతో విమర్శించుటకు సాహాయ్యముకలుగును.

రెండుసూత్రములు

ఆ సూత్రములెవ్వియనిన; మొదటిది, వ్యక్తి వ్యాపారమువలన నితరుల లాభముతో సంబంధములేనంతవఱ కా చర్యలవిషయమై వ్యక్తికి సంఘము విషయమైన బాధ్యతలేదు. అచర్య లితరుల కనిష్టమును, అనంగీకారమును, అయినయెడల వారు వ్యక్తికి హితోపదేశముఁజేసి, జ్ఞానముకలుగఁజేసి, బోధపఱచి స్వసంరక్షణార్థ మావశ్యకమైనయెడల వానినుండి యొత్తిగిలుటమాత్రము క్రమమగును. రెండవది, ఈ చర్యలితరుల లాభమునకు భంగకరములుగ నున్నపుడు వ్యక్తి సంఘమునకు

బాధ్యపడియుండుట క్రమముగనుక, సంఘము స్వసంరక్షణార్థమై తనకు యుక్తమని తోఁచినట్లు సాంఘికకీర్తిని గాని, రాచరిక పుకీర్తిని గాని వ్యక్తికి దండనములను విధింపవచ్చును.

సూత్రవ్యాప్తి

ఇతరులకుఁ జెఱుపు జరిగినపుడు గాని, జరుగునని యనుమాన మున్నపుడు గాని, సంఘము జోక్యమును గలుగఁజేసికొనుట సమర్థనీయమని చెప్పినంతమాత్రమున నట్టి జోక్యమెల్లపుడును సమర్థనీయము కాదని మొట్టమొదట గ్రహింప వలసియున్నది. ఒకరు న్యాయమైన ఫలమును బొందుటకుఁ బ్రయత్నము చేయుటలో పెక్కుసారులితరులకు బాధనుగాని నష్టమునుగాని కలిగింపవచ్చును. లేదా వారుపొందెదమని క్రమముగ నాశపెట్టుకొనియున్న లాభమున కడ్డము రావచ్చును. ఇది యనివార్యముగనుక న్యాయమే యగును. సంఘములోని యేర్పాటులు చెడ్డవిగ నుండుటవలన వ్యక్తులలాభముల కిట్టివిరోధములు సంభవించుచున్నవి. కాని యాయేర్పాటులు వ్యవహారములోనున్నంతవఱకు కావిరోధము లనివార్యములు. ఇంతియకాక యెట్టియేర్పాటులున్నను గొన్నివిరోధము లనివార్యములగును.

దృష్టాంతము

ఎవ్వఁడేని బహుజనాపేక్షితమైన వృత్తిలోఁ బ్రవేశించి ఫలముఁ జెందినపుడును, పరస్పర స్పర్థగలిగిన పరీక్షలో నాటితేలినపుడును, ఇద్దఱేకఫలాపేక్షితులై నపుడొకనికి మాత్రమే ఫలసిద్ధి కలిగినపుడును, ఇతరులు నష్టపడినఁగాని ఇతనికిలాభము కలుగదు. వారిప్రయత్నములు వ్యర్థములై వారికాశాభంగమగుటవలన నితఁడులాభమును బొందుచున్నాఁడు. కాని, యిట్టిపర్యవసానములను గణింపక వివిధజనులు వారివారిఫలము నాశ్రయించుటయే మానవజాతికి మొత్తముమీఁద నెక్కువ శ్రేయస్కరమని యందఱు నంగీకరించుచున్నారు. దీనినిబట్టి యాశాభంగముఁజెందినస్పర్థాళువులకిట్టి బాధరాకుండఁజేయుటకు రాచరికముగఁగాని నీతివిషయముగఁగాని యేవిధమైన స్వత్వమును సంఘమంగీకరింపదనియు, సంఘముయొక్క శ్రేయస్సునకు భంగకరమైన సాధనము ననఁగా మోసమును లేక ద్రోహమును బలాత్కారము నుపయోగించినపుడు మాత్రము సంఘముజోక్యము కలుగఁజేసికొన నంకించుననియు గ్రహింపవచ్చును.

ఇంకొకటి; వర్తకముకూడ సాంఘికచర్య యనిపించుకొనును. ఎవ్వఁడేని యేవిధములైనవస్తువులనైన విక్రయింపఁబూనినపుడు దాని కితరులలాభముతోడను, మొత్తముమీఁదయాపత్తుసంఘముయొక్క లాభముతోడను జోక్యముగలిగియుండును. కనుక వానిప్రవర్తనము న్యాయముగ సంఘాధికారమునకు లోఁబడియుండును. ఈ

మఱియొక దృష్టాంతము.

కారణముచేతఁ బూర్వకాలమునందు ముఖ్యమనితోఁచిన విషయములన్నింటిలోను దొరతనమువారు వస్తునిర్మాణమును నడపించి, వెలల నియమింపవలసిన విధియున్నదని తలంచుచుండిరి. కాని, వస్తువులను జేయువారిని, అమ్మెడు వారినిగూడ సర్వస్వాతంత్ర్యముగ వదలివేసి, కొనెడువారి కిష్టము వచ్చిన చోట వస్తుక్రయము చేయుటకుసమానస్వాతంత్ర్యమును సంపాదించు నియమముండిన యెడల మంచివస్తువులుచౌకఁగ దొరకుటకెక్కువ సార్థకమైన యవకాశమేర్పడునని యిప్పుడు తలంచుచున్నారు. ఈభావమెంతో కాలము పెనఁగులాడినపిమ్మటఁ గాని కుదిరినది కాదు. దీనినే స్వేచ్ఛావాణిజ్య (FreeTrade) మందురు. దీనికాధారములైనహేతువు లీయుపన్యాసములోఁ బ్రతిపాదించిన; వ్యక్తిస్వాతంత్ర్యన్యాయముకంటె భిన్నములైనను, దానితో సమానమైనబలమును గలిగియున్నవి. వ్యాపారమునకుఁగాని దానినిమిత్తమైనవస్తునిర్మాణమునకుఁగాని కలిగించెడి యాటంకములు నిజముగ నాటంకములే. ఆటంకమనునది సహజముగ సర్వత్రిదుష్టమైనది. అయినను బ్రస్తుతవిచారణములోఁ జేరినయాటంకములు సంఘనిబంధనమునకు లోఁబడిన పరివర్తనాంశమును బాధించుచున్నవి. కనుకనవి యేఫలము నుద్దేశించి యేర్పడెనో యాఫలమునుగలిగింపలేక పోవుటయే వానిమీఁది విశేష యాక్షేపము. స్వేచ్ఛావాణిజ్య సిద్ధాంతములో వ్యక్తిస్వాతంత్ర్యసిద్ధాంత మంతర్గర్భితము కాదు. కనుక మొదటి సిద్ధాంతముయొక్క వ్యాప్తినిగుఱించిన వివాదములతో రెండవదానికిఁ జాలవఱకు సంబంధములేదు. దీనికి దృష్టాంతము; ఇతరవస్తుసమ్మిశ్రమమువలన మోసముజరుగకుండఁ జేయుటకు లోకు లెంతవఱ కధికారము పూనుటక్రమమగును? అపాయకరములైన వ్యాపారములలోఁ

బనిఁజేయుకూలివాండ్ర కపాయము కలుగకుండఁగా పాడుటకుఁగాని యారోగ్యమును రక్షించుటకుఁగాని యేర్పాటులనుజేయుఁడని వారియజమానుల నెంతవఱకు నిర్బంధించవచ్చును? ఇట్టివిచారణములలో నితరబాధలు లేనపుడు జనులను నిర్బంధము చేయుటకంటె స్వేచ్ఛగవదలి వేయుట సర్వత్రి యెక్కువబాగుండునను కారణమునుబట్టి, అంతవఱకుమాత్రమే స్వాతంత్ర్య విషయమునకు సంబంధముగలదు. కనుక నీవిషయములలో వారిని నిర్బంధపఱచుటక్రమమనున్యాయమునిర్వివాదాంశమైయున్నది. కాని, పక్షాంతరమున వ్యాపారముతో జోక్యముగలుగఁ జేసికొనినవిషయములు ప్రాయికముగ స్వాతంత్ర్యవిషయములుగ భాసించుచున్నకొన్ని సంగతులుగలవు. దీనికి నిదర్శనముగ, మెయినుగారిశాసనము(The Maine Law) నిదివఱకేచూపించియున్నాము. చీనాదేశములోనికి నల్లమందును దీసికొనిపోకుండ నిషేధమును, విషములను విక్రయించుటలో నాటంకమును, ఇంతయేల, యేదైన నొకవస్తువు లభించుట కష్టముగఁగాని యసాధ్యముగఁగాని చేయునిమిత్తము జోక్యమునుగలుగఁజేసికొను సర్వవిషయములును, దీనికి నిదర్శనములనిపించుకొనును. ఈ యాటంకములు వస్తునిర్మాణముఁ జేయువానియొక్కగాని విక్రయికుని యొక్కగాని స్వాతంత్ర్యమునకు భంగకరములుకావు. కాని, క్రయికుని స్వాతంత్ర్యమునకు భంగము కలిగించుటవలన నాక్షేపణీయము లగుచున్నవి.

విషవిక్రయ విచారణము

ఈ నిదర్శనములోని విషవిక్రయమువలనఁ గ్రొత్త సంగతియొకటి యేర్పడుచున్నది. దొరతనములో నారక్షక శాఖవారి (police.) యధికారమునకుఁ గ్రమమైన పరిమితియెక్కడ? నేరము గాని యుపద్రవము గాని సంభవించకుండ నాపుచేయుటకు స్వాతంత్ర్యము నెంతవరకు నాక్రమించుట న్యాయము? నేరము జరిగినపిమ్మట దానిని గనిపెట్టి దండించినట్లే యానేరము జరగక పూర్వమది సంభవించకుండ జాగ్రత పఱచుట కూడ నిశ్చయముగ దొరతనము వారిపనియై యున్నది. అయినను దండనక్రియకంటె నాటంకక్రియ యెక్కువ సులభముగ దుర్వ్యాప్తికిఁబాలుపడి స్వాతంత్ర్యమునకు భంగముఁగావింపవచ్చును. ఎందుకన, మానవులకుఁ గ్రమ

మైన క్రియాస్వాతంత్ర్యములో నేభాగమునైన ననర్థాభివృద్ధిహేతువని యుక్తాయుక్తముగఁ గనబఱచుట కష్టముకాదు. అయిన నధికార పురుషుఁడుగాని సామాన్యజనుఁడుగాని ఎవ్వఁడైన నేరము జరిగించుటకు యత్నించుచున్నట్లు స్పష్టముగఁగనిపెట్టినపు డా నేరము జరుగువఱకు నూఱక చూచుచుండుట వారికి విధి గాదు. దానిని నివారించుటకు జోక్యము గలుగఁజేసికొనవచ్చును. నరహత్యను జరిగించుటకు మాత్రమే విషములను గొనుటగాని యుపయోగించుటగాని తటస్థించుచుండిన యెడల వానిని జేయకుండఁగను విక్రయింపకుండఁగను ఆటంక పఱచుట క్రమమగును. కాని, విషము లపాయ రహితములైన పనులకేకాక యుపయోగ కరములైన పనులకుఁగూడ నక్కఱపడవచ్చును. కనుక వానినొక కారణముచేత నిషేధించిన యెడల వానిషేధము మఱియొక దానినిగూడ బాధించు చుండును. ఇంకొకటి, అధికారు లపాయములు సంభవింపకుండఁగాపాడుట న్యాయము. అపాయకరమని నిశ్చయపడిన వంతెనమీఁదుగ నెవ్వఁడేనిఁ బోవుచున్నప్పుడు, వానికి సంభవింపనున్న యపాయమును గుఱించి హెచ్చరించుటకుఁ గాలవ్యవధిలేని సందర్భములో వానిని జూచిన యధికారపురుషుఁడుగాని లేక యేయితర పురుషుఁడైననుగూడ వానిని బట్టుకొని వెనుకకుఁద్రిప్పినందువలన వాని స్వాతంత్ర్యమునకు భంగములేదు. ఎందువలననఁగాఁ నిష్టమువచ్చిన దానిని జేయుటయే స్వాతంత్ర్యము. అతనికేటిలోఁ బడిపోవుట కిష్టముండదు. అయినను జెఱుపు కలుగుట నిశ్చయముగాక కేవలము సందేహాస్పదమైనప్పు డాయపాయమును మీఁద వేసికొనఁ బ్రోత్సాహపఱచుటకుఁ జాలినంత హేతువున్నదా లేదా యనుసంగతి నాపురుషుఁడుతప్ప మఱియెవరును నిశ్చయపఱుపఁజాలరు. కనుక నిట్టి సందర్భములో నతఁడు బాలుఁడును పిచ్చివాఁడును, ఉద్రేకముఁ జెందినవాఁడును, లేక మఱియే యితరవిధముగనైన సంపూర్ణవిచారణ కనర్హుఁడైనపుడు తప్పలేని యెడల వాని కాయపాయమును జూపింప వలసినదేకాని దానిలోఁబడకుండ వానిని బలవంతముగ నాటంకపఱుపఁగూడదని నాయభిప్రాయము. విషముల విక్రయ

విషయమునఁగూడ నిట్టికారణముల మీఁదవిచారించిన యెడల దానిని నడపించుటలో నేమార్గములు క్రమములో యేవి యక్రమములోఁ బరిష్కరింపఁగలము. విషవస్తువు మీఁద దాని యపాయసూచకమైన గుర్తుగనొక మాటను ముద్రింపుమని బలవంతముచేసి, యపాయనివారణము చేయ యత్నించుటవలన స్వాతంత్ర్యమునకుభంగములేదు. ఎందుచేతననఁగా, నావస్తువుయొక్క విషగుణములు తెలియకుండ నుండవలెనని యేక్రయికుఁడును గోరుచుండఁడు. అయిన నన్ని సందర్భముల యందును వైద్యుని వలన నధికారమును బొందినట్లుపత్రమును జూపింపుమని నియమించినచో, నావిషవస్తువు క్రమమైన యుపయోగమునకుఁగూఁడఁ జిక్కుట యెల్లప్పుడును వ్యయప్రయాసములగుటయేకాక కొన్నివేళల నసాధ్యముకూడ నగును.

విషములవలన నేరముజరుగ కుండ నాటంకములఁగలిగించుచు, నావిష "ముల నితరపనులనిమిత్తము కోరెడివారి స్వాతంత్ర్యమునకు భంగముగా వింపకుండుటకు మార్గమొక్కటి నాకుసరియయినదిగఁ దోఁచుచున్నది. దీనికి పూర్వనిర్ణీతసాక్ష్యము" నిబెంతము చక్కని పేరుపెట్టియున్నాఁడు. ఈమార్గమువలన స్వాతంత్ర్యమున కేమైన భంగము గలిగిన నది యుపేక్షణీయము. జనులు పరస్పరమేర్పఱచుకొను నియమములలో నీవిధానమందఱకు సాధారణముగఁదెలిసిన విషయమే. ఒక నియమమేర్పడినపుడు దాని ప్రకారము చర్యజరుగునట్లు బలవంతపెట్టుటకు, (ఆ సంబంధుల) వ్రాళ్లు, సాక్షులవ్రాళ్లు మొదలగునవి విధిగనుండవలెనని చట్టములు సాధారణముగ నియమించుచుండుట క్రమము. నియమమునకుఁబిమ్మట నెప్పుడైన దానినిగూర్చి వివాదము కలిగినపుడా నియమము నిజముగజరిగియుండెననియు, దానిసంగతిసందర్భములవలన నది యక్రమము కాదనియు,నిరూపించుటకుసాక్ష్యమునిమిత్త మీలాంఛనములు జరుగవలసియున్నవి. వీనివలన నియమము లభూతకల్పనములు కాకుండఁగను, సంగతి సందర్భములు బైలుపడిన యెడల నక్రమములైపోవునియమములు జరుగ కుండఁగను, ఆటంకములు కలుగు చున్నవి.

నేరములకు సాధనములు కాఁదగినవస్తువులవిక్రయములోఁగూడ నిట్టినివారణోపాయముల విధింపవచ్చును. ఎట్లనిన, క్రయకాలమును, క్రయికుని యూరుపేరులను, విక్రీత వస్తువుయొక్క యథార్థగుణ పరిమాణములను, దాని నిమిత్తమును, నొకపుస్తకములో విక్రయికుఁడు వ్రాయవలసినదని విధింపవచ్చును. ఆవస్తువు వైద్య నియామకము కానప్పుడు మఱియొకఁడు సాక్షిగ నుండవలెననికూడ విధింపవచ్చును. ఈ వస్తువు క్రయమైనపిమ్మట నది నేరము జరిగించుట కుపయోగపడెనని నమ్ముటకుఁ గారణమున్నయెడల, నాభారమును గ్రయికుని మీఁదవేయుట కీచర్య యుపయోగపడును. ఇట్టి చట్టముల వలన సామాన్యముగ నావస్తుసంపాదనమునకుఁ గలుగు నాటంకము లెన్నఁదగినవి కావు. కాని, పట్టుబడకుండ నేరముజరిగించుటకుఁ గలుగు నాటంకము గొప్పదిగనుండును.

మఱికొన్ని దృష్టాంతములు.

సంఘము విషయమై నేరములు జరుగకుండ నివారణోపాయములను గల్పించుటకు సంఘమునకు స్వతస్సిద్ధమైన స్వత్వము కలదు. దీనినిబట్టి కేవలము వ్యక్తిసంబంధమైన దుర్మార్గమును నివారించుటకుఁగాని దండించుటకుఁగాని జోక్యమును గలుగఁజేసికొనుట న్యాయము కాదనుసూత్రమునకుఁ బరిమితి యెక్కడనో స్పష్టపడుచున్నది. దీనికి నిదర్శనము. సాధారణముగ మద్యపానము విషయములోఁ జట్టముల మూలమున జోక్యము కలుగఁజేసికొనుట క్రమము కాదు. అయిన, నెవ్వఁడైన మద్యపాన వశుఁడై యితరులకుఁ బ్రమాదము జరిగించినందుల కొకసారి దండింపఁబడి యున్నచో, వానికి స్వవిషయమునఁగూడఁ జట్టములవలన విశేషమైన నిర్బంధముఁగల్పించి, అతఁడటుపిమ్మట నెప్పుడైన మద్యపాన మత్తుఁడైనయెడల దాని నిమిత్త మతని దండనార్హునిజేసి, యాస్థితిలోనతఁడు మఱియొక ప్రమాదమును జరిగించిన యెడల దానికిఁ బూర్వముకంటె నెక్కువకఠినమైనదండనమునకు లోఁబఱుపవచ్చును. ఇతరులకుహానికలిగించునట్లుద్రేకమునుబుట్టించునంతగ నెవ్వఁడైనఁద్రాగినయెడల నదియితరులయెడ నేరమగును. మఱియు, లోకులసాహాయ్యమునజీవించుచున్న

ప్పుడు గాని లేక సమయభంగము గావించినప్పుడుగాని సోమరితనము దండనీయమగును. లేనియెడల సోమరిని జట్టములనుబట్టిదండించుట దౌష్ట్యమనిపించుకొనును. అయినను సోమరితనముచేతఁగాని, నివారింపఁదగినమఱియే యితర కారణముచేతఁగాని, యెవ్వఁడైన తనపిల్లలను బోషించుట మొదలైన విధాయక కృత్యములను జరిగింపక పోయినయెడల, వానినావిధి నెఱవేర్పునట్లు చేయుటకు వేఱు సాధనములు లేనపుడు వాని చేత బలవంతముగఁ బనిఁ జేయించినచో నది దౌష్ట్యమనిపించుకొనదు.

మర్యాద లోపము.

ఇంతియకాక కర్తకు మాత్రమే హాని కరములగు కార్యములు చట్టములచేత నిషేధార్హములు కాకపోయినను వానిని బహిరంగముగ జరిగించినప్పుడు మర్యాదకు లోపమయినచో నవి యితరులయెడ నేరములగుచుండును. కనుక నవి నిషేధార్హములగును. అశ్లీలము లైనకార్యము లీతరగతి నేరములలోఁ జేరుచుండును. సహజముగ నిరాక్షేపణీయమైనట్టిగాని, యట్లుకనఁబడునట్టిగాని కార్యము లనేకములు బహిరంగముగ జరుగుటకుఁ గలయాక్షేపముతో సమానబలమైన యాక్షేపము వీనియందును వర్తించుటను బట్టి వీనికి మేము చర్చించుచున్న విషయముతో సాక్షాత్సంబంధములేనందున మేమువానిని గూర్చి చర్చించుట యనావశ్యకము.

పరులను ప్రోత్సాహము చేయువిషయము.

ఇంతవఱకుఁ బ్రతిపాదించిన న్యాయములకు భంగములేకుండఁ బరిష్కరింపవలసిన సంశయము మఱియొకటి గలదు. వ్యక్తి ప్రవర్తనము దూష్యమైనను దానివలని కీడు కర్తను మాత్రమే బాధించుచున్నప్పుడు స్వాతంత్ర్యమందలి గౌరవము చేత దానిని సంఘము మాటంక పఱుపకను, దండింపకను, విరమింపవలసి వచ్చును. ఇట్టివిషయములలో వానిని జేయుటకుఁ గర్తకు స్వాతంత్ర్యముండునట్లే యితరులు వానికి హితోపదేశముచేయుటకుఁ గానిప్రోత్సాహపఱచుటకుఁ గాని తత్సమాన స్వాతంత్ర్యముండవలెనా? ఈసంగతి కష్టమైనది కాక పోలేదు. ఇంకొకని నేపనియయినఁ

జేయుమని కోరినప్పు డాకార్యము కేవలము స్వవిషయముకాదు. ఎవ్వనికైన నుపదేశము చేయుట, లేక ప్రోత్సాహమునుగలిగించుటయు సాంఘిక కృత్యమగునుగనుక నితరులతోసంబంధించినతక్కిన కార్యములవలె నేయివికూడ సాంఘికాధి కారమునకులోఁబడి యున్నవని తలంపవచ్చును. అయిననిట్లు మొట్టమొదటఁ గలుగు నభిప్రాయము కొంచెము విచారించినయెడల దిద్దుపాటు కాఁగలదు. ఎట్లనిన, ఈవిషయము కేవలము వ్యక్తిస్వాతంత్ర్యాంశము కాకపోయినను దానికాధారములైనకారణములే దీనికిని వర్తించునని కనఁబడఁగలదు. మానవులు కేవలము స్వవిషయములలో నేవిపత్తునకైన నొప్పుకొని వారికి శ్రేష్ఠమనితోఁచినరీతినిబ్రవర్తించుటకుస్వాతంత్ర్యమునంగీకరించినయెడల వారుచేయఁదగినదానిని గుఱించి పరస్పరము సంప్రతించి, యభిప్రాయములఁ దెలుపుకొని యుపన్యసించుకొనుటకును సమానస్వాతంత్ర్యమునంగీకరింపవలసియుండును. దేనినైనఁ జేయుటకు స్వాతంత్ర్యమున్నయెడల దానిని జేయుమని బోధించుటకుఁ గూడస్వాతంత్ర్యముండవలెను. ఇట్టిబోధవలన నాబోధకుఁడు లాభముపొందినపుడును, సంఘమునకును దొరతనమువారికిని గీడనితోఁచిన దానినివృద్ధిఁజేయుటయే జీవనోపాయముగఁ గాని ధనసాధనముగఁగాని చేసికొనుట కొక వృత్తిఁగ నేర్పఱచుకొన్నప్పుడును మాత్రమీవిషయము సంశయాస్పదమగును. లోకక్షేమమనఁ దగిన దానికి విరోధులై లాభమును బొంది దానికి భంగముకావించుట వలనజీవనోపాయము నేర్పఱచుకొనిన మనుష్య సమూహములున్నప్పు డీవిషయములో నొక క్రొత్తయంశము ప్రవేశించి చిక్కులకుఁ గారణమగుచున్నది. ఇట్టివృత్తి కాటంకముఁ గలిగింపవలసినదా లేదా? దృష్టాంతము. వేశ్యాగమనమును ద్యూతమును సహించి యూరకుండ వలెను. అయిన నెవ్వరికైనఁ దార్పుటకుఁ గాని ద్యూతశాల నుంచుటకుఁ గాని స్వాతంత్ర్యముండవలసినదా లేదా? ఇది కేవలము ధర్మసంశయము, ఎటువైపునఁ జేరునది నిర్ణయించుట మొట్టమొదట స్పష్టము కాదు. ఉభయపక్షములను వాదము చేయవచ్చును. సహాన పక్షమునఁ జెప్పఁదగిన సంగతులు; సహాజముగనంగీ

కారమైన దానినెవ్వరేని వృత్తిగనేర్పఱచుకొని దానినాచరించుటవలన జీవనోపాధి నేర్పఱచుకొనినను లేకలాభమును బొందిన నది యెంతమాత్రము నేరముకాదు. ఆ కార్యమును నిత్యముగ నంగీకరింపవలెను. లేదా నిత్యముగని షేధింపవలెను. ఇదివఱకు సమర్థించిన న్యాయములు యథార్థములే యయినయెడల, వ్యక్తికి మాత్రము సంబంధించిన విషయములలో దేనినిగాని తప్పని సంఘము తానుగా నిర్ణయించుటకు నిమిత్తములేదు. నిరుత్సాహపఱచుటకంటె సంఘమెక్కువ జోక్యమును గలుగఁజేసికొనఁ గూడదు. నిరుత్సాహపఱచుటకొకరికెంత స్వాతంత్ర్యముగలదో మఱియొకరికిఁ బ్రోత్సాహపఱచుటకంత స్వాతంత్ర్యము కలదు. రెండవపక్షమున వాదింపఁదగిన సంగతులు; లోకులుగాని దొరతనమువారుగాని వ్యక్తిలాభముతో మాత్రము సంబంధించిన ప్రవర్తనమును మంచియనిగాని చెడ్డయనిగాని నిర్ణయించియాటంక పఱచుటకుఁగాని దండించుటకుఁగాని యధికారముపూనుట క్రమము గాదు. అయిన నా కార్యమువారికిఁ జెడ్డదనిలోచినప్పుడు దానినధమపక్షము వివాదాంశముక్రిందఁ జేర్చుటకైనవారికి సంపూర్ణాధికారమున్నదని సమర్థింపవచ్చును. ఇఁకనిట్టివిషయములో స్వలాభము నపేక్షించు నుపదేశికులయొక్కయుఁ బక్షపాతముగల ప్రోత్సాహకులయొక్కయుఁ బ్రభావమంటకుండఁ దొలగించుటకు యత్నముచేయుటలో దోషమేమియులేదు. ఎందుచేతననగా నీప్రోత్సాహకులకొకపక్షమున సాక్షాత్తుగ లాభముకలుగుచున్నది. ఆపక్షము దుష్టమని దొరతనమువారికి నమ్మకముగలదు. పైనిజెప్పినప్రోత్సాహకులు దానిని కేవలము స్వలాభాపేక్షతోఁ బ్రోత్సాహపఱచుచున్నారని యందఱు నొప్పుకొని యున్నారు. కనుక నిట్టివారుద్రేకమును బుట్టించుటకుఁ బన్నెడి మాయోపాయములకు సాధ్యమయినంతమట్టుకు లోనుగాకుండ స్వేచ్ఛానుసారముగ, యుక్తముగనో యయుక్తముగనో, జనులునిర్ణయించుకొనుటకు వీలుగ వ్యవహారములను శాసించుటవలన శ్రేయమునకు భంగములేదనియు నష్టమేమియు కలుగదనియు వాదింపవచ్చును. అక్రమ వినోదములను గుఱించినశాసనములు సమర్థనీయములుకాకపోయినను

అనఁగా, సర్వజనులు స్వగృహములందుఁగాని, పరగృహములందుఁ గాని లేకవారు న్యాయముగఁ జందాలువేసి సభికులకును సందర్శకులకును మాత్రమే యవకాశముండునట్లు స్థాపించిన మఱియేయితర సభాస్థానమునఁ గాని జూద మాడుటకు స్వాతంత్ర్యముండవలసినదే. అయినను ద్యూతశాలలను మాత్రిమం గీకరింపఁ గూడదని చెప్పవచ్చును. ఈనిషేధము యథార్థము చేతనెప్పు డును సార్థకము కానేరదు. ఆరక్షకశాఖ వారి (Police) కెంత నిరంకు శాధికారమిచ్చినను, వేఱునెపము మీఁద ద్యూతశాల లెల్లప్పుడును స్థాపన మగుచునే యుండును. కాని వాని నన్వేషించు వారికిఁ దప్పతక్కిన వారికి వానిని గూర్చియేమియుఁ దెలియకుండఁ గొంతరహస్యముగను గూఢ ముగను వానిచర్యలు జరుగునట్టుల బలవంతము చేయవచ్చును. సంఘమిం తకంటె నెక్కువ పనిని బూను కొనఁ గూడదు. ఈవాదములు చాలబల వంతములు. కాని ముఖ్యుని స్వేచ్ఛగ వదలివేసి సహకారిని దండించుటవలన ననఁగా, వేశ్యాగామిని దండింపక తార్చినవానికి ధనదండనముగాని కారాగృ హదండనముగాని విధించుటవలనను ద్యూతకారుని దండింపక ద్యూతకారకుని దండించుటవలనను సంప్రాప్తమయ్యెడి ధర్మవిరోధమును సమర్థించుట కీహేతువులుచాలునని నిశ్చయించుటకు నేనుసాహసింపను. సాధారణములైన క్రియ విక్రియముల నాటంకపఱచుటకిట్టి హేతువు లింతకంటెను దుర్బ లములు. క్రయవిక్రియములగుచున్న వస్తువులలో దాదాపుగఁ బ్రతివస్తువు నతివిస్తారముగ నుపయోగించుటకు వీలున్నది. మఱియు విక్రయికులట్టి యత్యుపయోగమును బ్రోత్సాహ పఱచుట వలన ధనలాభమును జెందు దురు. కాని, యీహేతువును బట్టి మెయిను చట్టము (The Maine Law) వంటి దానిని సమర్థించుటకువీలులేదు. ఎందుకన, మత్తు కలుగఁజేయు వ స్తువులను విక్రయించువారు వాని దుర్వినియోగమువలన లాభముఁ జెందు వారైనను వాని క్రమోపయోగము నిమిత్తము వారుతప్పక కావలసియున్నా రు. మద్యపానమును వృద్ధిచేయుటలో వీరికిఁగల యభిలాష నిజముగ హానికరమయి యున్నది. కనుక దొరతనమువారాటంకములనువిధించి కట్టు

బాటుల నేర్పఱుపవచ్చును. ఈహేతువుచేతఁ గాకపోయినయెడల నాయా టంకములును గట్టుబాటులును గరిమయిన స్వాతంత్ర్యమునకు భంగకరము లగును.

ఇంకొకవిచారణముకలదు. కర్తయొక్క యుత్కృష్ట శ్రేయస్సునకు భంగకరమైన పరివర్తనమును దొరతనము వారంగీకరించినను, దానిని పరోక్షముగనైన నిరుత్సాహ పఱుపవచ్చునా? దృష్టాంతము. మద్యపానము నెక్కువ వ్యయకరముగఁ జేయుటకుఁ గాని, వానిని విక్రయించు ప్రదేశములఁ బరిమితి చేయుటవలన వానిని సంపాదించుట నెక్కువ కష్టతరముగఁ జేయుటకుఁగాని, దొరతనము వా రుపాయములను గల్పింపవచ్చునా? ఇట్టి యాచరణముతో సంబంధించిన విషయములలో బహువివేచనములఁ జేయవలసియున్నది. మత్తుఁగలిగించుపదార్థములు లభించుటను గష్టతరముగఁ జేయునిమిత్తము మాత్రము వానిమీఁదసుంకమును విధించుటకును, వానిని గేవలము నిషేధించుటకును గలభేదమంశమాత్రమైయున్నది. వీనిలో రెండవపక్షము సమర్థనీయమైనప్పుడే మొదటిదిని సమర్థనీయమగును. వెలనెక్కించిన కొలఁదిని హెచ్చువెలకుఁ దగిన రాఁబడిలేనివారి కావస్తువలభ్యమగును. అట్టిరాఁబడి కలిగినవారి విషయమునఁగూడ వారియభిరుచిని దృష్టిపఱచుకొనినందునకిది ధనదండనముగ నేర్పడుచున్నది. ఎవరుగాని తమ విలాసములను నిర్ణయించుకొనుటయును, దొరతనమువారియెడను ఇతరమనుష్యుల యెడను జట్టములవలనఁ గాని నీతిశాస్త్రి సంబంధమునఁగాని యేర్పడియున్న విధులను నిర్వర్తించినపిమ్మట మిగిలియుండు రాఁబడిని వ్యయపర్చుకొనుటయును, వారి స్వవిషయములు గనుక వారి బుద్ధికిఁ దోఁచినట్లు జరుగవలసియున్నవి. ఈ కారణములనుబట్టి పన్ను నిమిత్తము మత్తునిచ్చు ద్రవ్యములమీఁద సుంకము ప్రత్యేకముగ విధించుట యక్రమమని మొట్టమొదటతోఁచవచ్చును. కాని పన్నునిమిత్తము సుంకమును విధింపకతప్పదనియుఁ బెక్కుదేశములలో సుంకము చాలవఱకు పరోక్షముగనే యుండుట యావశ్యకమనియు, నీ కారణముచేతఁ గొన్ని భోగ్యపదార్థము

అధికారుల వలననిరుత్సాహము

లమీఁదఁ బన్నులను విధించుటచేత నవికొంతమందికి లభింపకుండ దొరతన
మువారు చేయకతప్పదనియు జ్ఞప్తియందుంచుకొనవలెను. ఇఁకఁబన్నులను
విధించునప్పుడు భోగ్యపదార్థములలో వేనిని బ్రజలు విడిచిపెట్టుట కెక్కువ
పీలుండునో విచారించి, తదనుగుణముగ మిక్కిలి కొంచెముకంటె నెక్కువ
నుపయోగమువలన హానికరముగఁ దోఁచెడి పదార్థములమీఁదఁ బన్నువే
యుట దొరతనమువారికి విధియైయుండును. కనుక దొరతనమువారి కవశ్య
మైనయెడల మత్తుఁగలిగించు ద్రవ్యములమీఁద వేయఁదగిన పన్నునంతను
వేయుట సమర్థనీయమే కాక యంగీకారము కూడనగుచున్నది.

**నిరుత్సాహ పరిమితి**

ఈవస్తు విక్రయాధికారమును గొంచెమించుమించుగ ననన్యసాధార
ణముగఁ జేయవచ్చునా యనువిషయము, ఆటంకము లెందు
నిమిత్త మేర్పడెనో దానినిబట్టి నిర్ణయము కావలసియున్నది.
జనులు ధారాళముగఁ గూడెడి ప్రదేశములన్నియు నారక్షక
శాఖయొక్క యధికారముక్రింద నుండవలసియుండును. అందులో నిటువం
టిప్రదేశము లందల్లరులు పుట్టుటకెక్కువ యవకాశమున్నది. కనుక నివి య
ట్టియధికారముక్రింద నుండవలసిన యావశ్యక మెక్కువగ నుండును. కాఁబట్టి
యీవస్తు విక్రయాధికారము పెద్దమనుష్యులని పేరుపొందినట్టిగాని నమ్మఁ
దగినట్టిగాని మనుష్యులకు మాత్రముండునట్లు శాసింపఁదగును. అధమ మా
ప్రదేశములందావస్తువుల ననుభవించు విషయమునకైన నిట్టికట్టుబాటు కావల
సియుండును. మఱియు నధికారుల పరీక్షార్థ మావశ్యకమైన కాలములో
నా ప్రదేశములను దెఱచియుంచి మూయునట్లు శాసింపవచ్చును. ఆయం
గడివాని యసమర్థతచేతఁగాని యుపేక్షచేతఁగాని నెమ్మదికిభంగము తఱచు
గఁ గలిగినపక్షమునను, లేకచట్టములకు భంగముకలిగించి నేరములను జరిగిం
చుటకా ప్రదేశమాకరమైనపుడును, వాని యధికారమును దొలఁగింపవచ్చును.
ఇంతకంటె నెక్కువయాటంకమును గలిగించుటెట్లు ధర్మమగునో నాకుఁ
దోఁచఁకున్నది. దృష్టాంతము; మదిరాగృహములకుఁ బోవుటనెక్కువ కష్టము
గఁజేసి తత్సంబంధములైన యాకర్షణముల కవకాశము తగ్గించునిమిత్తము పా

నశాలల సంఖ్యనుదగ్గించినచోఁ గొంతమంది వానిని దుర్వినియోగము చేయు దురను కారణమునుబట్టి యందఱకు నిబ్బంది కలిగించడమగును. ఇంతియ కాక పనివాండ్రను పసిబాలురుగను మూర్ఖులుగను భావించి తరువాత నెప్పు డో స్వాతంత్ర్యాధికారమునకుఁ దగినట్లు చేయు నిమిత్తమాటంకరూపమైన శిక్ష లోనుంచవలసిన యవస్థలోనున్న సంఘమునకే నిబంధనము చెల్లియుండును. స్వాతంత్ర్యా నుభవముగల యేదేశములోను బనివాండ్రనిట్టి సూత్రప్రకారము బాహాటముగఁ బరిపాలించుటలేదు. వారిని స్వాతంత్ర్యమునకుఁ దగిన ట్లు శిక్షించుటకును, స్వాతంత్ర్యము గలవారినిగఁ బరిపాలించుటకును జేయఁ బడిన ప్రయత్నములన్నియు వ్యర్థమైపోయి వారు పసిబాలురుగ మాత్రమే పరిపాలనకర్తలని స్పష్టముగ ధ్రువపడువఱకును స్వాతంత్ర్యము నందుం డవలసిన గౌరవముగల వారెవ్వరునిట్టి పరిపాలనమున కొప్పుకొనరు. ఇచ్చట విచారింప వలసిన ప్రతివిషయమున నిట్టి ప్రయత్నములు జరిగియుండె నను నూహయెంత విపరీతమో స్పష్టపడుటకుఁ బైనఁజెప్పిన ధర్మమునకు విక ల్పమును సూచించినంతమాత్రమునఁ జాలును. ఈదేశములోనీపద్ధతులు పర స్పరవిరుద్ధములై గుట్టుబడి యుండుటవలన నిరంకుశాధికార పద్ధతికిఁ జెల్లి నయంశములు మనయాచారములలోఁ బ్రవేశించిన యాపద్ధతులలో స్వాతం త్ర్యము సామాన్యముగ వ్యాప్తమయి యుండుటవలన, నాటంకము సార్థకమ యిన నీతిశిక్షగాఁ బరిణమించుటకుఁ గావలసిన నిగ్రహమున కవకాశము లేకపోవుచున్నది.

సమయవిచారణము

వ్యక్తికిమాత్రము సంబంధించిన సంగతులందు వ్యక్తిస్వాతంత్ర్యముండ వలసిన దను సిద్ధాంతములోఁ గొందఱు వ్యక్తులుకూడి పరస్పరాభిమతములైయనన్యములయిన, సంగతులనువ్యవ హరించుకొనుటకు వారికి స్వాతంత్ర్యముండవలసినదను సిద్ధాంత మంతర్భూ తమయియున్నదని యీయుపన్యాసముయొక్క పూర్వభాగమందుఁ గనఁ బఱచి యుంటిమి. దీనిలోఁజేరిన వారందఱు యిష్టము మాఱిపోకుండు

నెంతవఱ కీవిషయమునందుఁ జిక్కు కలుగదు. కాని యీయిష్టము మాఱిపో
వచ్చును. కనుక వారికిమాత్రముసంబంధించిన సంగతులలో సహిత మొకరి
తో నొకరు కొన్నికట్టుబాటులను 'జేసికొనుట తఱచుగ నావశ్యకమగును.
అట్టికట్టుబాటులు జరిగినప్పుడు వారువానికి బద్ధులైయుండుట సామాన్యముగ
విధియైయున్నది. అయిననన్ని దేశముల చట్టములలో నీసామాన్య విధికి
బహుశాకొన్ని యుపవాదములుండును. మఱియొకరి స్వత్వమునకు భంగ
కరములైనసమయములనుండిజనులువిముక్తులగుటయేకాక సమయములోఁజేరిన
వానికవి హానికరములైనపక్షమున వారినివానినుండితొలఁగించుటకీ కారణము
చాలునని భావించుచున్నారు. దృష్టాంతము. ఈదేశమునందును నాగరికత
గల యింకఁజాలదేశములందును ఎవ్వరేని బానిసతనమునకుఁ దానుగఁగాని
ఇతరులవలనఁగాని యమ్ముడుపోవుటకేర్పాటు చేసికొనినయెడలనాయేర్పాటు
చట్టములప్రకారమును లోకాభిప్రాయప్రకారమునుగూడ నిరర్థకమును,నిస్సా
రమునుఅగును. ఎవరియిష్టప్రకారమువారుతమ జీవితమార్గమును నిర్ణయించు
కొను నధికారమును ఇట్లుసంకుచితము చేయుటకు హేతువీపరమనికృష్టమైన
దృష్టాంతమువలన మిక్కిలిస్పష్టపడుచున్నది. ఇతరులనిమిత్తముతప్ప, యెవరి
యొక్క స్వేచ్ఛాక్రియలందును జోక్యముకలుగఁ జేసికొనకుండుటకతనిస్వా
తంత్ర్యమునందలి గౌరవమే కారణమైయున్నది. అతఁడొకదానిని స్వేచ్ఛగ
స్వీకరించినపుడది యతని కుపేక్షణీయమనియు, నథవాసహ్యమనియు, నతని
స్వేచ్ఛవలననే ధ్రువపడుచున్నది. మొత్తముమీఁద నతనిశ్రేయస్సతనికిఁ
దోఁచినరీతిని సాధించుకొననిచ్చుటయెసర్వోత్తమమైనమార్గము. కాని, బానిస
తనమునకుఁ బాలుపడుటవలన నతఁడు తనస్వాతంత్ర్యమును విసర్జించినవాఁ
డగును. ఇట్లుపాలుపడిన పిమ్మట నాస్వాతంత్ర్యము నుపయోగపడకుండఁ
జేసికొనుచున్నాఁడు. కాఁబట్టియతనిని స్వేచ్ఛగఁబ్రవర్తింప నిచ్చుటకేది
హేతువైయుండెనో యానిమిత్తమునకు సాక్షాత్తుగ స్వవిషయమున భంగము
గావించుచున్నాఁడు. ఇకఁబిమ్మట నతనికి స్వాతంత్ర్యములేదు. అతఁ
డేస్థితియందైన స్వేచ్ఛగనుండిన యెడల దాని కనుకూలముగ నెంచఁదగిన

భావనలకు దూరమైనస్థితిలోఁ బ్రవేశించి యున్నాఁడు. స్వాతంత్ర్య మును గోల్పోవుటకు స్వాతంత్ర్యము నపేక్షించుట స్వాతంత్ర్యధర్మము గాదు. స్వాతంత్ర్యముఁగోల్పోవుట కధికారముస్వాతంత్ర్యము కానేరదు. ఈ చమత్కారమైనసంగతిలో నింతప్రబలముగ స్పష్టపడిన కారణములకెక్కువ విపులమైన ప్రయోజనముగలదు. అయినను జీవితముయొక్క యగత్యమును బట్టినిరంతరము మనస్వాతంత్ర్యమును విసర్జింపవలసి యుండకపోయి నను మనమేదియోయొక పరిమితిలోనుండుట యొప్పుకొనవలసి యుండును. కనుకసర్వత్రయొక పరిమితియుండక తప్పదు. కాని, కర్తకు మాత్రము సంబంధించిన సర్వవిషయములలోఁ గార్యస్వాతంత్ర్య మసంకుచితముగ నుండవలెననెడు ధర్మముప్రకార మెవ్వరేని మూడవవారితో సంబంధము లేకుండ నొకరికొకరు బద్ధులైన సంగతులలో వారాబంధనమునుండి పరస్ప రము విముక్తులగుట కవకాశముండవలెను. ఇంతియకాక యిట్లు స్వేచ్ఛగ విముక్తులుకాకపోయినను, ద్రవ్యము, లేక, ద్రవ్యపర్యాయముతో సంబంధిం చినవానిలోఁ దప్ప విముక్తి కెంతమాత్రమువకాశ ముండఁ గూడని నిబంధ నములుగలవని బహుశాయెవ్వరును జెప్పసాహసింపరు- బారన్ విల్ హెలంవాన్ హంబోల్టువారిచేవిరచితమైన ప్రశస్తోపన్యాసమునిదివఱకేయుదా హరించియున్నాను. దానిలోనాయన యిట్లు ప్రతిపాదించి యున్నాఁడు. వ్యక్తిగతములైన సంబంధములనుగాని పరిచర్యలనుగాని నిర్దేశించెడు సమయ ములు చట్టములప్రకారము పరిమితకాలముకంటె నధికము బాధింపఁగూ డదు. ఈనిబంధనములలోకెల్ల ముఖ్యమైనది వివాహము. దీనితోసంబం ధించిన యుభయులమనోభావములు దాని కనుకూలముగ లేనియెడలదాని యుద్దేశమే భంగమైపోవును. ఇది వివాహముయొక్క విశేషలక్షణము. కనుకనుభయులలో నెవ్వరైననాబంధమును నివర్తింపవలెనను గోరికను వ్యక్తీకరించిన యెడలనాబంధమును దొలగించుట కాకోరికకంటె వేఱు సంగతి యక్కఱలేదు. ఈవిషయము చాలముఖ్యమై !చిక్కులతోఁగూడి యున్నది. కనుకదానిని ప్రసంగవశముగ నెత్తుకొని చర్చించుటకుపీలు

లేదు. దృష్టాంతము నిమిత్తము సత్యమైనంతవఱకు మాత్రముదాని నెత్తుకొనుచున్నాను. బారన్ హంబోల్టుగారి యుపన్యాసములో సామాన్యధర్మము క్లుప్తముగ విచారింపఁబడినది. కాఁబట్టి యాయన యీవిషయములోఁ గారణములను జర్చింపకుండఁ బర్యవసానమును మాత్రముచెప్పి యూరకుండవలసిన వాఁడాయెను. లేనిచో నాయన యెత్తుకొనినంత సులభములైనస్వల్పహేతువులనుబట్టి యీవిషయమును నిర్ణయించుటకు వలనుపడదని యాయన యంగీకరించి యుండును. ఒకమనుష్యుఁడు స్పష్టమైన వాగ్దత్తముచేతఁగాని, లేకప్రవర్తనము చేతఁగాని, ఒకవిధముగనడచుకొనఁ బోవుచున్నాఁడని ఇంకొకరికి నమ్మకముపుట్టించినపుడు, వీరానమ్మకమునుబట్టి కొన్నియాశలును, బ్రతీక్షణములును గలిగి, తమజీవితములోఁ గొంతభాగమును నిర్ణయించుకొనవచ్చును. ఈసందర్భమున మొదటివారికి రెండవవారియెడఁ గొన్నిధర్మశాస్త్రసంబంధములైన బాధ్యతలేర్పడు చున్నవి. ఇవి యంతకంటె నెక్కువవిధిచేత బాధితములు కావచ్చునుగాని యుపేక్షణీయములు గావు. మఱియు నిద్దఱేర్పఱచుకొనిన నియమసంబంధముచేత నితరులను బాధించు పర్యవసానము లేర్పడి వీరినొక విశేషమైనస్థితిలో దింపినపుడును, లేక, వివాహసంబంధమునందువలెనితరులయుత్పత్తికిఁగారణమైనప్పుడును మొదటఁజెప్పిన నియమములోఁ జేరినయుభయులకు నీమూడవవారియెడఁ గొన్ని బాధ్యతలేర్పడుచున్నవి. వీని నిర్వర్తనమునకుఁగాని, లేక, అధమపక్షము నిర్వర్తనపద్ధతికిఁగాని వారేర్పఱచుకొనిననిబంధనముయొక్క స్థితిలయములను బట్టివిశేషబాధ కలుగకమానదు. ఆనిబంధనములోఁజేరి పిమ్మటదానియందనిష్టము గలిగినవారికెంత సౌఖ్యహానియైనను దానిప్రకారము బద్ధులుగండని విధించుటకీబాధ్యతలు చాలినంతహేతువులుకావు. వీనికిట్టిబలము కలదని నేననంగీకరింపను. కాని, యవియీవిచారణలోఁ దప్పకచేరియుండు నంశములైయున్నవి. ఆనియమముతో సంబంధించినవారు దానినుండివిముక్తులగుటకుఁ జట్టపుసంబంధమైన స్వాతంత్ర్యమును నీబాధ్యతలు బాధింపఁ గూడదని వాన్హంబోల్టు వాదించుచున్నాఁడు. నేనును, వానివలన విశేష

బాధకలుగఁగూడదని భావించినను, ధర్మశాస్త్రమునుబట్టి యవివిశేష బాధకుఁ దప్పక హేతువులగును. ఇతరులకింత ముఖ్యమైన శ్రేయస్సును బాధించెడి మెట్టునకుదిగవలెనని నిశ్చయించుకొనక పూర్వము ప్రతిమనుజుఁడు నీసంగతులన్నిఁటిని బరిగణింపవలసి యుండును. కాని, యతఁడా శ్రేయస్సునుదగినంతఁగ గౌరవింపక పోయినచో నతఁడాయక్రమము నకు ధర్మశాస్త్రమునుబట్టి బాధ్యుఁడగును. స్వాతంత్ర్యము యొక్క సామాన్యధర్మము నెక్కువచక్కఁగ దృష్టాంతీకరించుట కింతస్పష్టమైనవాక్యముల నుడివితినేకాని ప్రకృతాంశమున కవిలేశమైన నావశ్యకమనికాదు. ఈయంశమును సాధారణముగఁ జర్చించునప్పుడు సర్వమును బిల్లలశ్రేయస్సునకే యైనట్లును బెద్దలశ్రేయస్సు శూన్యమైనట్లులను భావించుచుందురు.

సర్వజనాంగీకారములై సామాన్యములైన ధర్మసూత్రములు లేకపోవుటనుబట్టి స్వాతంత్ర్యముండవలసిన తావుల లేకపోవుటయు, నుండఁగూడని తావులనుండుటయుఁ గూడఁదటస్థించుచున్నదని నేనిది వఱకే కనఁబఱచియున్నాను. ప్రస్తుతము యూరోపు జనప్రపంచములో స్వాతంత్ర్యభావన మన్నిఁటిఁ కంటె నెక్కువబలిష్ఠముగ నున్నయంశమున స్వాతంత్ర్యము కేవల మక్రమమని నాయభిప్రాయము. ప్రతి మనుష్యుఁడు స్వవిషయమున స్వేచ్ఛగఁబవర్తించుటకు స్వాతంత్ర్యముండవలసినది. కాని యింకొకరి పక్షమునఁ బ్రవర్తింపవలసి వచ్చినపుడు, వారి వ్యవహారములు తనవ్యవహారములేయను మిషమీఁదయథేచ్ఛముగ వ్యవహరించుటకు స్వాతంత్ర్యముండఁగూడదు. దొరతనమువారికిఁ బ్రతిమనుజుని స్వాతంత్ర్యమును స్వవిషయమున మన్నించినను బరవిషయమున నతనికిఁ గలయధికార వ్యాపారమును మిక్కిలిజాగరూకతతో నరికట్టవలసిన బాధ్యతకలదు. మానవులసౌఖ్యమును సాక్షాత్తుగబాధించు విషయములోఁ గుటుంబసంబంధము లితరసంబంధము లన్నియు నొక్కుమ్మడిగఁజేరిన దాని

కుటుంబసంబంధములలో స్వాతంత్ర్య విషయము.

కంటె నెక్కువ ప్రధానములైనవి. ఇట్టికుటుంబ సంబంధములో దొరతనము వారు బాధ్యతను దాదాపుగ నుపేక్షించి యున్నారని చెప్పవచ్చును. భర్తలకు భార్యలమీఁదఁ గొంచెమించుమించుగ నిరంకుశాధికారముగలదు. ఈ కీడును సంపూర్ణముగఁ దొలఁగించుటకుఁ దక్కినవారితోఁ బాటుభార్యలకుఁ గూడ సమానములైన స్వత్వములును, జట్టిసంబంధమైన సంరక్షణమును గలిగియుండుట కంటె వేఱెక్కువ యక్కఱ లేదు. ఈవిషయములోఁ బ్రస్తుతము పాదుకొనియున్న యన్యాయమును సమర్థింపఁబూనికొనినవారు స్వాతంత్ర్యము పేరట వాదింపక, యధికారము పేరట ధారాళముగ వాదింపనడుముఁగట్టినిలువఁబడుచున్నారు. కాఁబట్టి దీనినిగుఱించి యిక్కడ విస్తారముగఁ జెప్పవలసినపనిలేదు. కాని, పిల్లల విషయములో స్వాతంత్ర్యమును గుఱించి యుండిన దురభిప్రాయములు దొరతనమువారి విధినిర్వర్తనమునకు నిజముగఁ బ్రతిబంధకములైయున్నవి. పిల్లలవిషయమైతండ్రికిఁగల సంపూర్ణస్వాతంత్ర్యాధికారమునకు లేశమాత్ర మాటంకము గలిగించినను లోకులుసహింపక, యతనిస్వవిషయమైన కార్యస్వాతంత్ర్యమున కాటంకము కలిగినప్పటికంటె నెక్కువగ నసహ్యించుకొనుటనుబట్టి చూడఁగాఁ బిల్లలతనిలోఁ గేవలము యథార్థముగ నొకయంశమైయుండినట్లుతోఁచెడిని గాని యుత్ప్రేక్షగఁ గాన్పింపదు. మఱియుఁ దీనిబట్టిలోకులుసామాన్యముగ నధికారముకంటె స్వాతంత్ర్యమును మిక్కిలి తక్కువగఁ గౌరవించుచున్నట్లుస్పష్టపడుచున్నది. దీనికి నిదర్శనముగ నొక్క విద్యావిషయమును విచారింతము. ఒకరాష్ట్రములోఁ జేరినప్రతిమానవునికిని గొంతవఱకువిద్యచెప్పింపుమని దొరతనమువారు విధించి బలవంతపెట్టవలసినదను సంగతి దాదాపుగ స్వతస్సిద్ధమైన న్యాయమేయైన నీసత్యమును స్వీకరించి ప్రతిపాదించుటకు జడియనివాఁడెవ్వఁడున్నాఁడు? ఒకమానవుని జన్మకారణులైన మాతాపితలు గాని, ప్రస్తుతపుఁజట్టములను, ఆచారములనుబట్టి తండ్రిమాత్రమే కాని యామానవునికిస్వవిషయమును, ఇతరులయెడను, దనవిధాయకకృత్యములను జక్కఁగ నిర్వర్తించుటకుఁ దగిన విద్యనుజెప్పించుట సర్వోత్కృష్టమైన విధికాదని

చెప్పువాఁడెవ్వఁడును బహుశా యుండఁడు. ఇది తండ్రికి విధియని యేకగ్రీవముగ నంగీకరించిన నావిధి నతఁడు నిర్వర్తించునట్లు బలవంతపెట్టవలసినదను సంగతి చెవినిబడుటకైన సహించువాఁడీదేశములో బహుశా కానరాఁడు. బిడ్డకు విద్యను సంపాదించునిమిత్తము తండ్రి ప్రయత్నమునుగాని స్వార్థత్యాగమునుగాని చేయవలసినదని విధించుటకు మాఱుగ నావిద్య యుచితముగ లభించినపుడు సయితము దానిని స్వీకరించుటయు విసర్జించుటయు నతని యిచ్ఛాధీనముగ వదలివేయఁబడియున్నది. శరీరపోషణమునకుఁ గావలసిన యాహారమును మనోవృద్ధికిఁ గావలసిన విద్యాశిక్షలను సంపాదించుటకుఁదగిన సామర్థ్యము లేకయే బిడ్డలనుగనుట యాబిడ్డలవిషయముననే కాకసంఘవిషయమునఁగూడఁ ఘాతకమనియు, దల్లిదండ్రులీవిధిని నిర్వర్తింపనపుడు దొరతనమువారు సాధ్యమైనంతవఱ కావిధి తలిదండ్రుల ధనవ్యయమూలమున జరుగునట్లు శాసింపవచ్చుననియు లోకు లిప్పటికి నంగీకరింపకున్నారు.

నిర్బంధ విద్యా విషయము.

విద్యయందఱకును విధిగ నేర్పవలసినదను సంగతిని ముందుగ నొప్పుకొనినయెడల, దొరతనమువారేవిద్య నేవిధముగ నేర్పింపవలెనను చిక్కుతొలఁగిపోయి, దానివలన నిప్పుడు వివిధశాఖలకును, కక్షలకును జరుగుచున్న పోరాటమణఁగి విద్య నేర్పించుటయందు వినియోగపడవలసిన శ్రమయుఁ, గాలవ్యయమును, విద్యావిషయమైన పోరాటమునందు వ్యర్థపడకుండ నిలిచిపోవును. బిడ్డలందఱకు మంచి విద్యను జెప్పింపవలసినదని శాసించుటకు దొరతనమువారికి మనస్సు కుదిరినయెడల నావిద్యను ప్రతిపాదింపవలసిన శ్రమ వారిని వదలిపోవును. తలిదండ్రుల కిష్టమయినచోట నిష్టమైన విధమున విద్యను జెప్పించునట్లు వదలివేసి దొరతనమువారు బీదతరగతిబిడ్డలకు విద్యావేతన సహాయ్యము చేసియుఁ, వేఱుదిక్కులేనివారి విద్యావిషయమైన ధనవ్యయమునంతను భరించియుఁ దృప్తిఁజెంది యూరకుండవచ్చును. దొరతనమువారు విద్యను విధించుటనుగూర్చి యుక్తియుక్తముగఁ జేయఁదగిన యాక్షేపములన్నియు వారావిద్యను నడపింపఁబూనికొనినప్పుడు పట్టునుగాని, విద్య

నఁజెప్పింపుమని శాసించునప్పుడవి పట్టఁజాలవు. ప్రజలవిద్యలోనంతయుఁ
గాని, చాలవఱకుఁగాని దొరతనమువారి చేతిలోనుండఁగూడదని చెప్పుటలో
నేనెవ్వరికిని దీసిపోను. వ్యక్తియొక్కయు, అభిప్రాయ ప్రవర్తనభేదము
లయొక్కయుఁ బ్రాముఖ్యతనుగూర్చి యిదివఱకుఁ జెప్పియుండినసర్వమునం
దునవిద్యాభేదముల ప్రాముఖ్యతకూడనంతర్భూతమైయున్నది. ఈరెండింటి
ప్రాముఖ్యతయు నింతయని చెప్పనలవికాదు. దొరతనమువారు సర్వసామా
న్యముగ నేర్పఱచిన విద్యప్రజలనందఱను సరిగనొక్క యచ్చునఁబోయుటకు
మాత్రము సాధనమగును. రాజ్యములో రాజుగాని, మతగురువులుగాని,
అభిజనముగాని, ప్రస్తుత తరములో బహుజనులుగాని యెవ్వరెక్కువబలవం
తులుగనుండిన వారియిష్టమును బట్టి యీయచ్చు నిర్మాణమగును. గనుక, నది
యెంతసార్థకముగనుజయప్రదముగను బనిచేసెన, అంతయెక్కువగఁ బ్రజలమన
స్సులను స్వాధీనపఱచుకొని, పిమ్మటఁబ్రకృతి ధర్మమునుబట్టి శరీరమునుగూడ
వశపఱచుకొనును. దొరతనమువారేర్పఱచి నడపించువిద్యయే యుండవలసినయె
యెడల, నదిపరస్పరస్పర్ధగలిగియనేకపరీక్షార్థములైనప్రయోగములలోనొక్కటి
తక్కినవానికిఁ దృష్టాంతముచేతను బ్రోత్సాహముచేతను నొకమాదిరి
శ్రేష్ఠత్వమును గలిగించుటకు సాధనముగనుండవలెను. సంఘము సామాన్య
ముగ మిక్కిలిహీనస్థితిలోనుండి, విద్యావిషయములైన ప్రతిష్ఠాపనములనుస్వయ
ముగనిర్మాణము చేసికొనుటకు సామర్థ్యముగాని, యిష్టముగానిలేకుండినప్పుడు,
దొరతనమువారీపనిని బూనుకొనవచ్చును. ఇట్లుచేయుట కీడే యైనను, విద్యా
విహీనతకంటెఁ దక్కువకీడనిపించుకొనును. ఇట్టిస్థితిలోదొరతనమువారు
విద్యాలయములను, సర్వకళాశాలలను స్థాపింపవచ్చును. ఇట్లేదేశములో
విశేష పరిశ్రమికవిషయములను బూనుకొనుటకుఁ దగినయుత్సాహములేని
సందర్భమున, సంభూయసముత్థాన(Joint Stock Companies)ములఁగూర్చి
వలసిన పనిని దొరతనమువారు పూనుకొనఁదగును. రాజ్యాంగపువారి యధి
కారముక్రింద విద్యసంపాదించుటకు సమర్థతగల జనులు తగినంతమందిదేశము
లోనుండినపక్షమున, వారు స్వేచ్ఛాపద్ధతినిగూడదానితోసమానమైనయున్నత

విద్యనిచ్చుటకు సమర్థులును, ఉద్యుక్తులును, అయియుందురు. వీరికి ప్రతిఫలముమాత్రము నిశ్చయముగఁ గలుగునని నమ్మకముండవలెను. దీనినిమిత్తమై దొరతనపువారందఱను దప్పక విద్య నేర్చుకొనుఁడని శాసించి, విద్యావిషయమై ధనవ్యయము చేయలేనివారికి సాహాయ్యమొనరించుచుండినఁ జాలును.

సాధనములు.

ఈశాసనమును వర్తింపఁ జేయుటకుఁ బిల్లలందఱకును చిన్నవయస్సునందే బహిరంగములైన పరీక్షలను బ్రారంభము చేయుటకంటె వేఱైన సాధనముండఁ జాలదు. బాలుఁడైనను బాలికయైనను జదువఁగలుగునో, లేదో, పరీక్షించుటకొక వయస్సును నిర్ణయింపవచ్చును. అప్పుడాబిడ్డ కాసమర్థత లేనియెడల, దానికిఁ జాలినంత క్షమాపణహేతువునుగనఁ బఱుపలేని తండ్రికిఁ గొద్దిపాటి ధనదండనమును విధించి, యగత్యమైనయెడల నామొత్తము తీరువఱకును వాని చేతఁ బని చేయించి, యాబిడ్డను బడిలో వేసి దాని కయ్యెడువ్యయమును వానివల్ల రాఁబట్టవచ్చును. పరీక్షావిషయములఁ గ్రమముగ హెచ్చించుచు, సంవత్సరమునకొకసారి తిరిగిపరీక్ష చేయుటవలన నందఱును సామాన్య జ్ఞానమును విధాయకముగ సంపాదించి జ్ఞాపకముంచుకొనునట్లు చేయవచ్చును. ఆస్వల్పజ్ఞానముకంటె నెక్కుడుసంగతిలో నన్నివిద్యాశాఖలయందును స్వేచ్ఛామూలములైనపరీక్షలను బెట్టి కొంతసమర్థతఁ జూపించిన వారి కందఱకును యోగ్యతాపత్రిక నొసఁగవచ్చును. ఈయేర్పాటులమూలమున దొరతనము వారక్రమముగ లోకాభిప్రాయమును బాధింపకుండఁ జేయు నిమిత్తము భాషలు వానియుపయోగము మొదలగు కేవలజ్ఞాన సాధనవిషయములందుఁ దప్పతక్కినవానిలోఁ గురుతరపరీక్షలయందుఁ గృతార్థులగుటకు సయితమంశములను విస్పష్టశాస్త్రభాగములను మాత్రమే పరీక్షలోఁ జేర్చవలసియుండును. మతము, రాజనీతి, మొదలగువివాదాంశములలోఁ బరీక్షల, అభిప్రాయములయొక్క సత్యాసత్యత్వములనుబట్టి నిర్ధారణము కాఁగూడదు. ఏయేయభిప్రాయము లేయే హేతువులనుబట్టి యేయేగ్రంథకర్తలు, శాఖల లేక మతశాఖలనామోదించుచున్నారో, యాసంగతి తెలిసియుండినఁ జాలును. ఈపద్ధతిననుసరించినయెడల రాఁబోవుతరము వారు ప్రస్తుతతరము వారికంటె వివా

దాంశములలో హీనస్థితియందుండఁబోరు. వారిప్పటివలెనే శిష్టులుగను, విమతులుగను, పెరిఁగినను, దొరతనమువారు చేసెడు జాగ్రత్త వలన జ్ఞానయుక్తులైన శిష్టులుగను విమతులుగను ఉండఁగలుగుదురు. వారితలిదండ్రుల కిష్టమైనయెడల నితరవిషయములను నేర్పెడి బళ్లయందే వారికి మతమును గూడ నేర్పుటకేమియు నడ్డములేదు. వివాదాంశములలోఁ బ్రజల యభిప్రాయములను దొరతనమువారు పక్షపాతమును గల్పింప యత్నించుట కీడేయైనను వారేమనుష్యునికైన నొకవిషయమును గూర్చికల యభిప్రాయములను లక్ష్యములుగఁ జేయుటకుఁ దగినంతజ్ఞాన మతనికున్నదని నిశ్చయించి నివర్తింపఁబూనుకొనుట క్రమము. తత్త్వశాస్త్రవిద్యార్థి "లాకు, కాంటులలో" నెవరిపక్షము నవలంబించినను, లేక, యిద్దఱను విసర్జించినను గూడ, వారిసిద్ధాంతములలోఁ బరీక్షకుఁ బాలియుండఁగలిగిన యెడల వానికి మఱింత మేలుగనుండును. క్రైస్తవమతప్రమాణములయందు విశ్వాసమున్నట్లొప్పుకొనుమని బలవంతము చేయుని పద్ధతిమీఁద నిరీశ్వరవాదవలనఁ గూడ వానిలోఁబరీక్ష పుచ్చుకొనుట కాక్షేపము చేయుట క్రమముగాదు. అయిన, నుత్కృష్టాంశములయందుఁ బరీక్షలు కేవలమిచ్ఛానుసారముగ నుండవలెనని నాయభిప్రాయము. సమర్థతలేదని పేరుపెట్టి యుపాధ్యాయ పదవి మొదలగు వృత్తులలో నెవ్వరినిగాని ప్రవేశింపకుండఁ జేయుటకు దొరతనమువారి కధికారమున్నయెడల నదియుపద్రవ హేతువగును. సామర్థ్య చిహ్నములు బిరుదుపేరులును విజ్ఞానవిషయములందును వృత్తివిషయములందును గూడ పరీక్షకువచ్చి తేఱిన వారికందఱకును ధారాళముగ నొసంగవలయునని విలెంవాను హంబోల్టు తలంచినట్లు నేనునుదలంచుచున్నాను. కాని యీయోగ్యతాపత్రికల యందు లోకులకుఁగల గౌరవము తప్ప యవి లేనివారికంటె నున్నవారి కెక్కుడులాభముండఁగూడదు.

సంతానవిషయమున స్వాతంత్ర్యపరిమితి.

తలిదండ్రులకు ధర్మశాస్త్రసంబంధములైన బాధ్యతలున్నవని యంగీకరించుటకెల్లప్పుడును బలవత్తరములైన కారణములు గలవు. వారిమీఁదఁ జట్టములమూలమున బాధ్యతలను విధించుటకుఁగూడఁ జాలసంగతులలోఁ బ్రబల-

ములయిన హేతువులున్నవి. ఈరెండిఁటికినిగూడ స్వాతంత్ర్యమునుగుఱించిన విపరీతాభిప్రాయము [?]లడ్డముపచ్చుచున్నవి. ఇది యొక్క విద్యావిషయము న నే కాదు. పిల్లలనుగనుటయను సంగతిసయితముమానవునిజీవితములో బహు తరముగ బాధ్యత వహింపవలసిన కార్యములలో నొకటియైయున్నది. ఈ బాధ్యతను మీఁదవేసికొను టనఁగా నింకొకరికి జీవితమును గల్పించు టని యర్థము. ఆజీవితము సుఖప్రదమయినను లేక దుఃఖభాజమయినను గావచ్చును. కనుకనట్లుకల్పితమగుజీవనముగలవానికి సామాన్యసుఖజీవనోపాధి మట్టుకైన లేనియెడల వానిని గనుటయే వానియెడ మహాదపరాధమగును. అధికజన సంకీర్ణమయినట్టియు లేక యాయవస్థ కున్ముఖమయిన దని భయపడఁ దగినట్టియు దేశములోఁ గొద్దిమందికంటె నెక్కుడుపిల్లలనుగనినయెడల వా రితరులతో స్పర్థకు దిగవలసివచ్చి కష్టపడి పనిఁజేయుటవలనఁ గలుగులాభము తగ్గిపోవును. కనుకఁగష్టించి జీవించెడివారియెడ నిది మహాదపరాధమగును. యూరోపులోని జాలదేశములలో వివాహము నిచ్ఛయించు స్త్రీపురుషులకుఁ గుటుంబసంరక్షణోపాయమును గనఁబఱపలేకయె వివాహముచేసికొనఁగూడ దను శాసనములను జేయుటలో, దొరతనమువారి యధికారము క్రమమును దప్పియుండలేదు. ఈశాసనము లగత్యమా, కావా, యను సంగతి స్థానికసందర్భములను మనోభావ లను బట్టి ముఖ్యముగ నిర్ణయమగును. కాని,యాశాసనములవలనస్వా[illegible]మునకుభంగముకలిగినదనియాక్షేపము చే యరాదు. దొరతనమువా రి[illegible] లవలన దుష్కార్యము జరుగకుండ వా టింకపఱచుచున్నారు. ఈ[illegible]తరులకు హానికరమయినది, గనుక చట్ట ముల మూలమున దండనమువిధి[illegible] యవశ్యముకాదని యెంచినను గూడ నది దూష్యమును సాంఘికరీతినిబట్టి యవమానకరమును గావలసియున్నది. అయి నను బ్రస్తుతము వాడుకలోనున్న స్వాతంత్ర్యమును గూర్చిన యభిప్రాయ ములు వ్యక్తికిమాత్రము సంబంధించిన విషయములలో సయితము వ్యక్తిస్వా తంత్ర్యమున కెంతభంగముకలిగిన నడ్డమురాక లొంగిపోవుచు, నొకపురు షుని స్వేచ్ఛాభోగముచేత దౌర్భాగ్యులును, అవినీతులును అగు పిల్లలు పుట్టి,

వారి చర్యల కేవిధముగ నైన సంబంధించిన వారి ననేకవిపత్తుల పాలుచేయు నపుడు వాని స్వేచ్ఛ కెంతమాత్రి మాటంకము కలిగింపఁబ్రియత్నించిన నాయత్నముల కీయభిప్రాయములే ప్రతిఘాతమొనర్చుచున్నవి. మానవులు స్వాతంత్ర్యమునందలి గౌరవాగౌరవముల రెండింటిలోనుఁగూడ నెంతవిపరీతచర్య గలిగియున్నారో సరిపోల్చి చూచినప్పుడు ప్రతిమానవుఁడును ఇతరులకు హానిచేయుట కని వార్యమయిన యధికారమున్నటులును, ఇతరులకు నొప్పితగులకుండ సంతోషముననుభవించుట కెంతమాత్రమధికారము లేనట్లు భావింపవలసివచ్చెడిని.

రాజ్యాంగ సాహాయ్యము

ఈ యుపన్యాస విషయమునకుఁ గ్రమముగఁ జెందియుండకపోయినను దీనితోమిక్కిలి దగ్గఱగ సంబంధించియున్న యనేకవిషయములలోదొరతనమువారు జోక్యము నెంతవఱకు గలిగించుకొనవచ్చునను విషయమును జిట్టచివర వఱకును వదలివేసితిని. కొన్ని సంగతులలో జోక్యమును గలుగఁజేసికొనుట కాక్షేపము స్వాతంత్ర్యధర్మముచేత నిరూపింపఁబడుటలేదు. ఈవిషయములలో వ్యక్తులచర్యలనాటంక పఱచుటను గుఱించి విచారింపక వారికి సాహ్యాయము నొనరించుటను గుఱించి విచారింపవలసియుండును. వీరు ప్రత్యేకముగఁ గాని లేక స్వబుద్ధిని సమూహముగఁజేరికాని కార్యములను జేసికొనునట్లు వదలివేయుటకు బదులుగ దొరతనమువారు వీరిమేలునకొఱకేపైనఁ జేయవచ్చునా లేక చేయింపవచ్చునా యని ప్రశ్నమొకటి పుట్టుచున్నది.

ఆక్షేపములు.

స్వాతంత్ర్యమునకు భంగము కలుగకపోయినను దొరతనమువారు జోక్యము కలుగఁజేసికొనుటకు మూడువిధములైన యాక్షేపములు రావచ్చును.

ఏకార్యమునైన దొరతనమువారికంటె వ్యక్తులెక్కువ చక్కఁగఁ జేసికొనుటకు వీలున్నపుడు వచ్చు నాక్షేపము మొదటిది. సామాన్యముగ నేకార్యమునందైన నెవరికిస్వయముగ నిచ్ఛగలనో, వారికంటె నితరులెవ

రును దానినినడపించుటకుఁ గాని, అది యెవరివలన నేవిధముగ నడపవ లెనో నిర్ణయించుటకుఁగాని తగియుండరు. ఈధర్మమునుబట్టి దొరతనము వారు గాని వారియుద్యోగులుగాని సాధారణములైన పారిశ్రామికవిషయ ములలోఁ బూర్వముతఱచుగఁ గల్పించుకొనిన రీతిని జోక్యమును గలిగించు కొనుట దూష్యమగుచున్నది. అయిననీయంశమును గుఱించి యర్థశాస్త్రి జ్ఞులు బహువిపులముగ నుపన్యసించి యున్నారు. ఇంతియకాక దీనికిఁ బ్రస్తుతోపన్యాసముతో విశేష సంబంధము లేదు.

2. రెండవయాక్షేపమున కీయుపన్యాసముతో నెక్కువదగ్గఱ సంబంధముగలదు. అనేక సందర్భములనొక సంగతిని దొరతనమువారి యుద్యోగులునెఱవేర్చినంత చక్కఁగ వ్యక్తులుసాధారణముగఁ జేయలేకపోయినను దానినిజేయుటవలన వారికిమనోభివృద్ధి గలిగి, వారిచాకచక్యము బలపడి, బుద్ధిప్రసరించి, యాకార్యములో సంబంధించిన విషయములనుగుఱించి యనుభవజ్ఞానము కలుగును. కనుక దొరతనము వారాకార్యమును జేయుట కంటె వారుచేసికొనుటయే యెక్కువ బాగుగనుండును. రాచరికపుసంబంధము గాని నేరములలోఁ బంచాయతీచేయుటకును, పౌరస్థానికవిషయములలో జనసమ్మతములైన స్వేచ్ఛాపద్ధతులకును, స్వబుద్ధిని సంఘములుగ నేర్పడి పారిశ్రామికలోకహిత కార్యనిర్వర్తనమునకును నిదియొక్కటియే ప్రధాన కారణము గాకపోయినను దీనినొకముఖ్యహేతువుగ నెంచవచ్చును. ఇవి యన్నియు స్వాతంత్ర్యవిషయములు కావు. వీనికిని స్వాతంత్ర్యమునకు సంబంధసరణి దూరముగనున్నది. ఇవి యభివృద్ధితో సంబంధించిన సంగతులు. వీనివలన స్వతంత్రప్రజలకు రాచకార్యములందుఁ గార్యాచరణమున కక్కఱకువచ్చు శిక్షగలిగి, పౌరులువిశేషవిద్యావంతు లగుదురు. దీనివలన వీరు స్వసంబంధమైనట్టియు కుటుంబసంబంధమైనట్టియు, స్వప్రయోజనపరత్వమును వదలి సమష్టిలాభములను గ్రహించి, సమష్టికార్యములను వ్యవహరించుకొనుటకును, అంతగనో కొంతగనో లోకహితార్థములైన

యుద్దేశములతో కార్యములు చేసి పరస్పరము నెడబాటులేక, సంఘీభావము నొందించెడి నుద్దేశములతోఁ బ్రవర్తించుటకును అలవాటుపడుదురు. కనుక పైని జెప్పినసంగతులను జాతీయవిద్యలో నంతర్భాగములుగ విచారింపవలసి యుండును. కాన నావిచారణము ప్రత్యేకసందర్భమున జరగవలసియుండును. యథార్థముచేత నీశక్తులును, అభ్యాసములును, లేకుండ స్వతంత్ర రాజ్యపద్ధతిని నిలుపుటకును బనిచేయుటకును సాధ్యముకాదు. దీనికి దృష్టాంతము; స్థానికస్వాతంత్ర్యాధారములేకపోవుటచేత ననేకదేశములలో రాజకీయస్వాతంత్ర్యము బహుతరముగ క్షణభంగురమయి పోయినది. వ్యక్తియొక్క యభివృద్ధివలనను వివిధములైన పరివర్తనరీతులవలనను లాభముగలుగునని యీ యుపన్యాసములోఁ జెప్పియుంటిమి. కేవల స్థానికవ్యవహారములను స్థానికులు చేసికొనుటకును, స్వబుద్ధిని గూడి ధనవ్యయము చేసి విశేషపారిశ్రామిక వ్యవహారముల నడపించుకొనుటకును, గల కారణముల నీలాభములు మఱింత బలపడుచున్నవి. దొరతనమువారి చర్యలకెల్లెడలను నొక్క పోలికగ నయ్యెడు స్వభావముకలదు. వ్యక్తులును స్వబుద్ధి నేర్పడిన సమాజములును అభ్యాస భేదములవలన నపరిమితమైన భేదానుభవమునకవకాశము కలిగియుండును. బహువిధయత్నములవలన గలుగు ననుభవమునకుఁ బ్రధానాశయమై దానిని చాకచక్యముతో వెదచల్లి వ్యాపింపఁజేయుట వలన రాజ్యాంగ ముపయోగకరము కాఁగలదు. తాను చేయుప్రయత్నములను దప్ప భిన్నప్రయత్నములను సహింపకుండుటకు మాఱుగఁ బ్రయత్నించు ప్రతిమనుజునకు నితరులప్రయత్నములవలన లాభము కలిగించుటయే దాని పనియైయుండును.

3. దొరతనమువారి యధికార మగత్యముగ హెచ్చెనచో నదివిశేష విపత్తగును. కనుక వారుజోక్యమును గలిగించుకొనకుండ నాటంకముఁ గలిగింపవలెనను నది మూడవకారణము. ఇదియన్నిటికంటె నెక్కువ యుక్తియుక్తమైనది. రాజ్యాంగచర్యలు హెచ్చెనకొలఁదిని వారి ప్రాభవము హెచ్చి, మానవుల యాశాభయముల నెక్కువగ నరికట్టును. లోకులలోఁ జాక

చక్యమును, ఉచ్చపదవాంఛయును గలవారు రాజ్యాంగమునకుఁగాని లేక రాజ్యపదవినొందఁ యత్నించు తెగకుఁగాని యంతకంత కాశ్రితులగుదురు. బాటలును, ఇనుపదారులును, ధనాగారములును, గొప్ప క్షేమవిధాన సమాజములును, (Insurance companies), సర్వకళాశాలలును, ధర్మకార్యములును, ఇవియన్నియు రాజ్యాంగశాఖలైపోయి, వీనికి జతగ స్థానిక పట్టణపాలన సంఘములును, ప్రస్తుతము వాని బాధ్యతలోనున్న సర్వవిషయములును, సమష్టిపరిపాలనాంశములై, యీ వివిధకార్యములలో నుద్యోగులు దొరతనము వారివలననే నియమింపఁబడి వేతనములను బుచ్చుకొనుచు నభివృద్ధినంతను వారివలననే యపేక్షించు చుండినయెడల వార్తాపత్రికల కెంత స్వేచ్ఛయుండినను, జట్టనిర్మాణ మెంతవిస్తారముగఁ బ్రజలచేతిలోనున్నను, నీదేశముగాని మఱి యేయితరదేశముగాని స్వాతంత్ర్య విషయమున నామమాత్రావశిష్టమై పోవును. రాజ్యతంత్రమును శాస్త్రోక్తముగను, సార్థకముగను, నిర్మించి దానిని నడపించుట కధిక బుద్ధిసూక్ష్మత, సామర్థ్యములను గల వారిని సంపాదించుటకు నిపుణములైనయేర్పాటులను జేసినకొలఁది నీవిపత్తుమఱింత యధికమగును. రాజ్య పరిపాలనపద్ధతిలో సేవించుటకు లభ్యము కాఁదగినంతవఱ కధికజ్ఞానబుద్ధి సూక్ష్మములు గలవారినిసంపాదించునిమిత్తము పరీక్షలను బెట్టి యెన్నుకొనవలసినదని యీ మధ్యకాలమున నింగ్లాండు దేశములో నొక యుద్దేశము పుట్టినది. దీని కనుకూలముగను ప్రతికూలముగ ననేకముగఁ జెప్పి వ్రాసియున్నారు. స్వచ్ఛంద వృత్తులవలనను సమాజముల సేవవలనను నిరంతర మెక్కువ లాభకరములైన పదవులు లభించునట్లు రాజ్యాంగ సేవలో శాశ్వతముగ నుండువానికిఁ బ్రతిఫలప్రాముఖ్యములు కలుగ నేరవు. కనుక నధికప్రజ్ఞావంతుల నిదియాకర్షింపఁ జాలదని ప్రతికూలవాదులు పట్టుదలతో వాదించుచున్నారు, పైనిజెప్పిన యుద్దేశములోనుండు బాధను నివారించుట కీవాదము ననుకూలవాదులు చేసినయెడల నాశ్చర్యము కలుగదుగాని ప్రతిపక్షులిట్లు వాదించుట మిక్కిలి విపరీతముగనున్నది. దేనినీపద్ధతికి నాక్షేపముగ బోధించుచున్నారో యదియే దానిని రక్షించునదగును.

రాజ్యాంగ సేవలోనికి దేశములోనున్న గొప్ప ప్రజ్ఞావంతులనందఱ నాకర్షించుట యే సాధ్యమైనయెడల నట్లుజరిగించెడు ప్రయత్నము నిజమయిన వ్యాకుల హేతువు కాఁదగియున్నది. సాకల్యదృష్టియు లేక సమష్టిప్రయత్నమును గావలసిన సాంఘిక వ్యవహారములన్నియు బోరశనమువారి చేతిలోనుండి వారిసేవలోనున్న వారందఱు నధికప్రజ్ఞావంతులే యైనయెడల కేవల విచారశీలురుదప్ప తక్కినయనుభవజ్ఞులును, సంస్కారులును, అందఱు నుగూడబహుతరమయినయుద్యోగస్థ్రి శాసన సమాజముగ (bureaucracy) సమావేశమగుదురు. సంఘములోని వారిందఱును సర్వపదార్థములును వారి వలననే లభింపవలెనని చూచుచుందురు. పామరజనులు చేసికొనవలసిన కార్యములన్నిటిలోను వారి యుపదేశమును, అనుజ్ఞను, నపేక్షించుచుందురు. సమర్థులై యుచ్చపద వాంఛగలవారు స్వలాభము నిమిత్తము వానినే యాశ్రయించుచుందురు. ఆ సమాజములోనికి స్వీకరింపఁబడుటయుఁ జేరినపిమ్మట దానిలో నుచ్చపదవిని జెందుటయు మాత్రమే యాపేక్షణీయము లగును. ఇట్టి ప్రభుత్వములో నీకూటము యొక్క పరివర్తనరీతిని ఖండించుటకుఁగాని నిరోధించుటకుఁగాని లోకములోనెక్కడ ననుభవసిద్ధ సామర్థ్యము లేకపోవును. నిరంకుశ ప్రభుత్వములో యాదృచ్ఛికముగఁగాని, జనసమ్మత ప్రతిష్ఠాపనకార్యముగఁగాని, యెప్పుడైననొక ప్రభువు లేక ప్రభువులు సంస్కారేచ్ఛకలి యున్న నాకూటమునకుఁ బ్రతికూలములైన సంస్కారములు జరుగుటకుఁకీలు లేదు. రష్యారాజ్యమిట్టి దురవస్థను జెందియున్నది. దానిసంగతిని గ పెట్టి చూచుటకుఁదగిన యవకాశము గలిగినవారు వ్రాసినచరిత్రలే దీనికి సాక్ష్యము. అటువంటి కూటముమీఁద రష్యాచక్రవర్తి నిరర్థకుఁడై పోవుచున్నాఁడు. ఆకూటములో నెవ్వరినైన సైబీరియాకుఁ బంపివేయవచ్చునుగాని వారికిష్టము లేకుండఁగను వారికివిరోధముగను పరిపాలింప నతనితరముకాదు అతఁ డేశాసనముచేసినను వారు దానిని తూష్ణీంభావముచేతనే ప్రతిషేధింపవచ్చును. ఇట్లు చేయుటకు వారాశాసనమును బ్రవర్తనములోఁ బెట్టకుండినఁ జాలును. ఇంతకంటె నెక్కువ నాగరికమును, జురుగఁబడునట్టిబుద్ధియు

గలిగినట్టి దేశములలోఁ బ్రజలు ప్రతివిషయమును దొరతనమువారే చేయుదురని యపేక్షించుట కలవాటు పడియుందురు. లేదా, దొరతనమువారి సెలవులేకుండ నేకార్యమును సయితమే విధముగను బూనుకొనరు. ఇట్టివారి కేవిపత్తు సంభవించినను వారాబాధ్యతను రాజ్యాంగముమీఁద వేయుచుందురు. ఆ కీడును భరించుట కోపికలేనపుడు వారు రాజ్యాంగముమీఁదఁ దిరుగఁబడి రాజ్యమును దలక్రిందు చేయఁ బూనుకొందురు. అట్టి సమయములో నా జాతివారివలనఁ గ్రమమయిన యధికారమును బొందినను లేకపోయినను, ఎవ్వఁడో యొక్కఁడు చటుక్కునసింహాసన మెక్కి పైనిజెప్పిన కూటమువారిని శాసింపఁ బూనుకొనును. ఇట్లు జరుగుటవలన వ్యవహారమంతయు విస్తారభాగము యథాపూర్వముగనే నడచుచుండును. ఆ స్థానమునకు రాఁదగిన సమర్థులెవ్వరు నుండరుగనుక నాకూటము మారిపోదు.

స్వతంత్రప్రజాలక్షణము.

వ్యవహారమును స్వంతముగఁజేసికొనుట కలవాటుపడిన ప్రజలలోనింతకంటె బహువిలక్షణమైన సంగతి కానవచ్చుచున్నది. ఫ్రాన్సుదేశమునందలి ప్రజలలోఁజాలమంది సైనికులుగఁబనిఁ జేసి, వారిలోననేకమంది యధమముకొద్దిపాటియుద్యోగులుగనైన సైన్యములోనుండి యుండుటవలనఁ బ్రజలలో దొరతనమువారిమీఁదఁ దిరుగబాటు పుట్టినప్పుడు వారినినడపించి యొకమాదిరిగ వ్యవహారపద్ధతినప్పటికప్పుడు కల్పింపఁగలవారు పెక్కండ్రుగలరు. సైనికవ్యవహారములలో ఫ్రెంచివారెట్లో, రాచరికపు సంబంధమైన ప్రతివ్యవహారమునందమెరికావారట్లున్నారు. వారికెప్పుడైన దొరతనము లేకపోవుట సంభవించినయెడ వారిలోఁ బ్రతిమనుజుఁడును బరిపాలనపద్ధతినొకటిని గల్పించిదానినైనను మఱియే యితరలౌకిక వ్యవహారమునైనను నడపించుటలోఁ గావలసినంత తెలివిని, గ్రమమును, మనోధార్ఢ్యమును జూపింపఁగలఁడు. స్వతంత్రులైన ప్రజలందఱును నీస్థితియందుండవలసినది. ఇట్టులుండఁగలవారు తప్పక స్వతంత్రులగుదురు. ప్రధానరాజ్యాంగ సూత్రముధరించిన యొక్కమనుష్యుఁడుగాని మనుష్యకూటముగాని యాసూత్రమును గట్టిగఁ

బట్టి బిగించినంతమాత్రమున వీరెప్పటికిని బానిసతనమునకు లోఁబడరు. ఇటువంటి ప్రజలకిష్టములేని కార్యమును వారిచేత నేప్రభుత్వకూటము వారు చేయింపఁజాలరు. ఒకవేళవారు స్వయముగఁ జేసినను వీరుసహింపరు. ఇది యిట్లుండ సర్వాధికారకూటము మూలమున జరుగుచుండెడి దేశములో నాకూటమునకుఁ బ్రతికూలమైనకార్య మేదియు జరుగఁజాలదు. ఈదేశముల పరిపాలనపద్ధతిప్రకార మనుభవమును వ్యవహారసమర్థతయుఁ గల ప్రజలనందఱనొక్కశిక్షకు లోఁబడిన కూటముగఁ జేర్చి వారిచేతఁ దక్కినవారిని బాలించుటకేర్పాటుకలిగి యుండును. కనుక నీయేర్పాటెంత శ్రేష్ఠముగనుండి సమాజముయొక్క యన్నితరగతులలో సమర్థులనెంత జయప్రదముగ నాకర్షించిన, నంతయెక్కువగఁ బ్రజలదాస్యము పరిపూర్ణమగును. అధికారికూటములోఁ జేరినవారుకూడ నీదాస్యమునకే లోనగుదురు. పరిపాలకులకుఁ బాలితులెంతదాసులగుదురో, పాలకులును వారేర్పఱచుకొనిన శిక్షకును, బద్ధతికిని, అంతేదాసులగుదురు చీనాదేశములో మిక్కిలి పేదకాఁపు నిరంకుశాధికారమునకెంతవఱకు దాసుఁడైయుండునో, యాధికారపదవియందున్నవాఁడు కూడనంతవఱకు దాసుఁడైయుండును. జెజూయిట్లను క్రైస్తవశాఖవారి పద్ధతియంతయు వారికి సమూహముమీఁద బలమును, బ్రాముఖ్యతను, సంపాదించుటకేర్పాటైనను, అందులోఁ జేరినవ్యక్తి యత్యంతము నీచదాస్యమునకు లోనైయుండును.

మతియొక్క నష్టము.

ఇంతియకాక దేశములోని సమర్థత నంతను పరిపాలకసంఘములోనికాకర్షించినందు వలన నీసంఘముయొక్క బుద్ధి చాకచక్యతకును, అభివృద్ధికిని, ఇప్పుడో మఱియొకప్పుడో వినాశమువాటిల్లునని జ్ఞప్తియుందుంచు కొనవలెను వీరొకకూటముగఁ జేరి స్థిరములైన సూత్రములప్రకారము నడచెడుపద్ధతిని జాలవఱకవలంబించి వ్యవహరించుటవలన నీయుద్యోగకూటము నిరంతర ముత్సాహశూన్యమైనత్రోవనుబడిపోయెడు దుర్దశకులోనైయుండును. లేదా, యీగానుగెద్దుయొక్కరీతి నప్పుడప్పుడు మాని యాకూటములోఁ బ్రముఖుఁడైన వానియూహకుఁదోఁచిన

యశక్య వ్యవహారములో సగము చూచియు సగము చూడకను బడిపోదురు. ఈ రెండులక్షణములును జూచుటకువిరుద్ధముగఁ గాన్పించునుగాని వీనికత్యంతము సంబంధము గలదు. కనుక వీనినదుపులోనుంచి కూటముయొక్క సమర్థతనుసయితము నుచ్చదశలోనుండునట్లు ప్రోత్సాహముకలిగించుటకు లోకములో వారితో సమాన ప్రజ్ఞావంతులుండి వారిచర్యలను గనిపెట్టిఖండనము జేయుటకంటె ప్రత్యేకశక్తి లేదు. కనుక నిట్టిసామర్థ్యమును గలిగించి యలఘు వ్యవహారములవిషయమై క్రమముగ విచారించుటకుఁగావలసిన యవకాశములను, అనుభవమును, సంపాదించుటకు రాజ్యాంగముకంటె భిన్నములైన సాధనములుండవలెను. సమర్థులగు నుద్యోగులకూటము శాశ్వతముగనుండవలెననియు, వీరభివృద్ధులను గల్పించుటకు సమర్థతయు వానిని వ్యవహారములో బెట్టుటకిష్టమును గలిగి, యధికారపదవిలోనుండి పండితంమన్యపదవిలోఁబడిపోకుండవలెననియు మనకుఁగోరికయే యున్నయెడల, మానవుల పరిపాలనమునకుఁ గావలసిన శక్తులను నిరూపించివృద్ధిచేసెడి వ్యవహారములన్నియు వీరియొక్కరి చేతిలోనుండఁగూడదు.

సమన్వయపర్యవసానములు.

మానవుల స్వాతంత్ర్యమునకును, అభివృద్ధికిని ఇంతవిఘాతములైన విపత్తులెప్పుడు ప్రారంభములగునో యదియు సంఘప్రాశస్త్యమునకడ్డమువచ్చు నాటంకములను దొలఁగించునిమిత్తము ప్రముఖుల నేర్పఱచి వారిమూలమున సంఘశక్తిని మొత్తముగఁబ్రయోగించుటవలన లాభములకంటె నష్టము లెప్పుడెక్కువయగునో అదియు నిశ్చయించి, లోకులచాకచక్యములో నధికభాగము రాజ్యాంగపథమునఁబడకుండుకీతిని బుద్ధిసామర్థ్యముల బ్రధాన రాజ్యకూటమునఁజేర్చిపొందఁగలిగిన లాభము నంతను సంపాదించుట రాజ్యతంత్రములో మిక్కిలికష్టమయినట్టియు చిక్కులుగలుగునట్టియు నంశమైయున్నది. ఇది చాలవఱకుఁబలువిధములైన పెక్కుసంగతులను విచారింపవలసిన యంశమైయున్నది. దీనినినిర్ణయించుట కవ్యభిచారకమయిన సూత్రమునువిధించుటకువలను పడదు. అయినను రాజ్యతంత్రమును జక్కఁగనడపుటకుఁ గావలసిన శక్తిపోవును. మిగి

లినదానినంతను బ్రజలలో వ్యాపింపఁజేసి వ్యవహారజ్ఞానమును మాత్రము ప్రధానస్థానమునఁ బోగుచేసి, అచ్చటనుండి, యన్ని దిక్కుల వ్యాపింపఁజేయుటయే సురక్షితమైన సూత్రమనియు, నిరంతరము దృష్టిపథము ననుంచుకొనవలసిన పరమావధి యనియుఁ బైనిఁజెప్పిన చిక్కును దొలఁగించుటకు జరుగుచుండెడియేర్పాటులను బరిశోధించుటకక్కఱను వచ్చు ప్రమాణమనియును నానమ్మకము. ఎట్లనఁగా స్వాతంత్ర్యముండు రాష్ట్రములలో వలెనే పట్టణపాలన విషయమునందుఁ బ్రత్యక్షముగ నఖిలాషగలిగి యున్న వారి చేతిలో వదలివేయుటకు వీలులేని వ్యవహారములను స్థానికోద్యోగులకు వెవ్వేఱుగఁ బంచిపెట్టవలసియుండును కాని, ఏకకేంద్రముగ స్థానికవ్యవహారములలోఁ బ్రతిశాఖయందును పైపెత్తనము జేయుప్రధానాధికారకూట మొకటి యుండవలెను. ఈకూటము మొత్తముమీఁద దేశమును బరిపాలించు రాజ్యాంగభాగమైయుండును. అన్ని దిక్కులనుండి లోకవ్యవహార ప్రవర్తనాంశము వలన గలిగినట్టియు, నితరదేశములలో నీవ్యవహారమును బోలిన సంగతులనుండి గ్రహించినట్టియు మొత్తముమీఁద రాజనీతిశాస్త్రాధ్యాయములను బట్టి నేర్చుకొనఁదగినట్టియు సర్వవిధములైన యనుభవజ్ఞానముల నాపైపెత్తనము చేయువారు ప్రతిశాఖాముఖమునఁ బోగుచేయవలెను. లోకములో జరిగినదంతయు దెలిసికొనుట కీపత్రికకు నధికారముండవలెను. ఒకచోట లభించిన జ్ఞానమును దక్కిన యన్ని చోట్ల లభింపఁజేయుటదానికి విధియైయుండును. కేవలస్థానీయమైన యల్పదృష్టిని, అల్పబుద్ధులను వదలి యున్నతస్థానమున నుండి బహువిస్తీర్ణమైన దృష్టితో వ్యవహారమును జూచుచుండుటవలన నది చేసెడు హితబోధ స్వభావసిద్ధముగనే గౌరవాస్పదమగును. కాని, దాని నొక్క స్థిరమైన ప్రతిష్ఠాపనముగా విచారించినప్పుడు మాత్రము స్థానికోద్యోగుల ప్రవర్తననిమిత్తము విధింపఁబడిన నియమముల ప్రకారము వారు విధేయులైయుండునట్లు బలవంతపెట్టుటకంటె నెక్కుడధికారము దీనికుండఁ గూడదు. సామాన్యములైనకట్టుబాటులలోఁ జేరని విషయములం దాయుద్యోగులను వారిబుద్ధికిఁ దోఁచినట్లు వదలివేయవలెను.

ఈవిషయములలో వారు ప్రజలకు బాధ్యులైయుందురు. నియమములకు భంగము గావించినయెడల వారు చట్టములకు బాధ్యులైయుండవలెను. ఈనియమములు శాసననిర్మాణశాఖవలన విధింపఁబడును. ప్రధానపరిపాలనాంగ మీనియమముల ప్రకారముపనిజరిగినదియు లేనిదియుఁగని పెట్టిచూచివానిప్రకారము పనిజరుగనియెడల న్యాయసభలమూలమున నాచట్టమును బ్రవర్తింపఁజేయవచ్చును. లేదా, దాని యుద్దేశప్రకారము ప్రవర్తింపని యుద్యోగులఁబోలఁగింపుమని వారి నేర్పఱచిన ప్రజలతోఁ జెప్పవచ్చును. ఈరెండిఁటిలో నేది సమయోచితమో దానినిజరిగింపవచ్చును. దేశమునందంతటను దరిద్రుల నిమిత్తము పన్ను వేసి పోగుచేసినద్రవ్యమును వినియోగపఱచు నుద్యోగులమీఁద బెత్తనము చేయుటకేర్పడిన కూటు (Poor Law Board) మీయుద్దేశముతోనే యేర్పాటు కాఁబడినది. విశేషమైన యొకసంగతిలో నా కూటమీపరిమితినిదాఁటి యధికారమును వహించినయెడల నదియగత్యమును క్షమమునైయుండవచ్చును. ఒకచోట వ్యవహారకాండ చెడిపోయినయెడల నాచోటు దారిద్ర్యమునకునికిపట్టయి యితరస్థానముల కా దారిద్ర్యము వ్యాపించి కష్టపడి పనిఁజేయువారి శరీరారోగ్యమును నీతినిగూడఁ బాడుచేయును. కనుక నాప్రదేశమిట్లు దారిద్ర్యమున కాకరమగుట దుర్నీతియనిపించుకొనును. కాఁబట్టి యాయా ప్రదేశములను మాత్రముగాక సంఘమునంతను బాధించెడి దుష్పరిపాలనాభ్యాసములను నివారించుట కాసభవారు పరిమితినిదాఁటి యధికారమునుబూనినను క్షమమగును. వ్యవహారమును నడపుటలో బలవంతముచేసి యప్రధానాంశములలోఁ జట్టములనిర్మించుట కీసభవారి కధికారముగలదు. వీరు లోకాభిప్రాయ బలమును బట్టి యీయధికారమును మిక్కిలియరుదుగ నుపయోగించుచున్నారు. ఉత్కృష్టజాతీయప్రాశస్త్యము నిమిత్తమీ యధికార వినియోగము క్రమమే యైనను కేవలస్థానీయ వ్యవహారపాలన మందిది మిక్కిలియసందర్భమై యుండును. కాని, పరిపాలనాంశ మేదియైనను విజ్ఞానమును సంపాదించి సర్వత్రవ్యాపింపఁజేయు సాధన మన్నివిధముల శ్రేష్ఠమైయుండును. వ్యక్తిప్రయత్నాభి వృద్ధుల

నశికట్టక సహాకారిగాఁ బ్రోత్సాహపఱచు కృషివిధానము ప్రభుత్వము వారెంతచేసినను గొఱవడియే యుండును. వ్యక్తులయొక్కయు, వ్యక్తిసంఘములయొక్కయు, శక్తి చాకచక్యముల నుపయోగించుకొనక వానిస్థానే దొరతనమువారి కృషి విధానముల నుపయోగించుకొనునప్పుడనర్థము కలుగుచున్నది. ఇంతియేకాక వ్యక్తులకును, వ్యక్తిసంఘములకును విషయ వివేచనము గలిగించి యుపదేశించి వలయుకెడ నిషేధించి తోడ్పడుటకుమాఱుగా వారిని పీరియాజ్ఞా శృంఖలబద్ధులను జేసి పనిచేయించుటయు, లేక వారిని వేఱుగానిలిపి తాము పనిచేయుటయు, ననర్థదాయకమై యున్నది. కాలక్రమమున రాష్ట్రములోని వ్యక్తులయొక్క ప్రయోజకత్వమే రాష్ట్రముయొక్క ప్రయోజకత్వమైయుండును. ఏరాష్ట్రములో వ్యక్తులయొక్కయు, వ్యక్తిసంఘములయొక్కయు మనోవికాసౌన్నత్య సాధనముల నిలిపిపెట్టుచు నెక్కుడు పాలనా చాతుర్యమునకుఁ గాని, వ్యవహారవిషయ వివరములలో వాడుకవలనఁ గలిగెడి నట్టిదానికిఁ గాని, ప్రాముఖ్యమొసగఁబడునో, ఏరాష్ట్రములో లాభకరములగు కార్యములందైనను జనులు వశవర్తులైయుండుట కొఱకు వారభివృద్ధిఁజెందకుండ నుంచఁబడుదురో, యచట ప్రభుత్వమువారల్పజ్ఞుల వలన ఘనకార్యములు నెఱవేర్పఁబడవని తెలిసికొందురు. మఱియు, రాజ్యయంత్రము శాంతముగా నడచునట్లు చేయుటకై జీవశక్తి పరిత్యక్తమై యుండుటచే, రాజ్యతంత్రముయొక్క యేసంపూర్ణ దశాప్రాప్తికై తక్కిన సర్వాంశములు త్యజింపఁబడెనో, యాపరిపూర్ణత తుదకు నిష్ప్రయోజన మయ్యెననియుఁ బ్రభుత్వమువారు తెలిసికొందురు.



సంపూర్ణము.

# ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము (లిమిటెడ్)

ఆంధ్రభాషయందుఁ బ్రకృతిశాస్త్ర దేశచరిత్ర మహాపురుష జీవితాది విషయక గ్రంథములు లేనిలోపమును నివర్తింపఁజేయఁగలందులకుఁ గాను రు 10000-0-0 ల మూలధనముతోడ నీకంపెనీని స్థాపించి రిజిష్టరు చేయించియున్నారు.

## ఆంధ్ర భాషాభివర్ధనీ ప్రకటనములు.

1 భారతధర్మదర్శనము — (ద్వితీయ ముద్రణము) మనోహరాలంకార శోభయొదవఁ దేనెలొలుకు తియ్యనిపలుకులఁ జదువరుల కమందానంద మగ్నులఁ గావించుచు నిర్మల దేశానురాగముఁ బ్రబోధించు పద్యకావ్యము. వెల రు 0-2-0 లు చందాదారులకు రు 0-1-6

2 పీష్వానారాయణరావు — (ద్వితీయ ముద్రణము) శోకకరుణాది రసపూరితంబై చక్కఁగ వ్రాయఁబడిన వచనకావ్యము. వెల రు 0-2-0 చందాదారులకు 0-1-6

3 అక్బరుచరిత్ర — సర్వసద్గుణాలంకారుండై సుకవిజన వర్ణనీయుండై, సర్వజనసమత్వంబుగల్గి, విమలకీర్తిగాంచిన చక్రవర్తియొక్క పుణ్యచారిత్రము. వెల రు 0-7-0; చందాదారులకు రు 0-5-0

4 సిక్కులచరిత్ర. ద్వితీయ ముద్రణమునందుచున్నది.

5 వివేకానంద స్వాములవారి జీవితము — మనోహర వాగమృతధారం గురిపించి భరతవర్షంబు వారింతటి మహనీయులే! బళే! అనిపాశ్చాత్యులు దలంచునట్లొనర్చిన మహాయోగిజీవితము ,157 పుటల గ్రంథము. పటములతోఁ వెల రు 0-10-0; చందాదారులకు రు 0-6-0

6 విద్యాసాగరుని చరిత్ర — నిశ్చల విజ్ఞాన విశారదుండు, ననిర్వచనీయ కళ్యాణగుణాకరుండు, నార్తజనసంత్రాణపరాయణుండు నగు పుణ్యపురుషుని దివ్యచారిత్రంబు. 150 పుటలగ్రంథము. (పటములతో) వెల రు 0-9-0; చందాదారులకు రు 0-6-0

7 రామమోహనరాయలచరిత్ర — అనాథలగు యువతులను బట్టి బలవంతముగఁ గాల్చివేయు సతియను భయంకరాచారంబు నడంచి తనమాతృభూమి యగుభరతవర్షంబు నుద్ధరింప మనకొఱకనేక

యుపన్యాసముల నిచ్చి కార్యవిజయము గాంచునవఱకుఁ బట్టు విడువక తన దేశమాతకొఱకు పాటుపడుచుండిన మహాపురుషుని పూజ్యచారిత్రము. 200 పుటల గ్రంథము పటములతో, వెల రు 0-12-0; చందా దారులకు రు 0-8-0

8 స్వాతంత్ర్యదర్శనము — వెల రు 0-12-0 చందా దారులకు రు 0-7-0 మాత్రమే.

9 మహారాష్ట్రచరిత్ర — ప్రథమభాగము. గిల్టుఅక్షరములతోఁ బ్రశస్తమగు కాలికో బైండు చేయఁబడినది. మహారాష్ట్ర దేశ పుచిత్రపటము 18 పటములుగలవు 500 పేజీలు, వెల రు 1-14-0 లు చందాదారులకు రు 1-4-0 మాత్రమే

నవీనముగా ముద్రితములై సిద్ధముగానున్న గ్రంథములు.

10 ఆరోగ్యశాస్త్రము.

11 ఆంగ్లేయులచరిత్ర.

12 అశోకునిచారిత్రము.

13 చీనాచరిత్రము,

14 పశుశాస్త్రము

ముద్రణములోనున్న గ్రంథములు.

15 అవురంగజేబు చరిత్రె.

16 మహారాష్ట్రచరిత్ర (రెండవభాగము)

17 ఆంధ్రదేశచరిత్ర.

18 జపాను చరిత్ర.

19 అమెరికాచారిత్రము.

మాశాశ్వతపుచందాదారులకుమాచేఁ బ్రచురింపఁబడిన గ్రంథములు, బ్రచురింపఁబడబోవు గ్రంథములు 100 పుటలకు రు 0-4-0 ల చొప్పున నిచ్చుచుండెదము.

మే నే జ రు,

ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము, మచిలీపట్టణము.

# విషాద

# పుళిందా సుశీలము

·:0:·

ఆంగ్లేయ కవికుల సార్వభౌముండగు విలియం షేక్స్పియరుయొక్క అద్భుత నాటకంబగు ఒథెల్లో అతిమనోహరంబుగ గద్యపద్యములతో చిల్లరిగె శ్రీనివాసరావుగారిచే రచింప బడినది. ఇందలి పాత్రముల యొక్క గుణపరివర్ధనయు, భావరసగుంభిత ప్రయోగములును, ఆంధ్ర నాటకరంగ ప్రదర్శనంబునకు నూతనసోయగంబు నొసంగి ప్రేక్షకుల కత్యంతాహ్లాదంబు నొసంగును. ఈ నాటకము ఆంధ్రంబున నే మాత్రమును విదేశీయ వేషం బును గలిగి యుండక స్వచ్ఛముగ దేశీయనాటకంబువలె కనుపడు నటుల భాషాంతరీకరింపబడినది. మన దేశమున కాళిదాసు యెట్టి ప్రసిద్ధి గాంచెనో యట్టి ప్రఖ్యాతి నే షేక్స్పియరు ఇంగ్లాండునందు సంపాదించియుండెను. ఇతని యొక్క జీవితమును, ఇంకను ఇంగ్లీషు నాటకములవలంబించిన నాటక లక్షణం బులును, ఆ కాలమున నింగ్లాండులో నాటక సంబంధమున ప్రజలకును నాటకు లకును ఉండియున్న, అభిప్రాయములును పరివర్తనలును ఉపోద్ఘాతంబున తెలియచేయం బడినవి. ఇది అయిదంకముల నాటకమై ప్రేక్షకులకు విరామంబులేని యుత్సుకంబును కలుగ జేయుచుండును.

దీనివెల 12 అణాలు

వలయువారు ఈ క్రింది విలాసమునకు వ్రాసికొనవచ్చును.

సేతుబ్రదర్సు, మచిలీపట్టణము.